# ట్రిలో

## ఉపయోగించడానికి మీకొక మంచి కారణం:




## ఇతర ప్రముఖ డిటర్జెంట్ బిళ్లలకన్న
# దీని ధర 30% తక్కువ.

### ఇవిగో, ఇంకా మూడు కారణాలు:

## మరింత నురుగు



దీని సమృద్ధమైన నురుగు మరే డిటర్జెంట్ బిళ్లకన్న ఎక్కువ బట్టలను శుభ్రం చేస్తుంది.

## మరింత ఉతికే శక్తి

అతిగా మాసిన బట్టల్ని కూడ చక్కగా శుభ్రం చేయగలది ట్రిలో. అందులోనే ఉన్న బ్లూ తెల్లటి బట్టలకు వాటి అసలు తెల్లదనపు మెరుపు తెస్తుంది.



## మరింత మన్నిక




ట్రిలో సులువుగా మెత్తబడిపోదు. అందుకే అందులో వృధాపోయేది ఎంత మాత్రం ఉండదు. పూర్తిగా అరిగిపోయేదాకా ట్రిలోను వాడవచ్చు.

**ట్రిలో** — <u>మరింత</u> ఉపయోగకరమైన నీలి డిటర్జెంట్ బిళ్ల.

Godrej ఉత్పాదన

CHAITRA-GS-188 TEL

## మనవి

డా. జయ్‌దుబాషీ విదేశ పర్యటనలో ఉన్నందువల్ల ఈవారంకూడా 'న్యూఢిల్లీలేఖ' వెయ్యలేకపోతున్నాము.

సకాలానికి అందని కారణంగా హైదరాబాద్ నోట్‌బుక్ ప్రచురణ సాధ్యం కాలేదు.

—సం.

## ముఖచిత్రం

7–10–83 నాటి ఆంధ్ర సచిత్ర వారపత్రిక ముఖచిత్రం చాలా సుందరంగా వుంది.

రేపాక రఘునందన్ (తిరువూరు)

## కొత్త గొంతులు

దాదాపు 9 మాసాలపాటు 'కొత్త గొంతులు' అన్న శీర్షికను శ్రీ టి. యల్. కాంతారావుగారు ప్రతిభావంతంగ నిర్వహించడం ఎంతైనా ప్రశంసనీయం. సాహిత్యాభిమానులమైన మాకు ఇలాంటి శీర్షికలు ఎంతో ఆసక్తిదాయకంగ వుండడం సహజం.

ఆవుల రమణారెడ్డి
(జమ్మలమడుగు)




## సీరియల్

మానసమురళి, మూగముత్యాలు చాలా బాగున్నవి. మా హృదయాలను ఆకట్టుకున్నవి.

బి. అశోక్‌కుమార్ (వరంగల్)

## ఆంధ్రుల పత్రిక

1958 నుంచీ అంటే నాకు పదేళ్ళ వయసు నుండీ ఆంధ్రపత్రిక చదువుచున్నా గత పదేళ్ళుగా వరుసగా చదవడానికి నోచుకోలేకపోయాను. ఇప్పటికీ నాకు బాగా గుర్తు. అప్పుడు యింటికి 'పత్రిక' వచ్చిందంటే ఒకరి చేతిలో ఒకరు లాక్కొని మరీ చదువుకునే వాళ్ళం. అప్పుడు ఆంధ్రపత్రికలో కథ పడాలంటే చాలా గొప్ప విషయం. పడిందంటే మిగతా పత్రికవాళ్ళు అతని రచనలను కళ్ళుమూసుకుని వేసుకునేవాళ్ళు. ఒక పాత సంచికనైనా వుంచుకోలేకపోయానే అని మూగవేదనగా వున్న నాకు 'వజ్రోత్సవ సంచిక' వస్తుందంటే నా ఆనందానికి అంతే లేకుండా పోయింది, బైండింగ్ చేయించి గుండెల్లో దాచుకోవడానికి.

అప్పటికి, ఇప్పటికి, ఎప్పటికినీ భారతీయ తత్వాన్ని ప్రతిబింబిస్తూ ఆంధ్రుల సంస్కృతిని అద్దంపట్టే మనపత్రిక ఆంధ్రపత్రిక. అటువంటి పత్రికయొక్క పాతసంచికలు కొన్నిపోయాయంటే నాకు చాలా బాధగ వుంది. వెల ఎంతయినా అమూల్యమైన పత్రిక ఆంధ్రపత్రిక. తరాలు మారినా ఆంధ్రుల హృదయాలలో చెరగని తరగని పత్రిక మన ఆంధ్రపత్రిక. ఇప్పటికైనా వున్న సంచికలన్నిటినీ అంటే ఆంధ్రుల సంస్కృతిని అంటే ఆంధ్రుల జీవన తరంగాలను విద్యుత్ తరంగాలుగా మార్చి శాశ్వతంగా పదిలపర్చవల్సిందిగా ప్రార్థిస్తున్నాను.

రేడియోస్టేషన్లు, సినిమాలు, పత్రికలు—మూడు ప్రాంతాల వారిని అటు కలుపులలోను ఇటు భాషావాడకంలోను ఎంతగానో తోడ్పడినా వీటిలో మూలము అగ్రతాంబూలము మన ఆంధ్రపత్రికదే! ఆంధ్రపత్రిక కొన్ని ప్రాంతాలవార్ని 'పాలిష్'చేసిందనుటలో కూడ అతిశయోక్తి లేదు. అటువంటి ఈ పత్రికను స్థాపించిన—మహాపురుషుడు, విశ్వదాత, కళా తపస్వి, దేశోద్ధారకుడు అయిన శ్రీ నాగేశ్వరరావు పంతులుగారు పదహారు అణాల ఆంధ్రుడు. వారి సేవ అద్వితీయము, వారు కారణజన్ములు. నాగపూరు నుండి మధుర వరకు అంటే దాదాపుగా దక్షిణ భారతమంతా వున్న మన ఆంధ్రులను ఏకోన్ముఖులుగా చేయుటకు వారు ఎంతగా శ్రమించారో! తపించారో! చెప్పనలవికాదు.

నాగేశ్వరరావు పంతులుగారు అందరియందును సమానమైన దృష్టితో వుండేవారని చెప్పుటకు 'వర్ణ మహాసభలు' కూడా అప్పుడు అచ్చువేయుట వారి కులరహిత తత్వానికి ఒక మచ్చుతునక. జనసంఖ్యలో ఎక్కువగా వున్నటువంటి రైతులే శాఖోపశాఖలై ఉపవర్ణములుగా ఏర్పడినట్లు విశదమగుచున్నది. చిన్నప్పుడే ఎంతో విజ్ఞానాన్ని సంపాదించిన మన 'పంతులు'గారు 'తెలుగు జాతి'నే తమ వర్ణముగ భావించారు.

నా చిన్నప్పుడు చదివిన కథలు మళ్ళీ చదవడమే గాకుండా నేను పుట్టకముందు రచనలు వజ్రోత్సవసంచికలో చదవగల్గడం నాఅదృష్టంగా భావిస్తున్నాను. మొదటి సినిమా బాలట్ చూడగల్గాను. బావుంది. సినిమా శీర్షికలు బాగున్నాయి.

పి. శ్రీరామకృష్ణారావు (బందరు)

పై వారమే

దీపావళి సంచిక

1983 దీపావళి

కథలపోటీ ఫలితాలు!

బహుమతి పొందిన కథలు!

కొత్త సీరియల్

అనురాగ తరంగాలు

రచన : శ్రీమతి జి. భవానీ కృష్ణమూర్తి

నటి వాణిశ్రీ ఇంటర్వ్యూ

ప్రత్యేక కార్టూన్‌లు, వ్యాసాలతో

వెలువడుతుంది!

# ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు :

**దేశోద్ధారక కాశీనాథుని**

**నాగేశ్వరరావు పంతులుగారు**

స్థాపితం : 1908

***శివలెంక శంభుప్రసాద్***

**సంపాదకుడు :**

[1938–1972]

శుక్రవారం : 4–11–'83

రుధిరోద్గారి నామ సం.ఆశ్వయుజ బ. అమావాస్య

**సంపుటము 76 సంచిక 8**

**సంపాదకుడు :**

***శివలెంక రాధాకృష్ణ***

విడి ప్రతి వెల రు. 1-50

ఆరు మాసాల చందా రు. 42-90

పోస్టులో ఏడాది చందా రు. 85-80

**ఆంధ్రపత్రిక కార్యాలయము,**

గాంధీనగరం. విజయవాడ-520 003.


## విషయానుక్రమణిక





# కాంగ్రెసువారు మంత్రిపదవులను స్వీకరింపగూడదు

## ఒక ప్రకటన

ఈ ప్రకటనలో 60 మంది కాంగ్రెసు ప్రముఖులు సంతకములు చేసిరి. కాంగ్రెసు వారు మంత్రిపదవులను స్వీకరింపగూడదనుటకు చాల కారణములు దీనిలో నున్నవి. ''శాసనసభలకు వెళ్లిన కాంగ్రెసు వారిలో చాలమంది సత్యాగ్రహమునందు తమకు నమ్మకము కలదని తెలుపుచునే మంత్రిపదవులను స్వీకరింప వలెనని గూడ ప్రచారము చేయుచున్నారు. నూతన రాజ్యాంగ విధానమున విషమములగు పెక్కు సమస్య లేర్పడినవి. సామ్రాజ్యకాంక్ష గల బ్రిటను దొరతనమువారు రచించిన రాజ్యాంగ విధానమును కాంగ్రెసు వారంగీకరింపగూడదు. దానిని కొనసాగింపగూడదు. మంత్రిపదవులను స్వీకరింప గోరువారు చాల ప్రచారము చేయుచున్నారు గాని ప్రతికూలురుగానున్న వారిప్పటి వరకును ఎట్టి




ప్రచారమును చేయుటలేదు. కాని వీరి సంఖ్యయే మిక్కిలి హెచ్చుగా నున్నదనుట నిశ్చయము. శాసనసభలలో కార్యక్రమము జాతికంతకును సంబంధించినది గాని శాసనసభలకు ఎన్నుకొనబడిన వారికి మాత్రమే సంబంధించినది కాదు. అది చాల ముఖ్యమైనది గాన దానిని గూర్చి బాగుగా నాలోచింపవలెను'' అని ఈ ప్రకటనలో నున్నది.

### సర్దారు శార్దూలసింగు కవీశ్వర మున్నగువారి ప్రకటన

''కాంగ్రెసు చరిత్రలో నిపుడు చాల విషమ స్థితి యేర్పడినది. పెక్కువత్సరములపాటు చురుకుగా సత్యాగ్రహమొనరించి నాయకులును ప్రజలును గూడ నలసిపోయిరి. అందువలన వారు మరల క్రమక్రమముగ ప్రభుత్వముతో సహకారమొనరించు దారిబడి ఒక్కొక్క మజిలీని దాటుచున్నారు. వీరినిటుల తప్పుదారిని చాల దూరము పోనిచ్చినచో స్వరాజ్య ఉద్యమమునకు చాలనష్టము కలుగును. ఈ సహకారపద్ధతి నిరుపయోగమని బాగుగా తెలుసుకొని 15 ఏండ్ల క్రితము కాంగ్రెసువారు దీనిని పరిత్యజించిరి.

### సత్యాగ్రహము

వెంటనే నూతనమును విఖ్యాతమును అహింసా ప్రధానమునగు సత్యాగ్రహ ఉద్యమము ప్రారంభి పబడెను. ఇప్పుడది కాంగ్రెసుకు ప్రాణ రక్షమైయున్నది. దాని మూలాధారములు దుర్బలములైనచో నది చెడిపోవును. కాంగ్రెసువారు ఎల్లకాలమును సత్యాగ్రహము నొనరించుచునే యుండవలెనని మా అభిప్రాయము కాదు. అది మంత్రిపదవులను స్వీకరించుటను గూర్చిన సమస్య ముఖ్యతమము. ఇతర విషయములలో నభిప్రాయ భేదములు నుండగూడదు. గాని దీని విషయముననే భిన్నాభిప్రాయములు మిక్కిలి హెచ్చుగా నున్నవి. కాంగ్రెసువారు మంత్రిపదవులను స్వీకరింప వలయునని కొంతమంది కాంగ్రెసు నాయకులు గట్టి ప్రచారము చేయుచున్నారు. కాంగ్రెసువారు మంత్రిపదవులను స్వీకరించుట సత్యాగ్రహమును పూర్తిగా విరమించుటయే యగును.

### కీడులో మేలు

మంత్రి పదవులను స్వీకరింపగోరువారు గూడ నూతన విధానమును భంగపరుపవలెననియే తెలుపుచున్నారు గాని దానిని కొనసాగింపవలెనని తెలుపుట లేదు. ఇది కీడులో మేలు.

### లాభములు పూజ్యము

వీరు మంత్రిపదవులను స్వీకరించుటవలన దేశమునకు చాల లాభము కలుగునని తెలుపుతున్నారు. వీరెట్టి లాభమును కలిగించజాలరు. మంత్రిపదవులను స్వీకరింపవలసినవారు సహకారవాదులే యగుదురు.

### ప్రతికూలాందోళనము

కాంగ్రెసువారు మంత్రిపదవులను స్వీకరింపగూడదని కోరుచున్న వారి సంఖ్యయే దేశమునందు మిక్కిలి హెచ్చుగానున్నది. గాని మంత్రి పదవులను స్వీకరింపగోరువారు గట్టి ప్రచారమును చేయుచుండినను స్వీకరింపగూడదను వారెట్టి ప్రచారమును చేయుటలేదు. వారిలో నైకమత్యమును చురుకుతనమును శ్రద్ధయు ను గూడలేవు. వారు కేవలం ఉదాసీనులుగా నున్నారు. ఇది మిక్కిలి అనుచితము.

### ప్రతికూలుర సభ

కాంగ్రెసువారు మంత్రిపదవులను స్వీకరింపవలెనను నాందోళనము భారత జాతీయతకు సంబంధించిన ముఖ్యతమమగు విషయము గాన దీనిని గూర్చి మిక్కిలి శ్రద్ధగ నాలోచింపవలెను. ఈ విషయమున కొందరు పనిని ప్రారంభించినందులకు మేము చాల సంతసించుచు వారికి సర్వవిధముల తోడ్పడుచున్నాము. దీనిని గూర్చి ప్రత్యేకముగా సభను జేయదలచిరి గాన ఆ సభలో ప్రతికూలురు తమ అభిప్రాయములను తెలుపుటకు వీలుకలుగును.'' అని ఈ ప్రకటనలోనున్నది.




### సంతకములు చేసినవారి పేర్లు

కవీశ్వర సర్దారు శార్దూలసింగు, శ్రీప్రకాశగుప్త, సంపూర్ణానంద, నరేంద్రదేవు, రఫీ అహమదు కిద్వాయి, డాక్టరు మురారిలాలు, ప్రొఫెసరు ఇంద్ర, యూసపు మెహరాలీ, రావు సాహెబు పట్వర్ధను, ప్యారీలాలుశర్మ, జయప్రకాశ నారాయణ, శ్రీమతి కమలాదేవి ఛటోపాధ్యాయి, జగతు నారాయణలాలు, సి.బి. గుప్త, విశ్వంభర దయాలు త్రిపాఠీ, హరిహరనాధశాస్త్రి, ఎం.ఆర్. మసానీ, అచ్యుతపట్వర్ధను, న్యాయవాది శార్దూల సింగు హరిసింగుగోర్, అలిగూరి శాస్త్రి, కేదారినాధ సీగలు, శంకరను నంబూద్రీపాదు, కిసనుసింగు. శంకరులాలు, మోహనలాలు గౌతమి, శ్రీమతి సత్యవతీదేవి, జుగలు కిశోరుఖన్న, సి.ఎల్. పారీలాలు, కామీ గోపాలసింగు, ఠాకూరు మాల్యాను సింగు, డాక్టరు సంపతు మెహతా, హిందూలాలు యాగ్నిమి, గంగాశరణ సింగు, ఏ.పి. సింహ ఆశ్వత్థ మెహతాగార్లు మున్నగువారు ఈ ప్రకటన పైన సంతకములు చేసిరి.

**ఆంధ్రపత్రిక**
**1936 జనవరి 22**
**సంచిక నుంచి**

# తలనొప్పికోసం ఎన్నో వాడి చూశాను...

-మెజీషియన్

చివరికి, నేను
తీసిన కుందేలుతోనే
తల మార్చుకుందా
మనుకున్నా...

## అయితే నిజంగా పనిచేసేది ఒక్కటే!

# సారిడన్




ట్రేడ్ మార్కు 'రోష్'

శక్తివంతమైనది. సురక్షితమైనది. ఒక్కటి వేసుకుంటే చాలు.

HTB-RPL-9322

# వరమివ్వని వయ్యారిభామ

## — డాక్టర్ గంధం సాయి రమేష్

"సంతోష్ ... మూడు వారాల పైగా అయినట్లుంది శారా ఆచూకీ ఏమైనా తెలిసిందా" అని అడిగింది హెలీనా ఫేర్‌వెల్ పార్టీ యివ్వటానికి రోజర్ యింటికి ఆహ్వానిస్తే.

"నో..." అన్నాడు సంతోష్ ముక్తసరిగా.

ముఖకవళికలు కనిపెట్టి—"వై డోంట్ యు గోటు పోలీస్" అని అడిగాడు రోజర్ గుచ్చి గుచ్చి చూస్తూ.

"డు యు థింక్ సో ..." కలవరపాటు కనిపించింది సంతోష్ కళ్లల్లో.

"వెల్ ... అందులో తప్పేమీలేదుగా ... వాళ్లకి చేతనైతే సహాయం చేస్తారు... లేకపోతే సారీ అని చెప్తారు... ఏమంటావు" సలహా యిచ్చింది అందాల హెలీనా.

"దట్స్‌రైట్" రోజర్ వంతపాడాడు.

"అవును సంతోష్... వుయ్ మస్ట్ ఫైండ్ హెర్ ... పూర్ సోల్ ఎక్కడుందో ఏం చేస్తుందో... ఏ మాట కామాట చెప్పుకోవాలి సుమా... శారా ఈజ్ ఎ రియల్ నైస్ గర్ల్... కాని అప్పుడప్పుడు అలా పిచ్చిగా ప్రవర్తిస్తుందంతే... మేము ట్రయినింగ్‌లో వున్నప్పుడు కూడా అంతే...తిక్క కుదిరేదాకా మాతో మాట్లాడేది కాదు. అఫ్‌కోర్స్ యు ఆర్ హెర్ హస్బెండు...సో... యు మస్ట్ టేక్‌నో నోటీస్ ఆఫ్ ఆల్ దిస్'" హెలీనా ఏదో చెప్పుకుపోతోంది. ఎవరు వింటున్నారో ఎవరు వింటంలేదో పట్టించుకోకుండా.

"ఆల్‌రైట్ డార్లింగ్... యిప్పుడదంతా ఎందుకు కాని... లెటజ్ సెలిబ్రేట్... టెల్ మి మై ఫ్రెండ్...వాట్ వుడ్ యు లైక్ టు హేవ్... జిన్ అండ్ టానిక్ ఆర్ వోడ్కా అండ్ లెమనేడ్..."

మాటల మధ్య అడ్డుతగిలాడు రోజర్

**( గత సంచిక తరువాయి )**

కళ్ళసైగతో ముద్దుల యిల్లాల్ని మెల్లగా మందలిస్తూ.

లాంజ్ యూనిట్‌లో భద్రంగా దాచిపెట్టుకున్న మదిర పానీయాల్ని బయటకు తీసి తలొక్క గ్లాసులో తల తిక్క వదిలించేటంత మత్తు పానీయం పోసి, జిహ్వ జివ్వనేలా షరబత్ కలిపి అందించాడు రోజర్ "దేర్ యు ఆర్"అంటూ.

భర్త ఆంతర్యం పసికట్టిన హెలీనా మూతి తిప్పుకుని చిరునవ్వుతో చిరుకోపం కప్పిపుచ్చుకుంటూ తన గ్లాసు అందుకొని కిచెన్‌లోకి వెళ్ళింది నీరాలో నంజుకోవటానికి సేండ్‌విచ్ తయారుచేసే నెపంతో.

అదే తేడా భారతీయ నారీమణికీ, ఆంగ్లేయ అభ్యుదయ యువతికీ. భర్త ఏమన్నా పడి వూరుకోవటం, అనాదిగా ఆంధ్రదేశపు ఆడదినేర్చుకున్న అపురూపమైన విద్య. ఎదురుతిరిగి వెటకరించ గలగటం పడమటి దేశాల పడతులు అలవాటు చేసుకున్న ఆదర్శం. అందుకే ఏర్పడిందేమో తూర్పుకీ పడమరకీ అంత వ్యత్యాసం ??

* * *

స్నేహితుడి సలహామీద ఆఖరికి పోలీసు రిపోర్టు ఇవ్వటానికే నిశ్చయించుకున్నాడు సంతోష్ ఎందుకైనా మంచిదని.

వివరాలన్నీ ఓ పెద్ద ఫిర్యాదుల పుస్తకంలో ఎక్కిస్తూ ఎదుటి వ్యక్తిని పై నుంచి క్రింది వరకూ ఏదే పదే పరికిస్తూ ప్రారంభించాడు, డిటెక్టివ్ పి; సి. డేవిడ్ కార్టర్, పెద్ద ఉపోద్ఘాతంతో చిన్న వుపన్యాసం.

"లుక్... డాక్టర్ సంతోష్... నీభార్య చేసిన పని తప్పో వప్పో తేల్చి చెప్పటం చాలా కష్టం... పైగా అది పోలీసువారి వృత్తి వ్యాపారం కూడా కాదు... యు నో వాట్ అయ్ మీన్ డోంట్ యు ?"

ఎంత తెల్లగావున్నా ఆ పోలీసుదొర వెకిలిగా చూస్తూ పళ్ళు యికిలిస్తుంటే చూడవికృతంగా కనిపించాడు సంతోష్‌కి. అయినా చేసేది లేక తల వూపాడు నిస్సహాయంగా చూస్తూ నోట్లో తిట్టుకుంటూ.

"అదీకాకుండా ఈ దేశంలో పుట్టిపెరిగిన నీలాంటి యువకుడికి యిక్కడి మనుషులు నడవడికలు నాగరికతలు సరిగ్గా తెలీవంటే ఎవరూ నమ్మరు... అవునా... అఫ్‌కోర్స్ కొత్తలో నీకు కాస్త ఎబ్బెట్టుగా కనిపించి వుండొచ్చు అనుకో... ఎంత అలవాటైనా యిండియన్ మెంటాల్టీ ఎక్కడికి పోతుంది చెప్పు..." దృఢమైన డేవిడ్ కార్టర్ దర్పంగా నవ్వుతూ వెటకరించాడు.

అయినా ఓర్చుకున్నాడు సంతోష్ అవసరం కొద్దీ.

"నీ కెంత స్వేచ్ఛ స్వాతంత్ర్యాలు వున్నాయో నీ బెటర్‌హాఫ్‌కీ అంతే...కాదంటావా చెప్పు... అలా అని నువ్వు తప్పుచేసి వుంటావు అనటంలేదు... తప్పంతా ఆమెదే అనలేను... యు నో హౌ డెలికేట్ యిష్యూ దిసీజ్... కాని ఒకటి గుర్తుంచుకో డాక్టర్ సంతోష్... నీ భార్యకి నీతో సంసారం చేయటం యిష్టం లేకపోతే యిల్లు విడిచి పోవటంలో కూడా తప్పు లేదేమో... డోంట్ యు ఎగ్రీ? ఎనీ వే... అయామ్ టెరిబుల్ సారీ ఫర్ నాట్ బీయింగ్ ఏబుల్ టు హెల్ప్ యు... ఆమెకి ఏదైనా హాని జరిగితే కాని లేదా ఆమె ఎలాంటి అఘాయిత్యానికైనా తలపెడ్తే తప్పించి మా పోలీసు డిపార్ట్‌మెంట్ ఏమీ చెయ్యలేదు... ఏ ఏక్షను అయినా తీసుకోటానికి మీ ఆవిడ అడల్టే పాపకాదుగా... వాట్ డు యు సే,. యు..సి... డాక్టరు సంతోష్... యివన్నీ కుటుంబ విషయాలు... కేవలం మీరు మీరు చూసుకోవాలి తప్పించి... మేము కలగజేసుకుంటే అంత బాగుండదని నా అభిప్రాయం మరి... మీలాగే డాక్టరు మేము కూడాను. ఏ జబ్బూ లేకుండా ఆపరేషను చేస్తావా నువ్వు... చెప్పు..." అన్నాడు డేవిడ్ కార్టరు ఆఖరికి కరచాలనం చేసి సాగనంపుతూ.

స్కాట్‌లాండ్ యార్డు సృష్టించిన మరో పోలీసు మహాశయుడి దూరదృష్టికీ మేదస్సుకీ మనసులోనే జోహార్లు అర్పించుకున్నాడు సంతోష్— 'మొత్తానికి నీ యింగ్లీషు బుద్ధి, పోలీసు ప్రతిభ పోనిచ్చుకున్నావుకాదు సుమా' అని ముసి ముసి నవ్వులు నవ్వుకుంటూ !

* * *

సంతోష్‌కి కేంబ్రిడ్జ్ న్యూ ఎడింబ్రుక్స్ హాస్పిటల్‌లో అనుకున్నట్లుగానే కన్సల్టెంట్ జాబు ఖాయం అయ్యింది.

రోజరుకి, హెలినాకీ గుడుబై చెప్పటానికి వెళ్ళాడు.

సాదరంగా ఆహ్వానించి విస్కీపోసి శీతల

పానీయాన్ని వేడిచేసి అందించి స్నేహపూర్వకంగా సాగనంపుతూ "కీప్ యిన్ టచ్ సంతోష్". అంటూ ఎడబాటు ఓర్చుకోలేనంతగా తడబడుతూ దగ్గరకి వచ్చి అతిచనువుగా అతడి పెదవులు చుంబించింది అందాలరాశి హెలీనా, జీవితేశ్వరుడి కంటిలో ఎర్రజీర ఏర్పడుతుందేమో అన్న జంకులేకుండా.

అయినా తొణకకుండా స్నేహితుడికి విష్ చేసి చిరునవ్వుతో చీరియో చెప్పి పంపాడు రోజర్, ఎదలో చేసిన ఈర్ష్యని మర్యాదతో మభ్యపెడుతూ.

కేంబ్రిడ్జిలో చిన్న ఫ్లేట్ అద్దెకు తీసుకున్నాడు తాత్కాలికంగా.

వచ్చిన ఓ వారంకే హెలీనా ఫోనుచేసి సంతోష్ క్షేమసమాచారాలు అడిగింది ఆమరాగపూర్వకంగా.

సంతోష్ హృదయం ఎనలేని సంతోషంతో ఎగిరి గంతేసింది, ఆ దొరసాని యిల్లాలు చూపిస్తోన్న అపురూప ఆదరణకి.

పనికి కాస్త అలవాటు పడ్డాక ఓ రెండు వారాల తరువాత ఒక రోజున— తన కన్సల్టింగు రూమ్‌లో కూర్చుని క్రిందటిరోజు జూనియరు డాక్టర్లు చూసిన కేసు రిపోర్టులు, ఎక్సురేలు పరీక్షిస్తున్నాడు సంతోష్.

అంతలో సిస్టరు గాలిదుమారంలా తలుపైనా తట్టకుండా పరుగెత్తుకు వచ్చింది, అతడి పనికి భంగం కలిగిస్తూ.

"డాక్టరు సంతోష్... ఆ యామ్ ఎ్రఫయిడు... దేర్ హేజ్ బీన్ ఎ రోడ్ యాక్సిడెంట్... హైవే పోలీసులు ఫోన్ చేశారు... కారు క్రేష్ ఆటవిక్టిమ్స్ సస్టెయిన్డ్ సీరియస్ అని చెప్పాడు... అయ్ తింక్ షి ఈజ్ అన్ కాంషస్..." అంది నిలువెల్లా వణికిపోతూ.

"ఆల్ రైట్ సిస్టర్ మెక్‌నైట్... టేక్ యిట్ ఈజీ...విల్ యు ? కంగారుపడ్డ మనిషి కాలుజారటం చాలా తేలిక... నిదానమే ప్రధానం అర్థమయ్యిందా... లిజన్ టు మి... గెట్ ఎ ట్రాలీ రెడీ... ఆక్సిజన్... ఎయిర్‌వేస్... ట్రెకియాస్టమీ సెట్... డై మోర్ఫిన్... యిన్ఫ్యూషన్ సెట్... యునో ఆల్ దట్ స్టఫ్... డోంట్ యు..."అంటూ, మధ్యవయసు దాటినా నడిరేయిలో మిలమిలలాడుతున్న తారలా మెరిసి



పోతోన్న ఆ దొరసాని నర్స్ భుజంతట్టి ధైర్యం చెప్పి బయటకు పంపించాడు సంతోష్.

ఓ అయిదు నిముషాలు సుదీర్ఘంగా ఆలోచిస్తూ కూర్చుని ఆఖరికి ఫోన్ ఎత్తి "ఔట్ సైడ్ లైన్ ప్లీజ్" అన్నాడు ఆత్రుతగా,ఎవరికో ఫోన్ చేసే వుద్దేశంతో. అంతలో బ్లూలైట్లు మెరిపించుకుంటూ, సైరన్ మ్రోగించుకుంటూ వచ్చింది, ఏంబులెన్స్ మరో యిద్దరు హైవే పెట్రోలింగ్ పోలీసుల మోటర్ సైకిళ్ళతో పాటు. సంతోష్‌తోపాటు ఓ ముగ్గురు జూనియర్ డాక్టర్లు, నలుగురు నర్సులు ఎదురెళ్లారు కేజువాల్టీ గుమ్మంలోకి.

"సారీ డాక్... పేషెంట్ ఈజ్ ఆల్ రెడీ... వుయ్ డిడ్ ఎవ్‌రీ తింగ్ వుయ్ కుడ్‌డు..." చావు కబురు చల్లగా చెప్పాడు ఎంతో అనుభవం గడించిన ఆ అంబులెన్స్ అసిస్టెంట్.

"లెట్ మి చెక్" అంటూ అందరినీ ప్రక్కకు త్రోసి ఏంబులెన్స్‌లోకి వెళ్ళాడు సంతోష్ హడావిడిగా.

ఆత్రుతగా ముందుకువంగి మోకాళ్ళమీద కూర్చుని ఆ మగువ ముఖంమీద కప్పివున్న తెల్లటి దుప్పటిని తొలగించి చూశాడు.

మరుక్షణం సంతోష్ ముఖం వివర్ణమయింది. కాళ్ళక్రింద ఏంబులెన్స్ కృంగి ఎక్కడో పాతాళంలోని మృత్యుకుహరంలోకి కదిలిపోతోంది అనిపించటంతో కెవ్వున కేకవేశాడు, కంపించిపోతూ.

బయట నిలబడ్డ వైద్య సిబ్బంది ఒకరి ముఖాలు ఒకరు చూసుకున్నారు ఎదురు చూడని ఆర్తనాదానికి.

మరో కుర్రదొర డాక్టరు వెంటనే ఏంబులెన్స్‌లోకి వురికాడు.

"వాటీజ్ ది మేటర్ డాక్టర్ సంతోష్... ఈజ్ ఎనీ తింగ్ రాంగ్" అని అడిగాడు డాక్టర్ సెర్బీ విషయం అవగాహన చేసుకోలేక అవస్థపడుతూ, బొమ్మలా నిలబడిపోయిన తన బాస్ వైపు ఆరాటంగా చూస్తూ.

"షి ఈజ్ మై వైఫ్ రిచర్డ్ ..." అన్నాడు సంతోష్ దుఃఖం దిగమ్రింగుకుని ఆ మృతదేహంవైపు పిచ్చిగా చూస్తూ.

"మైగాడ్" కలవరపడటం కుర్ర డాక్టరు వంతు అయ్యింది.

మనసులోని శోకం మహాసముద్రమై వుప్పొంగుతుంటే, కన్నీటి తడితో కళ్ళు వింతగా మెరుస్తుంటే ఎనలేనివిచారంతో వూగిపోతున్నాడు సంతోష్. అతడి మెదడు ఆలోచనల్తో అల్లలాడటం లేదు; ఏదో తెలియని నిశ్శబ్దతతో నిండిపోయింది. శారాపోయిందన్న బాధకంటే యింకేదో చెప్పలేని సంబరపాటు అతగాడ్ని ఆవరించుకుంది; ప్రళయం వెలిశాక ఏర్పడే ప్రశాంతతలా. తెలివితప్పి ఎక్కడ పడిపోతాడో అన్న భయంతో రెండు చేతుల్తో సంతోష్‌ని పట్టుకుని – "కమాన్ సర్ ... దేరీజ్ నతింగ్ వుయ్ కెన్ డు నౌ ..." అంటూ బయటకు తీసుకువచ్చాడు రిచర్డ్ సెర్బీ.

చుట్టూ మూగిన హాస్పిటల్ సిబ్బంది తెల్లపోయి చూశారు ఆ దృశ్యాన్ని ఏం చెయ్యాలో తోచక, యిచ్చిన 'కీ' అయిపోయి ఆగిపోయిన ఆటబొమ్మల్లా నిశ్చలంగా నిలబడిపోతూ.

ఇద్దరు ముగ్గురు కలిసి సంతోష్‌ని అతని ప్రయివేటు గదిలోకి తీసుకువెళ్ళికూర్చోపెట్టారు.

సిస్టర్ మైక్ నైట్ తొందర తొందరగా వేడివేడి కాఫీ కలిపి తెచ్చి యిచ్చింది బాస్‌కి.

అంతలో పోలీస్ కానిస్టేబుల్ జాక్సన్ వచ్చాడు తన పని నిర్వర్తించటానికి.

"ఉయ్ ఆర్ ఆల్‌సో అప్‌సెట్ ఎబౌట్ యిట్ డాక్టర్ సంతోష్ ... అయామ్ సారీ ... వాట్ ఎ ట్రేజడీ ... బట్ స్టిల్ ... అయ్ గాట్ టు డు మై డ్యూటీ ... కెన్ అయ్ ఆస్క్ యు ఫ్యూ క్వశ్చన్స్ ..." అన్నాడు నేర్పుగా.

"ప్లీజ్ ... డు ... " జవాబిచ్చాడు సంతోష్ గంభీరంగా.

"చనిపోయిన వ్యక్తి మీ భార్యే అని నిర్ధారణగా చెప్పగలరా ..."

డైరీ తెరిచి సంతోష్ చెప్పబోయేదంతా ఎక్కించుకోటానికి సిద్ధమయ్యాడు పి. సి. జాక్సన్ ఆసక్తిగా చూస్తూ.

"ఆమె చేతికి వెడ్డింగ్ రింగ్ వుంటుంది.. తీసి చూస్తే మీకే తెలుస్తుంది. ఆ వ్యక్తి ఎవరో ..." అన్నాడు సంతోష్ తల్లడిల్లిపోతూ.

జాక్సన్ వెంటనే వెళ్ళాడు విషయం ఏమిటో తెలివుచ్చటానికి.

మరో అయిదు నిముషాలకి తిరిగివచ్చి ఓ బంగారపు టుంగరం టేబిల్ మీద వుంచాడు సంతోష్ కళ్లు చెదిరేలా.

"యు ఆర్ రైట్ డాక్టర్... అఫ్‌కోర్స్ ఈ ఒక్క వుంగరం ఆధారంగా చేసుకొని ఆ వ్యక్తి ఫలానా అని మీరు నేను చెప్పితే సరిపోదు అనుకోండి... కరొనర్‌కి నచ్చచెప్పాలి... నమ్మించాలి...ప్రొసీజర్ అంతా మీకు తెలుసుగా మరి యిలాంటి కేసుల్లో పోలీసుల పరిస్థితి ఎలా వుంటుందో... ఎనీవే... పరిస్థితులు అలాంటివి కావటంవలన... మీలాంటి పేరు ప్రతిష్టలున్న పెద్ద డాక్టర్ మాట ఎవరూ కొట్టిపారేయరు కదా...దట్‌టూ... దిసీజ్ ఎ వెరీ బేడ్ ఏక్సిడెంట్... కారు స్మేష్ అవ్వటమే కాదు పూర్తిగా బర్న్ అవ్వటంవలన విక్టిమ్ ఐడెంటిఫికేషన్ కనిపెట్టే అవకాశం లేకపోయింది ... డ్రైవింగు లైసెన్సు, బేంకర్స్ కార్డ్స్...యింకా చాలా పెర్సనల్ వస్తువులున్న వేనిటీ బాగు దొరికింది కాని, బాగా కాలిపోయాయి అందులో వున్నవన్నీ నామరూపాలు లేకుండా..."

సంతోష్ కళ్లల్లో ఏదో తెలియని కంగారు కదలాడింది క్షణకాలం. ఆవేదన కప్పిపుచ్చుకోటానికి అరచేతుల్లో ముఖం దాచుకుని ముడుచుకుపోయాడు సంతోష్.

"సారీ టు కాజ్ యు గ్రీఫ్ డాక్టర్ సంతోష్...ఎనీవే మీరు పాజిటివ్‌గా ఐడెంటిఫై చేశారు కాబట్టి వుయ్‌డోంట్ హేవ్ టు వర్రీ ఎబౌట్ ఎనీతింగ్...అయ్ నో షిఈజ్ యువర్ వైఫ్... కాని చిత్రం ఏమిటంటే ఎవరో కాని మీలా అలా వుంగరం మీద పేర్ను చెక్కించుకోరు మరి..." అన్నాడు జాక్సన్ అనుమానం వ్యక్తపరుస్తూ.

సంతోష్ ముఖంలో రంగులు మారాయి. కళ్లల్లో ఏదో తెలియని ఆరాటం పోరాటం

## వరమివ్వని వయ్యారి భామ



ప్రకటించింది. అదంతా భార్య పోయిందన్న బాధో, యింకేదో జరగబోతోందన్న భయ భ్రాంతులో ఆ అంతర్యామికే తెలియాలి ?

పి. సి. జాక్సన్ అఖండుడు. ముందు ఆలోచించి మరో మెలిక వేశాడు అసలు కథకి. సంతోష్ మాట పట్టుకుని శవాన్ని దహనపర్చ నివ్వకుండా కరొనర్స్ యింక్వెస్ట్ ఏర్పాటుచేశాడు మర్నాడే.

సంతోష్‌కి యిష్టంలేకపోయినా చట్టానికి, ముఖ్యంగా పోలీసువారి చాతుర్యానికి తల వంచక తప్పిందికాదు.

"సారీ డాక్టరు... నా డ్యూటీ నేను చేయలిగా మరి... ఈ పరిస్థితుల్లో ఎవరికైనా అనుమానం కలుగొచ్చు... మీ ఒక్కరి సాక్ష్యంలో ఆ నిర్భాగ్యురాలు మీ భార్యే అని నిర్ణయించటం సబబుగా వుండదుగా మరి చట్టం దృష్టిలో... అందులో మీ భార్య మిమ్మల్ని విడిచిపెట్టి ఎక్కడికో వెళ్ళిపోయిందని కూడా చెప్తున్నారు... పైగా ఓ రెండు నెలల క్రితం స్వెండన్ పోలీస్‌కి ఆమె తప్పిపోయినట్లు రిపోర్టు కూడా యిచ్చారను కుంటాను... ఎనీ వే... యిఫ్ యు డోంట్ మైండ్... డాక్... ఏ వర్డు ఆఫ్ ఎడ్వయిజ్..." అన్నాడు జాక్సన్ వుదయం ఎనిమిదింటికే హాస్పిటల్‌కి వచ్చి సంతోష్ వచ్చేవరకూ వేచి వుండి.

"ఏమిటది .." కుతూహలం కనపరిచాడు సంతోష్ తనకు తెలీకుండానే తడబడ్తూ.

"మీ మిసెస్‌కి... చుట్టాలు, స్నేహితులు యిలాంటి వాళ్ళు ఎవరైనా వుంటే ఒకసారి పిలి పించండి... ఎవరైనా యింకొకరు ఆ శవాన్ని చూసి ఆ వ్యక్తి శారా కుమారే అని రుజువు పరిస్తే చాలు కేస్ కొట్టేస్తాడు కరొనరు... డెత్ బై ఏక్సిడెంటు అని డిక్లేరు చేస్తే మీకు యింకేమీ గొడవవుండదు. మరి... వాట్ డు యు సే" అని అడిగాడు జాక్సన్.

"ఆ వ్యక్తి నా భార్యే అని నిరూపించు కొటం కంటే నాకు మాత్రం కావలసింది ఏముంటుంది చెప్పండి... ష్యూరు అయ్‌కెన్ డు సమతింగ్ ఫర్ దట్..." అన్నాడు సంతోష్.

"ఫైన్... డు యు హేవ్ సమ్ ఒన్ యిన్ మైండు..." పరీక్షగా చూశాడు జాక్సన్ దీర్ఘంగా ఆలోచించి నెమ్మదిగా శలవిచ్చాడు సంతోష్.

"అఫ్‌కోర్సు... శారా సిస్టర్ వెండీ వుంది.. పిలిపించమంటారా" అంటూ గుండెల మీదనుంచి బరువు దించుకున్నట్లు అతిగాఢంగా నిట్టూర్చాడు.

"ఓ...దట్స్...స్మేషింగ్... మరి యింత వరకూ చెప్పరే...ఎడ్రస్‌గాని...టెలిఫోన్ నెంబరు గాని వుంటే యివ్వండి యిప్పుడే ఎవరినైనా పంపించి తెప్పిస్తాను..." అన్నాడు జాక్సన్ హుషారుగా.

"మీకు ఆ శ్రమ లేకుండా నేనే ఆ పని చేశాను... డోంట్ వర్రీ... షి విల్ బి హియర్ ఎనీటైమ్ నౌ..." అన్నాడు సంతోష్ శాంతంగా.

జాక్సన్ చూపుల్లో ఓ రకమైన కుతూ హలం కుప్పిగంతులు వేసింది. సంతోష్ మాత్రం అదేమీ పట్టించుకొనే స్థితిలో లేదు. ఏదో తెలియని వుదాసీనతతో వుక్కిరిబిక్కిరి అవు తున్నాడు ఆ భారతీయుడు.

వెండీ వచ్చిన వెంటనే మార్చ్యురీకి తీసుకు వెళ్ళి శవాన్ని చూపించారు పోలీసులు. మూర్ఛ పోయేటట్లు ముందుకు తూలి వెంటనే నిల ద్రొక్కుకుని రెండుచేతుల్లో ముఖందాచుకుని కన్నీరు మున్నీరుగా ఏడ్చింది ఆ కోమలాంగి తోడబుట్టువు ఎడబాటు భరించలేనట్లు !

సంతోష్ దగ్గరికి వచ్చి మరదలు పిల్లని మక్కువగా దగ్గరకు తీసుకుని అనునయించాడు. ఆంగ్లేయ మర్యాదలు తు. చ. తప్పకుండా పాటిస్తూ ఆ దొరసాని భామిని బావగారి బాహువుల్లో ప్రొద్దుతిరుగుడు పూవయ్యింది వెలవెలబోయిన సుందరమైన ముఖాన్ని చాటు చేసుకోటానికి.

ఆ శవం శారాదే అని వెండీ ధృవపరచిన వెంటనే పి. సి. జాక్సన్ ముఖం విప్పారింది. యింకే తలనొప్పి లేకుండా అంతటితో ఆ కేసు కొట్టిపారేయించవచ్చని, ఆ మాటే అన్నాడు సంతోష్‌తో— "యు కెన్ టేక్ యిట్ ఈజీ డాక్టర్" అని తను తేలికగా వూపిరి తీసి వదులుతూ.

సంతోష్ ముఖంలో ఏదో చెప్పలేని సంతృప్తి చిందులు త్రొక్కింది క్షణకాలం. కాని ప్రక్కనున్న సుందరాంగి చూపుల్లో ఎనలేని తడబాటు తొణికిసలాడింది, ప్రఫుల్లమైన సంతోష్ కళ్ళల్లో సంచలనం సృష్టిస్తూ ?

* * *

అది జరిగిన వారానికే సంతోష్ హోదా పెరిగింది లాటరీలో ప్రయిజు వచ్చినట్లు. యాభైవేల పౌండ్లు ఖరీదుచేసే అయిదు పడక గదులు డిటాచ్డ్ విల్లా కొన్నాడు, కేంబ్రిడ్జి పట్నం పొలిమేరల్లో, ఆస్తులు అంతస్థులు బాగా గడించిన అసలైన దొరలు వుండే ఓ అత్యంత ఆధునికమైన ఎస్టేట్‌లో.

మరింత ఆకర్షణీయమైన ఫర్నిచర్‌తో శోభాయమానంగా సింగారించాడు యిల్లంతా. మరో అయిదారువేల పౌండ్లు ఖర్చుపెట్టి పెరటిలో స్విమ్మింగ్‌పూల్ ఒకటి కట్టించి, చూడముచ్చటగా తీర్చి దిద్దించాడు అందమైన లాన్‌నీ అక్కడ ఇక్కడ పూలమొక్కల్నీ.

"కమాన్... హనీ... లెటజ్ సెలిబ్రేట్" అంటూ ఆ నెరజాణ నడుంచుట్టూ చేతులు బిగించి దగ్గరకు లాక్కుని హద్దు మీరిన లేత గుండెల్ని తన అక్కున నొక్కుకొని ఆప్యాయంగా చుంబించాడు ఆ ముద్ద మందారాల్లాంటి ఎర్రని పెదవుల్ని.

"వుయ్ డిడ్ యిట్... డింట్ వుయ్ ?" అంటూ అతగాడ్ని వాటేసుకుని ప్రేమగా ముంగురులు సవరించి, వలపులు కురిపించి లాలించింది, అవకాశం వదులుకోకుండా, ఆ దొరసాని.

"అఫ్‌కోర్స్ వుయ్ డిడ్ యిట్...డార్లింగ్" అన్నాడు పట్టు విడవకుండా.

"ఒన్ మిలియన్ పౌండ్స్. ఈజ్ యిన్ట్ యిట్... మై గుడ్‌నెస్."

ఆ అలివేణి ఆనందం అంతా ఇంతా కాదు.

"ఎంతతేలికగా సంపాదించామో చూశావా" సంతోష్ సంబరపడ్డాడు.

"తేలికేమీ కాదు... పేరుకి నన్ను చంపి మరో శవపేటిక సృష్టిస్తేకాని అసలు పని



## వరమివ్వని వయ్యారి భామ

జరగలేదు...నీకేంతెలుసు బ్రతికి చావటంలోవున్న బాధేమిటో..."

"ఆ మాత్రం కష్టపడకపోతే మిలియన్స్ ఆఫ్ పౌండ్స్ ఎక్కడనుంచి వస్తాయి అనుకుంటున్నావు..."

"ఆహా... అలాగా... నీకే మగాడిని ఎన్ని కబుర్లయినా చెప్తావు ... ఎన్ని వేషాలైనా వేయిస్తావు... నా స్థానంలో నువ్వుంటే తెలిసొచ్చేంది... ఆ పది పన్నెండు వారాలు వనవాసం చేయలేక చచ్చాననుకో వెండీ ఫ్లాట్‌లో..."

అంది ఆ ముద్దుల మగువ మూతి ముడుచుకుంటూ.

"ఆల్‌రైట్ డార్లింగ్... కామ్ డౌన్... ఎవ్‌రీ థింగ్ విల్...బి...ఓకె...నౌ... కమాన్ వుయ్ విల్ హేవ్ సమ్ షేంపైన్..." అంటూ యిల్లాల్ని వూరడించి నెమ్మదిగా నడిపించి తీసుకువెళ్లి వెయ్యి పౌండ్లు ఖరీదుచేసే అతి మెత్తని సోఫాలో ఆమెను కూర్చుండపెట్టాడు. ప్రక్కనే తనుకూడా చోటు చేసుకుని గాలి చొరవనంతగా భార్యను పొదివి పట్టుకుని, వూపిరాడకుండా ముద్దులవర్షం కురిపించి వుక్కిరి బిక్కిరిచేశాడు సంతోష్, శృంగార సముద్రంలో మునిగి తేలుతూ అంతలో వెండీ వచ్చింది దుమారంలా హడావిడి చేస్తూ.

"హల్లో మైడియర్... ఆర్ యు ఆల్‌రైట్" అంటూ ఎదురువెళ్ళి, స్వేదబిందువులతో తడిసి తమాషాగా మెరుస్తోన్న మరదలుపిల్ల చెక్కిలిమీద సున్నితంగా చుంబించి సుస్వాగతం చెప్పాడు సంతోష్.

విసురుగా అతడ్ని ప్రక్కకుత్రోసి అక్క దగ్గరకి వచ్చి కూర్చుంది కోపంగా.

"ఏమిటంత యిదిగావున్నావ్... ఏ బాయ్ ఫ్రెండుతో ఏమైనా గొడవ వేసుకున్నావా ఏమిటి కొంపతీసి" అంది శారా వెటకారంగా నవ్వుతూ.

"రాబర్ట్సకే... నిక్షేపంలా వున్నాడు... నాలా ఏ దొంగతనంలోనో... దోపిడీలోనో యిరుక్కోలేదుగా అతడు..." ఆవేశం వెళ్ళగక్కింది వెండీ.

"ఆ... ఆ... ఆగు... ఏమిటా దురుసుతనం... ఏం మాట్లాడుతున్నావో కాస్త ఆలోచించి మాట్లాడు... ఆడదానికంత ఆగ్రహం పనికిరాదు... మైడియర్ ముద్దుల చెల్లెలాపనికి అది శారా గడుసరి నవ్వుతో గుణపాఠంచె...".

"కమాన్ వెండీ... వాట్సీజ్ రాంగ్‌వుత్ యు... ఏమయ్యిందని యిప్పుడు యిలా ఆవేశ పడుతున్నావో నాకు అర్థంకావటంలేదు..."

సంతోష్ ముఖం చిన్నబుచ్చుకుంది మరదలి మాటకారితనానికి.

"నా వాటా ఎంత అన్నారు" నిలదీసి అడిగింది వెండీ.

"అనటం ఏమిటి... ముందే అనుకున్నాంగా... ముప్పైవేల పౌండ్ల వరకూ వుండొచ్చని..." అన్నారు సంతోష్ సీరియస్‌గా.

"నో ..."

"వాట్ ..." శారా అరిచింది ఆశ్చర్యంగా.

"నిజం చెప్పాలంటే మీ యిద్దరికంటే ఎక్కువగా నేను కష్టపడ్డాను ... శారాని మరో మనిషి కంటపడకుండా పది పన్నెండు వారాలు దాచిపెట్టడం అంటే మాటలు అనుకున్నారా ... నా బాయ్ ఫ్రెండ్ చాలా మంచివాడు కాబట్టి సరిపోయింది. యింకొకరు అయితే 'యింటికి ఎందుకు రావద్దు అంటుందా' అని సంబంధం త్రెంచుకుని పోయివుండేవాడు ... అంతకంటే ముఖ్యమయ్యిందేమిటంటే ... ఆ కారు ఏక్సిడెంట్‌లో ప్రాణాలు కోల్పోయిన సుందరి మా అక్కే అని నొక్కి చెప్పటం ... అది ఎంత రిస్కీ బిజినెస్సో ఆలోచించారా ... నేను పడ్డ శ్రమకి ముప్టై ముప్పైవేలా ముదుపు ..." అంది వెండి వ్యంగంగా నవ్వుతూ, విసురుగా చూస్తూ.

"ఆల్‌రైట్ ... ఆల్‌రైట్ ... అయితే నా మాటేమిటి ... ఎవరో ముక్కు ముఖం తెలియని ఆడదాని చేతికి దొంగచాటుగా వుంగరం ఎక్కించి ... అదే నా భార్య అని నమ్మించటం ఎంత పెద్ద నేరమో వూహించావా వెండీ ... ఆ పిల్ల తరఫు వాళ్ళెవరైనా విషయం బయట పెడితే నా పరువు మర్యాదలు ఏం కాను శారా బ్రతికి వుందని తెలిస్తే నా బ్రతుకు జైలుపాలు అవుతుంది ... ఏమనుకున్నావో" అన్నాడు సంతోష్ ఆవేశంగా.

"ఓ.కె. వాట్ ఎబౌట్ ... మి ... దెన్... కట్టుకున్నవాడ్ని మట్టుపెట్టటానికి వ్యర్థ ప్రయత్నంచేసి ... మొగుడ్ని విడిచిపెట్టి ఆఖరికి యింటి నుంచి పారిపోయి ఎక్కడో దాగుని అరణ్యవాసం సాగించి ... చివరికి చచ్చిపోయినట్లు యింట్లో వాళ్ళతో వీధిలో ప్రకటించి...వూరు, వేషం మార్చుకుని ఎందుకు బ్రతికిచావాలి నేను ... నా మీద నా భర్త చేసిన ఎనలేని యిన్సూరెన్స్ డబ్బులు రాబట్టుకోటానికా ... లేక నా సంపాదనని అందరికీ పంచిపెట్టటానికా ... మరి నేను తీసుకున్న రిస్క్ మాటేమిటి అంటారు ..." శారా మాటలు విసిరింది విసురుగా.

"చూడు వెండీ ... అత్యాశకిపోతే ఆఖరికి ఏమీ దక్కకుండాపోతుంది ... అర్థమయ్యిందా... అందుచేత నా మాట విని యిస్తున్నదాంతో సరిపెట్టుకో" శాంతంగా సలహా యిచ్చాడు సంతోష్.

"పోలీసులికి చెప్తే ఏం జరుగుతుందో తెలుసా" బెదిరించింది వెండీ దొరసాని.

"గో ... ఎహెడ్ స్వీట్ హార్ట్ ... మాతో పాటు నీకూ జైలుశిక్ష తప్పదు ... మర్చిపోక. యు ఆర్...ఏన్,..ఏక్సెసరీ ఫర్ ఆల్ దిస్..." అన్నాడు సంతోష్ కఠినంగా.

వెండీ ముఖం వెలవెలపోయింది. మారు మాట్లాడలేక మౌనంగా కళ్ళు దించుకుంది ఓటమినంగీకరిస్తూ.

భార్యాభర్తలు యిరువురూ ఒకరి నొకరు కౌగిలించుకొని సిగ్గు విడిచి ముద్దులాడుకున్నారు వెండీని మరింత వుడికించటానికి.

"వై డోంట్ వుయ్ ఎంజాయ్ వెండీ ..." అంటూ దగ్గరకి వచ్చి మూతి బిగించి కూర్చున్న మరదలు పిల్లని లేవదీసి లాలించాడు సంతోష్! భార్య ఏమనుకుంటుందో అన్న సంకోచం లేకుండా చిలిపిగా ముద్దాడుతూ.

వెండీ మాత్రం వుగ్రరూపం ధరించి బావగారిని బలంకొద్దీ దూరంగా త్రోసి, ఈసడించుకుని అక్కడనుంచి వెళ్ళిపోయింది.

ఒకరి ముఖం ఒకరు చూసుకున్నారు అసలు విషయం అవగాహన చేసుకోలేక అవస్థపడుతూ?

* * *

హెలీనాకి ఫోన్ వచ్చింది సవతి తల్లి సూబార్కర్ దగ్గర నుంచి. 'నీ దగ్గరకి వెళుతున్నానని చెప్పి బయలుదేరింది మరి...క్రిస్టేనా యింకా అక్కడే వుందా' అని ఆరాతీస్తూ.

ఆశ్చర్యపోయింది హెలీనా.

"అబ్బే యిక్కడికి రాలేదే ... బోస్టను నుంచి ఎప్పుడు బయలుదేరింది" అని అడిగింది ఆతృతగా.

సవతి తల్లితో, సవతి చెల్లెలతో తనకి అంతగా సంబంధం లేకపోయినా, వాళ్ళతోఎప్పుడూ విరోధంమాత్రం ఏర్పడలేదు హెలీనాకి.

"రాలేదా... ఏమయ్యిందబ్బా...వెళ్ళి వారం పైగా అవుతోంది" అలజడి గోచరించింది. ఆ తల్లి గొంతుకలో.

"కంగారు పడకుండా ... ఏం జరిగిందో సరిగ్గాచెప్పు." అంటూ సమాధానపరిచి సూబా దగ్గర నుంచి వివరాలు సేకరించింది హెలీనా.

వెంటనే భర్తకు ఫోన్ చేసి చెప్పింది.

రోజర్ నివ్వెరపోయాడు.

"డోంట్‌వర్రీ డార్లింగ్‌మెవుయ్ విల్ ఫైండ్ ఔట్" అని ధైర్యం చెప్పి హాస్పిటల్ నుంచి త్వరగా యింటికి చేరుకున్నాడు ఆ రోజు.

* * *

సంతోష్ సృష్టించిన శవం శారాదికాదనీ, ఆ చనిపోయిన చిన్నది హెలీనా సవతి చెల్లెలు క్రిస్టేనా అనే కన్నెపిల్లదనీ, అంతర్యామి వరమిచ్చినా ఆ విగతజీవి వయ్యారిభామ మాత్రం వరమ్విలేదనీ, ఆ ముగ్గురికీ తెలిసే అవకాశంలేదు అప్పటిలో.

కాని అఖండమైన ప్రజ్ఞతో ఎనలేని ప్రతిభ గడించుకున్న స్కాట్‌లాండ్ యార్డ్ పోలీసు డిటెక్టివ్‌లు మాత్రం స్నిఫింగ్ డాగ్స్ కంటే చురుకుగా నిజాన్ని పసిగట్టగలరనీ, పాలలోంచి వెన్నని చిలికినట్లు నేరాన్ని కూడా వడపోసి వేరు చేయగలరనీ కొందరికే తెలుసు మరి ? ? ?

*[అయిపోయింది]*

# వ్యక్తిగతం



డ్రూజులు ఏ మతానికి చెందిన వారు? మహమ్మదీయులలో ఒక తెగ (ఇస్మాయిలీ) వారని కొందరిఅభిప్రాయం. కానీ వారు ఎద్దుని పూజ చేస్తారని వినికిడి. డ్రూజులు లెబెనాన్ కొండలమీద, లోయలలోనూ ఉంటారు. సిరియా, ఇస్రాయిల్ దేశాలలోకూడా ఉంటారుట. వీరి మొత్తం జనాభా 5,50,000 ఉంటుందని అంచనా. వీరి నాయకుడు వాలీద్ జుంబ్లాట్ సిరియా సహాయంతో లెబనాన్ అంతర్యుద్ధంలోకి దిగారు. ప్రధానమంత్రి శ్రీ వజన్‌చేత రాజీనామా చేయించారు...



జెఫ్రీ మెక్ డొనాల్డ్ డాక్టర్ చదివాడు 1970లో వియత్నాం యుద్ధంలో పాలుగొందామనుకున్నాడు. ఇంతలో అతను తన భార్య కొలెట్‌నీ, ఇద్దరు కుమార్తెలనీ కత్తితో పొడిచి చంపాడన్న నేరంమీద నిర్బంధించబడ్డాడు. [కొలెట్ వయస్సు 26 అప్పటికి. కూతుళ్ళు కింబర్లీ, క్రిస్టెన్‌లకి వరుసగా 5, 2 ఏళ్లు ఉండేవి.] సాక్ష్యం చాలదని కోర్టు వారు అతనిని వదిలివేశారు. అతను క్రమంగా ఒక సంఘ సేవకుడుగా పేరు పొందాడుకూడా. కోలెట్‌ని పెంచుకున్న ఫ్రెడ్డీ కస్సబ్, అతని భార్య మిల్‌డ్రెడ్‌కి కోర్టు తీర్పు అన్యాయంగా కనిపించింది. అల్లుడిమీద విచారణ జరిపించాలని ఉద్యమం ఒకటి మొదలుపెట్టాడు. ఇంతలో 1975లో జరిగిన మరొక విచారణలో జెఫ్రీ మెక్ డొనాల్డ్ నేరస్తుడని నిర్ధారణ అయింది. అతను ప్రస్తుతం జైలులో ఉన్నాడు. "ఎస్క్రటాల్" అనే మత్తు మందు తీసుకుని ఈ దారుణాలుచేసి ఉంటాడు మెక్ డొనాల్డ్ అనుకుంటున్నారు కొందరు ...




4-11-1983 శుక్రవారం మొదలు 10-11-1983 గురువారం వరకు

♈ మేషం: అధికారుల మూలంగా జరుగవలసిన పనులుంటే సమగ్రంగా నెరవేరుతాయి. చాల కాలంగా నిలచిన బాకీలు వసూలు కాగలవు, శ్రమించటం అవసరం. ఆరోగ్య లోపం కనిపించదు. స్త్రీలకు: పనులందు శ్రద్ధ, ఉద్యోగానుకూలత, స్వల్పంగా ఆదాయం గలవారం.

♉ వృషభం: మీ ఆలోచనలు, పనులు సొంగంగా జరిగిపోతాయి. మీ కొరకో, సంతానం కొరకో చేసిన ఉద్యోగ యత్నాలు సఫలం కానున్నవి. రాజకీయ రంగంలో మీ ప్రజ్ఞ రాణింపగలదు. యత్న కార్యమందు విజయం సాధింపగలరు. స్త్రీలకు: రచనా విధానంలో పెంపు, ఆదాయం గలవారం.

♊ మిథునం: వ్యాపారంలో మీ శ్రమ ఫలింపనున్నది. వ్యవహారం ఏదయినా ఉంటె ఫలించనున్నది. మధ్యవర్తిత్వ పరిష్కారం కొరకు నిలచిన వ్యవహారం సానుకూలం కాగలదు. రాజకీయంగా మేలు సంభవం, గ్రహించి, యత్నించండి. స్త్రీలకు: అవసరాలకు కావలసిన ధనం అందుతుంది.

♋ కర్కాటకం: ముఖ్య బంధువులనో, హితులనో, దూర ప్రాంతాలకు వెళ్లి తిరిగి వచ్చిన పెద్దలనో కలిసికోనున్నారు. నూతన వస్తు సేకరణకు యత్నిస్తారు. మేలు పొందుతారు, గ్రహించండి. స్త్రీలకు: రాజకియంగా అనుకూలత సాధింపగలరు. పత్రికా రంగానుభవం గలవారైతే, ఆదాయమున్నది.

♌ సింహం: కళా రంగానుభవం గలవారికి ఈ వారం సదవకాశాలు లభించటమే గాక, ఆదాయం కూడా సమకూడుతుంది. అప్రయత్నంగా ధనలబ్ధి కూడా చెప్పదగిన అంశం. మీ మేలుకోరిన స్త్రీ పురుషాదులు యింటికి రానున్నారు. స్త్రీలకు: ప్రయాణానుకూలత, ఉద్యోగ మూలకంగా ఆదాయం చేకూరుట కూడా గమనింపనున్నారు.

♍ కన్య: శక్తి వంచన లేక పాటు పడుతారు. శ్రమిస్తారు, తరుణం గ్రహించి ఆదాయం కొరకు పాటుపడుతారు. అయినా కలిసిరాని వారం. చేతికి అందవలసిన స్వల్ప ధనం కూడా అందక పోవటం కూడా గమనించనున్నారు. స్త్రీలకు: వారమంతా ఉత్సాహజనకంగా ఉంటారు. శుభ కార్యాలలో పాల్గొంటారు, సర్వత్రా అనుకూలత సంభవం, గ్రహించండి.

♎ తుల. అసాధ్యమనివదలు కొన్న ఒకానొక వ్యాపార వ్యవహారం, ఈవారం సుకరంగా నెరవేరుతుంది. రాజకీయంగా మీకు మేలు జరుగనున్నది. వ్యాపారం నిరాక్షేపణగా, లాభదాయకంగా సాగి పోతుంది. స్త్రీలకు: సాహితి రంగంలో సదవకాశాలుంటాయి.

♏ వృశ్చికం: అభిమానుల మూలంగా మీకు ఏదో మేలు సమకూడనున్నది. వ్యవహారంలో జోక్యం పుచ్చుకో వలసిన అవసరం ఏర్పడుతుంది. విద్యా వైజ్ఞానిక రంగాలలో మేలు జరుగనున్నది. స్త్రీలకు: ఉద్యోగంలో రాణించటం, అంతస్థు పెరగటం కనిపిస్తుంది, గ్రహించండి.

♐ ధనుస్సు: ఆదాయానికి ఎలాంటి లోపం ఏర్పడదు. విలువ గల వస్తువులు సమకూర్చుకో గలుగుతారు. ప్రతిభ రాణించే అవకాశాలున్నాయి. కొందరు వాహనం కొనుగోలు చేయగల అవకాశం కూడా ఏర్పడుతుంది అది నెరవేరుతుంది కూడ. స్త్రీలకు: ఆరోగ్యాభివృద్ధి, ఉద్యోగంలో పెంపు, ప్రయాణానుకూలత గల వారం.

♒ మకరం: చాలి కాలంగా స్థంభించి పోయిన వ్యవహారం ఒక దారికి రాగల సమయం. భూముల వలన నష్టం రానున్నది. అంతేగాక యితరుల నుండి రావలసిన ధనానికి కూడా అంతరాయాలు రానున్నవి. గ్రహించండి. స్త్రీలకు: వృత్తి యందు పెంపు, ఆదాయం, ఉద్యోగ లాభం చెప్పనైన ముఖ్యాంశాలు.

♑ కుంభం: వ్యాపారంలో యిబ్బందులు రానున్నవి. క్రయ విక్రయాలలో కూడా జాప్యం జరుగనున్నది. వస్తువులో, ధనమో పోగొట్టుకొనే అవకాశమున్నది. ఇరుగు పొరుగు తగాదాలు తలయెత్తే విధానమున్నది. త్వరపడి ఏ వ్యవహారంలో తల దూర్చకండి. స్త్రీలకు: కళా సాహిత్య రంగాలలో పెంపు, మెరుగు, ఆదాయం కనిపిస్తుంది.

♓ మీనం: నూతనాంశాలు తెలిసి కొంటారు. నూతన మిత్రులు చేరుతారు. రాజకియంగా మేలు చేకూరుతుంది. వృత్తిలో పెంపు కనిపిస్తుంది. రాబడిలో కూడా కొంత పెంపు కనిపిస్తుంది, గ్రహించండి. స్త్రీలకు: దైవ కార్యాచరణమో, శుభ వ్యవహారాలను గూర్చిన హడావుడి గాని కనిపిస్తుంది. ఆరోగ్య లోపం కనిపించదు.

*— విద్వాన్ కోట సత్యరంగయ్య శాస్త్రి*★

# ఇప్పుడు!

## డిటర్జెంట్ ఉతికే బిళ్ళలకన్నా బరువు రెండు రెట్లు ఎక్కువ, ధర కేవలం కొద్ది పైసలు ఎక్కువ!

డిటర్జెంట్ బిళ్ళల అధిక ఉతికే శక్తి.

ఉతికే బార్ సోపుల మితవ్యయము.

300 గ్రాములు.




సులభ ఉతుకుకై ఐదు సౌకర్యకర మైన భాగాలు:




# టోటల్

నీలి డిటర్జెంట్ బార్

కర్నాటక సోప్స్ మరియు డిటర్జెంట్స్ లిమిటెడ్.
బెంగళూరు వారి ఒక నాణ్యమైన ఉత్పాదన.

మార్కెట్ చేయువారు:
మైసూరు సేల్స్ ఇంటర్నేషనల్ లిమిటెడ్. బెంగళూరు.

MCA-TDB-52-TEL

# సీరియల్

# యక్షగానం

## స్వర్గీయ శ్రీమతి మాదిరెడ్డి సులోచన

డాక్టర్ శివాజి మాన్వీకర్ నర్సింగ్‌హోమ్ అది. అతని హస్తవాసి చాలా మంచిదని అందరూ అనుకుంటారు. అదే విషయం మీద కంట్రాక్టరు కనకరాజు, మరో వ్యక్తి ఘర్షణ పడుతున్నారు. "డాక్టరు బాగుచేసాక భగవంతుడు అంటావేమయ్యా." అన్నాడు అతను. అతను ఆ ప్రదేశంలో సోషియల్ వర్కర్. అతని అసలు పేరేమిటోగాని అందరు గాంధి అని పేరు పెట్టారు.

"ఇదిగో చూడవయ్యా! నీపేరు గాంధియో, నెహ్రూనో నాకు తెలియదు. ఆ భగవంతుడు ఇక్కడికి పంపితే వచ్చాము."

"ఏమిటేమిటి కనకరాజుగారూ!" గాంధి అడిగాడు.

"సాక్షాత్తూ, స్వయంగా ఆ భగవంతుడే పంపాడీ నర్సింగ్ హోమ్‌కి."!

"ఒహో! అంటే భగవంతుడికి తనమీద తనకు నమ్మకం లేదన్నమాట."

"నీకు చెప్పినా అర్థం కాదయ్యా."

వారి సంభాషణకు ఫుల్‌స్టాప్ పెడుతూ వాకిట్లో ఒక టొయాటో కారు వచ్చి ఆగింది. అక్కడున్న వాచ్‌మెన్ వచ్చి కారు తలుపు తీసాడు. తెల్లగా, హూందాగా, అందంగా, పిల్లి కళ్లతో ఉన్న నలభై ఏళ్ల వ్యక్తి దిగాడు. అతను తెల్లటి బట్టలు ధరించాడు. అతని చేతిలో ఒక గులాబి పువ్వు ఉంది.

"నమస్తే డాక్టర్‌గారూ"

"నమస్తే డాక్టర్ సాబ్..."

"నమస్తే..." అక్కడున్నవారంతా నమస్కరించారు. డాక్టర్ శివాజి యెవరి వంకా చూడలేదు. హాల్లో అడుగు పెట్టాడు. అస్పష్టంగా ఉన్న ఒక పాలరాతి స్త్రీ మూర్తికి, చేతిలో ఉన్న గులాబి పువ్వు సమర్పించి, భక్తిగా నమస్కరించాడు. ఒక్క నిముషం మౌనంగా ఉండి, చిరునవ్వుతో అందరినీ గ్రీట్ చేసాడు.

(గత సంచిక తరువాయి)

"ఏమిటి గాంధీగారూ! ఉదయమే ఉపన్యాస కార్యక్రమము పెట్టుకున్నారు" అన్నాడాయన.

"అబ్బే... రోగాలను భగవంతుడు బాగు చేస్తాడా, డాక్టరా అని చర్చిస్తున్నాం. మన కనకరాజుగారికి భగవంతుడు కనిపించాడట."

"ఓ అయిసీ..." చిన్నగా నవ్వాడు శివాజి.

"అబ్బే... మీరలా నవ్వటం బావుండ్లా... జవాబు చెప్పాలి" అన్నాడు గాంధి. డాక్టరు గదికి వెళ్తుంటే అందరూ అనుసరించారు.

"భగవంతుని సహకారం లేనిదే మీరు ప్రాణాలు పోస్తారా డాక్టర్‌గారూ!" కనకరాజు అడిగాడు.

అతను గదిలోకి అడుగు పెట్టగానే, నర్స్ 'గుడ్‌మార్నింగ్ సర్' అని, తెల్లకోటు అందించింది.

"థాంక్యూ..." అతను కోటు తీసుకుని, స్టెత్ మెడలో వేసుకున్నాడు.

"డాక్టరుగారూ..."

"గాంధిగారూ! ఈరోజు సాయంత్రం వై. ఎమ్. సి. హాలులో ఏదో మీటింగ్ ఉంది. నాకు గుర్తుంది" అన్నాడు.

> **జరిగిన కథ — 1 :** ముకుందాదేవిని అక్కడి ప్రజలు శ్రీకృష్ణ పరమాత్మునిగా భావించి కొలుస్తుంటారు. ముకుందాదేవిని శ్రీకృష్ణుడు ప్రతీ సోమ, గురు, శనివారాలు ఆవహించి భక్తుల కోరికలు నెరవేరుస్తుంటాడు. ముకుందాదేవి భర్త నందనరావ్‌కు పక్షవాతం. కూతురు నీలిమ. నందనరావ్ మిత్రుడు కొడుకు ఆదిత్య ఆకలి బాధతో ఆ ఇంటికి వస్తాడు. అసలు ఈ అవతారం ఎత్తింది నీ కోసమేననీ, నీ పెళ్లి చేసి ఈ అవతారం చాలించుతానని ముకుందాదేవి చెప్పగా నీలిమ ఆశ్చర్యపోతుంది.

"మీకు గుర్తున్నా, ఒక్కసారి గుర్తు చేయాలని అంతకంటే ఏంలేదు." గాంధిగారు లేచారు.

కనకరాజు నోట్లు డాక్టరుగారి బల్లమీద పెట్టి, పేపర్ వెయిట్ పెట్టాడు.

"అబ్బాయిని ఈ పూట తీసుకు వెళుతున్నాను."

"మంచిది. బలహీనతవల్ల ఫిట్స్ వస్తాయి. బలమైన ఆహారం, వ్యాయామముండాలి." అన్నాడు, నోట్లు డ్రాయర్లో వేసి, తాళం వేస్తూ.

"అట్లాగే..." అతనివెనుక బయటికి వచ్చారు.

"డాక్టరుగారూ! కనకరాజుగారి భగవంతుని మాటేమిటి ?"

శివాజి చిన్నగా నవ్వాడు.

"భగవంతుడు ఉన్నాడో లేడో తెలియదు. నా అసహాయ స్థితిలో ఆదుకున్నదో స్త్రీ. ఈనాడు నా ఈ స్థితికి, నా ఉన్నతికి కారణం ఆమె. అందుకే ఆమెను ఆ పాలరాతి విగ్రహంలో దర్శిస్తాను. ఆమె..." అంటుంటే అతని కంఠం బొంగురుపోయింది.

"ఆమె మీ భార్యా ?"

"ఛ... డాక్టరుగారి శ్రీమతిగారు ఈమధ్యే పోయారు." అన్నాడు గాంధి.

"స్త్రీ రూపాలు చాలా ఉన్నాయి. తల్లి, చెల్లి, ప్రియవల్లి... నాకు ఆమె ఏమవుతుందని చెప్పను. సర్వస్వమననా!" అన్నాడు ఎటో చూస్తూ.

"మనిషే కదా. నేను అంగీకరిస్తాను డాక్టరుగారూ! మనుషులు మానవత్వం ప్రదర్శించి, మానవాతీతమైన కార్యక్రమాలు చేబడితే దేవుడంటాము. మన కనకరాజు అతన్కి భగవంతుడు కనిపిస్తాడని అంటాడు."

"అదో రకమైన ఇమాజినేషన్."

"డాక్టరుగారూ! అలా అవమానం

చెయ్యవద్దు. మా దేవుడిని చూపిస్తాను రండి'' అన్నాడు కనకరాజు.

''మీ దేవుడు, మా దేవుడు అంటూ ఇంకా పార్టీలు ఉన్నాయా !'' నవ్వాడు శివాజి. అర్జంటు అంటూ యెవరో రావటంతో అతను వెళ్లి పోయాడు. కనకరాజు, గాంధి చర్చించుకుంటూ బయటికి వచ్చారు.

డాక్టరు శివాజికి అమెరికా నుండి రాగానే అత్తగారింట్లో పరిచయం అయ్యాడు గాంధి. అతనే నర్సింగ్ హోమ్‌కు స్థలం చూపించాడు.

కంట్రాక్టర్ కనకరాజు, అతని నర్సింగ్ హోమ్ కట్టి, ఇచ్చాడు. అలా వారిద్దరికి డాక్టర్ శివాజి దగ్గర చనువు ఎక్కువ. శివాజి కూడా ఇతరుల దగ్గర చాలా రిజర్వ్‌గాను, గంభీరంగా ఉంటాడు. వీళ్లిద్దరిదగ్గర హాయిగా నవ్వుతాడు.

శివాజి మహారాష్ట్రీయుడు. అతని తల్లి



# యక్షగానం

విధవగా వచ్చి హైద్రాబాద్‌లో టీచర్‌గా చేస్తూ, శివాజి బొంబాయిలో మెడిసన్ చదువుతూండగా పోయింది. ఒంటరి వాడయిన శివాజి మెడిసన్ పూర్తిచేసి, విదేశాలకు వెళ్ళి, ఆరేళ్ళ క్రితమే స్వదేశం తిరిగివచ్చి నర్సింగ్‌హోమ్ పెట్టాడు.

అతనికి అమెరికాలో ఆంధ్ర కుటుంబంతో పరిచయం అయింది. అతని పేరు డాక్టర్ పార్థసారథి. అతని కూతురు మాధవితో వివాహం అయింది. ఒక్క కొడుకు పుట్టగానే మాధవి ఆరోగ్యం దెబ్బతిన్నది. అమెరికా స్పెషలిస్టులంతా పెదవి విరిచారు. అప్పుడు మార్పుకని హైద్రాబాద్ వచ్చాడు. మాధవి తల్లితండ్రులు వచ్చారు. హోమియో మందులు వాడారు. ఆయుర్వేద హాస్పత్రిలో చేర్పించారు. యునాని మందులు వాడారు. లాభం లేకపోయింది. డాక్టరయిన శివాజే ఆశ్చర్యపోయాడు. అతనికి తెలియకుండా ఉన్న ఒక్క కూతుర్ని దక్కించుకోవాలని పార్థసారథి దంపతులు మంత్రాలు, తంత్రాలు చేయించారు. పూజలు పునస్కాలు చేసారు. లాభం లేకపోయింది.

ఆరేళ్ళ అరవింద్‌ను, శివాజిని, తల్లితండ్రులను దుఃఖసముద్రంలో ముంచి మాధవి చనిపోయింది.

''మీకు కొడుకున్నాడు కోడలు పోయిందనుకోండి'' అని ఓదార్చాడు శివాజి. వాళ్ళు శివాజి ఆప్యాయతలో కన్నవారి ప్రేమను పొందారు. నర్సింగ్‌హోమ్‌కి తనకి తోచనప్పుడల్లా వస్తాడు పార్థసారథి.

గాంధి, కనకరాజు వాదించుకుంటూ వెళ్ళిపోయారు. శివాజీ తన రౌండ్స్ ముగించుకుని వచ్చాడు.

అతనికి అరవింద్ గుర్తుకు వచ్చాడు. అతనికి జ్వరం వచ్చింది. జ్వరం వస్తే అమ్మమ్మను ఆటలాడిస్తాడు. ఇంటికి డయల్ చేసాడు.

''హల్లో మమ్, నేను శివాజినీ! ... నిదురపోయాడా... ఈ పూటకు పాలు సూప్ ఇవ్వండి...అదేంలేదు డైజస్ట్ కాదని .. బై'' ఫోన్ పెట్టేసాడు.

అతనికి టీ వచ్చింది.

''సిస్టర్! రూమ్ నంబర్ ఫైవ్ దగ్గర యెవరయినా ఉండాలని చెప్పు. అలాగే డాక్టర్ సురమౌళికి ఫోన్‌చేసి రమ్మన్నానని చెప్పండి.''

''ఎస్ డాక్టర్. నాకు రెండురోజులు సెలవు కావాలి.''

''అలాగే, ఈ రెండు రోజుల కోసం నాన్సీని రమ్మనండి.''

''అలాగే డాక్టర్.''

ఫోన్ మ్రోగింది. శివాజి ఫోన్ ఎత్తాడు.

''హల్లో... డాక్టర్ శివాజీ హియర్! ...







నమస్తే ... పంపించండి... ఎక్కడ, మెల్ల, మెల్లగా అన్ని ఏర్పాట్లు చేస్తాను ... థాంక్యూ ... థాంక్యూ'' అతను ఫోన్ పెట్టేసాడు. అతని నర్సింగ్‌హోంలో జనరల్ పేషెంట్లకే బెడ్స్ ఉన్నాయి.

రోజుకు ఒకరు ఫోన్ చేస్తారు.

''కాన్పుల వార్డు ఉండాలండి.''

''ఆర్థోపేడిక్ వార్డు ఉండాలండి.''

''కను, ముక్కు చెవుల స్పెషలిస్టులు లేరా !''

''పిల్లల డాక్టరుండాలి'' అంటారు. అవన్నీ ఏర్పాట్లు చేయటానికి మరో అయిదారు సంవత్సరాలు కావాలి. అతను ఆలోచిస్తూ లేచాడు. నర్స్ చీటి తీసుకుని వచ్చింది. మంత్రి గారికి అనారోగ్యమట. ఇంటికి రమ్మని ఆహ్వానం.

''కారు పంపారు సర్.''

''పద వస్తున్నాను.''

ఇద్దరూ బయలుదేరారు.

''సిస్టర్ ! బి. పి. ఆపరేటస్ తీసుకో. వాళ్లకు తరుచుగా వచ్చే జబ్బు అది'' అన్నాడు.

సిస్టర్ నవ్వి బి. పి. ఆపరేటస్ తీసుకు వచ్చింది. శివాజి మంత్రిగారి ఇంటి ఆవరణలో కాసేపు ఆశ్చర్యంగా నిలబడిపోయాడు. ఆశ్రిత జనంతో ఆవరణ కిటకిటలాడిపోతోంది.

ఒక్కొక్క మంత్రికి ఇంత ఎస్టాబ్లిష్‌మెంటు అవసరమా !

''రండి డాక్టరుగారూ !'' పి. ఎస్. ఎదురువచ్చి ఆహ్వానించాడు.

అతని వెంట వెళ్లాడు.

''నమస్తే సర్ ఏమిటి సుస్తీ !'' వెళ్లి మంత్రిగారి ప్రక్కన కూర్చున్నాడు.

''ఏమి లేదయ్యా జరంత బలహీనం. చెమటలొస్తున్నాయి.''

శివాజి పరీక్షచేసి మందులు వ్రాసిచ్చాడు. టెన్షన్ తప్ప ఏంలేదు. ఆ మాటే చెప్పాడు.

''అవును డాక్టరు. నువ్వు మహారాష్ట్రపు మనిషివి కదా. బొంబాయిలో సదివినావు, అమెరికాలో కొల్వు జేసినావు. గింతబాగ తెలుగు మాట్లాడుతవేందయ్యా,'' అన్నాడాయన.

కాఫీ వచ్చింది. శివాజి పకపక నవ్వాడు.

''అభ్యాసం సర్. మీరు ప్రయత్నించండి వస్తుంది. మా ఆవిడ వల్ల నాకీ భాష అలవడింది'' అన్నాడు కాఫీ అందుకుని.

''మీ మామ నాకు బాగ తెలుసయ్యా. పార్థసారధి ... ''

''ఆయనకంటే ఆయన కూతురికి తెలుగు నేర్చుకోవాలని పట్టుదల ఎక్కువ. అందుకే నేను నేర్చుకున్నాను'' అన్నాడు.

''పరీక్షలు, బోరీక్షలు చేయించాల్నా.''

''అక్కరలేదండి. నాల్గురోజులు కాస్త సభలు, సమావేశాలు తగ్గించండి'' అన్నాడు.

''మా బతుకేగది ... '' పక్కున నవ్వాడు మంత్రిగారు. అందరూ అదేదో పెద్ద జోకయి నట్టు నవ్వారు.

వాళ్లను చూస్తే జాలి వేసింది. అధికారానికి హారతిపట్టే పెద్దలు. భట్రాజు పనిచేసి పబ్బం గడుపుకునే ప్రజాసేవకులు. నిట్టూర్చాడు శివాజి.

అతను ఇంటికి వచ్చేసరికి అరవింద్ నిదుర పోతున్నాడు. అది చూచి అతను చాలా రిలీఫ్‌గా కూర్చున్నాడు. మమ్మీ వచ్చింది.

''మీ మామయ్య ఆలస్యంగా వస్తారేమో. నీకు వడ్డించమనేదా ?''

''రానియ్యండి, తొందరేం...'' పేపరు తిరగేస్తూ కూర్చున్నాడు.

''బాబూ శివా ! నువ్వు కొడుకులేని లోటు తీరుస్తున్నావుకాని, నీకు తల్లిలేని లోటు నేను తీర్చటం లేదు'' అన్నది అతని ప్రక్కన కూర్చుంటూ.

''అదేంమాట మమ్ ! మీరెప్పుడూ అలా అనుకోవద్దు. నాకేం తక్కువయింది !'' అన్నాడు బాధగా.

''మీ తల్లి అయితే ఇలా వదిలేస్తుందా ! మళ్లీ పెళ్లి చేయదూ !''

అతను ఒక్కసారి ఆమెవంక చూచాడు. మాధవిని మరిచిపోలేను అంటే ఆత్మవంచనే అని తెలుసు. అందుకే మెల్లగా తన అభిప్రాయం చెప్పాడు.

''చూడండి మమ్ ! ఆ వచ్చే ఆవిడ నాకు భార్యగా వస్తుందిగాని, మీకు కూతురుగా, అరవింద్‌కు తల్లిగా రావటానికి ఇష్టపడదు'' అన్నాడు.

''అలాంటి సాకు పెట్టకు శివాజీ ! మాకు ఏమయింది ! పనిమనుషుల్ని పెట్టి చేయించు కుంటాము'' అన్నదామె.

''సాకు కాదు... సరే, మీరీ విషయంలో అంత పట్టుదలగా వుంటే మంచి సంబంధం మీరే చూడండి'' అన్నాడు, పేపర్‌పడేసి లేస్తూ.

అతను హాస్పత్రి నుండి రాగానే స్నానం చేస్తాడు. క్రింద ఒక చిన్న గది ఉంది. అందులో తన హాస్పత్రి సరుకంతా పెట్టటమేకాక, హాస్పత్రి నుండి వచ్చి బట్టలు మార్చుకుని, ఆ గదిలోనే వదిలివేస్తాడు. అతను స్నానానికి వెళ్లగానే ఆమె లేచి, వంటామెతో వడ్డించమని చెప్పింది. పార్థ సారథి కూడా వచ్చాడు.

అందరూ భోజనాలు చేసారు.

''పార్థూ ! శివాజి అమ్మాయిని చూడ మన్నాడు.''

''ఇంతవరకు అమ్మాయిల్ని చూడద్దు, కళ్లు మూసుకొమ్మన్నాడా మేడమ్.''

''చాల్లెండి.'' ముఖం తిప్పుకుంది.

''అదికాదు మామయ్యా ! ఆమెకు నా పెళ్లి విషయంలో చాలా బెంగగా ఉన్నది'' అన్నాడు.

''తెలుసు శివా ! నా దృష్టి యెప్పుడూ అమ్మాయిలమీదే ఉంటుంది. ఈ రోజు అందుకే ఆలస్యం అయింది. హౌస్ సర్జన్సీ చేసిన ఒక డాక్టరు వచ్చింది...'' అతను సంతోషంగా చెప్పుకుపోతున్నాడు.

''మామయ్యా ! నాకు అసిస్టెంటు కాదు. ఇల్లాలు కావాలి'' అన్నాడు.

''శివా ! నీకు అనుభవం లేదు. బయటి

## గ మ ని క

గేయాలు పంపేవారు వాటితో తపాలా కార్డు జత పరచవలసి వుంటుంది. గేయాలు త్రిప్పి పంపబడవు. గేయాలు, కవితలు సాధ్యమైనంత క్లుప్తంగా వుండటం మంచిది. —సం.







# య క్ష గా న ం

వారిని ఆసిస్టెంటుగా పెట్టుకుంటే చాలా ప్రాబ్లమ్స్ వస్తాయి."

"అయినా పరవాలేదు. నేను వ్యాపారం కోసం, సంపాదన కోసం కాదు. మీ కోసం, నా కోసం..." అంటుండగానే అరవింద్ లేచాడు.

"డాడీ... డాడీ..."

"అరవింద్! అక్కడే ఉండు... వస్తున్నా..." చెయ్యి కడుక్కునివెళ్ళి కొడుకును ఎత్తుకున్నాడు.

"నాకు... నాకు... అన్నం కావాలిడాడీ..."

"వంటామెతో చెబుతాను. సాయంత్రం అన్నీ నీకిష్టమయినవే చేస్తుంది. ఇప్పుడు బ్రెడ్ తినాలి." అన్నాడు అనునయింపుగా. అరవింద్ ముఖం మాడ్చుకున్నాడు.

"నీకు జ్వరం తగ్గగానే అయిస్‌క్రీమ్ తెస్తాను." అని బుజ్జగించి రెండు స్లైసుల బ్రెడ్డు పెట్టాడు.

అతను కొడుకుతో మాట్లాడుతుండగానే, సీరియస్ కేసు వచ్చిందంటూ, నర్సింగ్ హోమ్ నుండి ఫోన్ వచ్చింది. హడావిడిగా అరవింద్‌ను వదలి అతను వెళ్ళిపోయాడు.

## 4

ముకుందాదేవి తలంటుకుని కూర్చుంది. పనికుర్రాడు గ్లాసుతో పాలుతెచ్చి ఇచ్చాడు. పాలు త్రాగింది.

"నీలిమ లేచిందా ?"

"చిన్నమ్మగారు నిదురపోతున్నారండి."

"అయ్యగారు లేచారా !"

"లేచారండీ, ఆ సుట్టం అయ్య లేడండి, ఆయనేమో, అయ్యగారిని నడిపిస్తున్నారు," అన్నాడు పనివాడు, చిన్న.

ముకుందాదేవి వేలు ముడివేసుకుని లేచింది. మెల్లగా కూతురు గదివైపు నడిచింది. ఆమె గుండెల మీద రాత్రి చదువుతున్న పుస్తకం అలాగే ఉంది. ఆ పుస్తకం అక్కడపెట్టి, కూతురు ముంగురులు సవరించింది. ఆమె కళ్ళలో అప్రయత్నంగా నీళ్ళు తిరిగాయి. ఆమె పమిటతో తుడుచుకుంది.

"అమ్మా! యెవల్లో వచ్చారు." చిన్న చెప్పాడు.

"ఉష్ ..." అల్లరి చెయ్యరాదన్నట్టు నోటికి చెయ్యి అడ్డంపెట్టి, మెల్లగా బయటికి వచ్చింది. హాలును ఆనుకుని ఉన్న గదిలోకి వెళ్ళిందామె. అక్కడ కూర్చున్న నల్గురు లేచి ఆమె కాళ్ళపై పడిపోయారు.

"లేవండి... ' ఆ కంఠంలో గాంభీర్యానికి, కరుణత్వానికి కరిగిపోయినట్టు అయ్యారు వారు లేచారు.

"ఇదేం బానినత్వం !"

"భగవంతుడిని దర్శించి, పాదాభివందనం చేయటం బానిసత్వమా ! లేదు భగవాన్..."

అతని మాటలు మధ్యలోనే త్రుంచేసిందామె.

"నేను ముకుందాదేవిని. ఉత్త ముకుందా దేవిని." అన్నది.

"మీరలా అన్నా, మేం అంగీకరించం..."

"దయచేసి ఇప్పుడా విషయాలు మాట్లాడ వద్దు." అంటుండగానే ఓ స్త్రీవచ్చి, ముకుందా దేవికి నమస్కరించింది.

"సత్యా! వీరికేం కావాలో అడుగు..." లేచి వెళ్ళిపోయింది ముకుందాదేవి.

"కూర్చోండి." అన్నది సత్యవతి.

అందరూ కూర్చున్నారు.

"ఇప్పుడు చెప్పండి, నేనేం చేయగలనో ?"

"మా వాడిని ఫారన్ పంపాలని ఉంది. డాక్టరి పాసయి రెండేళ్ళయింది..." అన్నాడో పెద్ద అతను.

"అయితే..." సత్యవతికి అర్థంకాలేదు.

"ఇప్పుడు డాక్టర్లు, పరీక్షలు వ్రాయాలి. అది చాలా టఫ్..." అన్నాడు. సత్యవతి తల పంకించింది.

"మీ పేరేమిటో..."

"నా పేరు నాగలింగం అండి. ఒక్కగా నొక్కడు..." అతను బాధపడ్డాడు.

"ఇప్పుడు, ఇక్కడేం చెప్పవద్దండి. గురు వారం, శనివారం, సోమవారాలు భగవత్ దర్శనం అవుతుంది. అక్కడ వెదురుబొంగులు అమ్ముతారు. బొంగులు ఆ పరమాత్మకు అర్పణచేస్తే మీ కష్టాలకు ఓ దారి చూపుతాడు," అన్నది.

"అది కాదండి..."

"ఇక్కడేం చెప్పవద్దండి, అంతా ఆ భగవంతుడు గ్రహించగలడు," ఇక వెళ్ళవచ్చని సత్యవతి పంపించింది. ఆమె అక్కడున్న పేపరు తీసుకుని, గబ, గబా ఏదో రాసింది.

"సత్యవతమ్మా..." తలయెత్తిందామె గుమ్మంలో చైనులు నిలబడి ఉన్నాడు.

"ఏమిటి చైనులూ !"

"ఏం లేదమ్మా. శ్రీహరిరావుకు ఆఫీసులో పిల్లతో ప్రేమంట, ఆ భార్యకు మంటంట.. ఆ మంటే ఆమెను పిచ్చిదాన్ని చేస్తుంది."

సత్యవతి అతని మాటలు వింటున్నా ఆమె చేతులు వ్రాస్తున్నాయి. చైనులు వెళ్ళిపోయాడు.

సత్యవతి ఏదో రాసుకుంటుండగానే ఇద్దరు వ్యక్తులు వచ్చారు. అతను నాటకాలరాయుడు, అతని భార్య మాలతి వచ్చారు.

"సత్యవతమ్మా! ఓ రెండు వందలు కావాలమ్మా."

"ఇప్పుడంత డబ్బు దేనికి ?"

"నీకంటే పెళ్ళి, పెటాకులు లేవు. నాకెన్ని ఖర్చులు." అన్నాడు రాయుడు. సత్యవతి లోపలకి వెళ్ళి డబ్బు తెచ్చి ఇచ్చింది.

"సత్యమ్మా! అమ్మ రమ్మంటుంది." చిన్న చెప్పాడు.

సత్యవతి డైనింగ్ హాలులోకి వెళ్ళింది. టేబుల్ ముందు ముగ్గురుకాక, నాల్గో వ్యక్తిని చూచి ఆశ్చర్యపోయింది.

"రా సత్యా! ఇతను ఆదిత్య అని నిరుద్యోగిట. మా వారి స్నేహితుని కొడుకుట. ఉద్యోగం దొరికేవరకు ఏదైనా పని చూపించాలి" అన్నది ముకుందాదేవి.

సత్యవతి డైనింగ్ హాల్లో ఉన్న చిన్న కుర్చీ లాక్కుని కూర్చుంది.

"నీ ఉపహారం అయిందా ?"

"ఆహా! దట్టంగా ఉప్మా పట్టించాను. సావిత్రమ్మగార్ని రిసీవ్ చేసుకోవటానికి మీరు రాక పోతేనే బావుంటుంది" అన్నది సత్యవతి.

"సరే ..." అన్నది ముకుందాదేవి.

"రాయుడి ఖర్చు పెరిగిపోతోంది మేడమ్" అన్నది సత్యవతి.

ముకుందాదేవి ఏమి తోచనిదానిలా ఒక్క నిముషం అసహాయంగా చూచింది.

"ఈసారి డబ్బు అడిగితే నా దగ్గరకు పంపించు."

"ఇతన్ని అకవుంట్స్ మేంటేన్ చేస్తూ బ్యాంకు పనులు చెయ్యమనండి. చైనులిని బ్యాంకుకు పంపితే చాలు, ఖర్చులు గుర్తుకు వస్తున్నాయి" అన్నది.

"ఈ మధ్య తాగుడు కూడా ఎక్కువయి నట్టుంది."

"ఈ మధ్య త్రాగి మీ కంట పడుతున్నాడు. ఎప్పుడూ తాగుడు ఎక్కువే" అన్నది సత్యవతి.

చిన్న అందరితోపాటు, సత్యవతికి కాఫీ తెచ్చి ఇచ్చాడు. ఆమె కాఫీ త్రాగుతుండగానే, బిలబిలమంటూ మరో నల్గురు స్త్రీలు వచ్చారు. అందరూ లోపల హాల్లోకి వెళ్లారు. హాలులో నిలువెత్తు కృష్ణ విగ్రహముంది. దానిముందు పరిచిన తివాచీలో అందరూ కూర్చున్నాక, నీలిమ బయటికి వచ్చింది.

"అంకల్! ఇదంతా మీరు నమ్ముతారా !"

"ఎవరి నమ్మకం వారిది ఆదిత్యా! నువ్విలా మొండికేస్తే నీకు ఎక్కడా ఉద్యోగమే దొరకదు" నందనరావు చెప్పాడు.

"అది కాదంకల్ ..."

"ఇదిగో నువ్వేం మాట్లాడకు. నీకే రోజు ఉద్యోగం దొరికితే ఆ రోజు జాబ్ వదలివేద్దువు గాని."

"థాంక్యూ అంకల్."

"థాంక్స్ చెప్పాల్సింది నాకు కాదు."

"తెలుసు ఆంటికి. అయినా మీరే ప్రతి పాదించి ఉంటారు" అన్నాడు.

"అదేం లేదు. నీలూ ఇతనికేదయినా పని చెప్పు" అన్నారు నందనరావు. ఆదిత్య లేచి నీలు వెంట వెళ్ళాడు.

"ఆదిత్యగారూ! ఈ ఉత్తరం తీసుకుని దానికి, అయిదారు కాపీలు తీసి, ఈ దిగువ అడ్రసులకు పోస్ట్ చెయ్యండి" అంది.

"అలాగే ..." అని సత్యవతి ఇందాక కూర్చున్న గదిలోకి వెళ్ళి కూర్చున్నాడు.

ఉత్తరం తీసాడు. వివిధ సంస్థలు, వ్యక్తులు భగవంతుడుకి భక్తితో సమర్పించిన కానుకలకు థాంక్స్ చెబుతూ వ్రాసారు. దాని కాపీలుతీసి, ఫర్ అని ముకుందాదేవి పేరుపెట్టి, పోస్ట్ చేయబోతూ, అన్ని అడ్రసులు మరొక్కసారి చూచాడు.

శ్రీకృష్ణ సేవా సంస్థనుంచి వెయ్యి నూట పదహార్ల విరాళం ఉంది. అది చూచిన ఆదిత్య హృదయం భగ్గుమన్నది. అలాగే ఉత్తరాలు పట్టుకు కూర్చున్నాడు.

"ఇదిగో ఈ లెక్కలుచూచి, మనము ఎవరికి ఎంత ఇవ్వాలి, మనకు వాళ్ళెంత ఇవ్వాలో చూడండి," ఓ బౌండు పుస్తకం అతనిముందు ఉంచింది.

"ఆ!... ఏమన్నారు ? ఇది చూడాలా ? అలాగే..." సర్దుకుని కూర్చున్నాడు.

"ఏమిటి మీరింకాఏమోఆలోచిస్తున్నారు?"

"అబ్బే... ఏంలేదు." అన్నాడు కంగారుగా.

"అభిప్రాయాలు కలువనంత మాత్రాన, మిమ్మల్ని నిందించి, నిష్ఠూరాలు ఆడే అల్పులం కాము. అసలు విషయం చెప్పండి" అన్నది. ఆమె చెప్పనిదే కదలనన్నట్టు, అతని ముందు తిష్ఠ వేసుకుని కూర్చుంది.

"శ్రీకృష్ణ సేవా సంస్థలో ఆరు నెలలు పని చేసాను..." మిగతా విషయాలు చెప్పటానికి జంకాడు.

"అర్థం అయింది." నీలిమ ముసి, ముసిగా నవ్వింది. "ఈవిడకేం అర్థంఅయింది బొమ్మ" అనుకున్నాడు.

"అక్కడ మీకు రెండు వందల యాభై రూపాయలకు సంతకం పెట్టించుకుని, యాభై రూపాయలు ముట్టజెప్పేవారు. అదికూడా అప్పుడప్పుడు అవునా !"

"అరే... మీకెలా తెలుసు ?" ఈసారి ఆదిత్య ఆశ్చర్యంతో చూచాడు.

"అదేం అని యెవరయినా అడిగితే,వాళ్ళపై దొంగతనం మోపి పంపివేస్తారు." అన్నది.

"అంతటి నీచులు, దుర్మార్గులని తెలిసి కూడా ఆడబ్బేలా తీసుకున్నారు!" ఆదిత్య ముఖంలో ఏహ్యత కొట్టవచ్చినట్టు కనిపించింది.

"అవతలవాడు యెలాంటివాడు అని మేము చూడము. అతని భక్తే చూస్తాం." అన్నది.

"అతను హంతకుడయినా పరవాలేదా?"

"హంతకుడయినా అభ్యంతరం లేదు. ఇప్పటికే యెందరో హంతకులు భక్తబృదంలో ఉండి ఉంటారు."

"అయినీ..."

"తప్పక చూద్దురుగాని." ఆమె లేచి వెళ్ళిపోయింది. ఆదిత్య అశాంతిగా, ఏం తోచనట్టు చూచాడు. అతనికి అక్కడ ఒక్క నిమిషం ఉండాలనిపించలేదు. కాని ఆకలిబాధ తెలిసినవాడు. అందుకే లాలాజలంతోపాటు తన ఏహ్యత కూడా మింగాడు.

(ఇంకా ఉంది)



## పి. ఎమ్. ఎస్. – గుడివాడ

5–8–83 న ప్రేమ గురించిన మీ జవాబు నాకు ఏడుపు తెప్పించింది. మీ జవాబులో మీరు అంత పార్షియాలిటీతో జవాబులు ఇవ్వకండి. పురుషులలోనూ త్యాగధనులున్నారు. అలాటి గాధల నుద్దేశించే కదా దాసరి ప్రేమాభిషేకం తీశారు? ముత్తురామన్ అమర గీతం తీశారు. మీరు చూడలేదా ?

★ చూశాను. అవి సినిమాలని మరచి పోకండి. జీవితానికి చాలా చాలా దూరమైన భావనలు.

## ఎమ్. ఎస్. ఆర్. – విజయనగరం

నేను మీ ప్రశ్నావళి చదువుతాను. చాలా మంచి జవాబులు యిస్తూంటారు. మీకు ఎలాగు ఆలోచనలు వస్తాయి ?

★ నాకూ అర్థం కావడం లేదయ్యా, నా బుర్రలో కాస్త కోటనందూరు నల్లమట్టి వుందేమోగాని– లైట్ సెల్ఫ్ లేవంటారు– మా వాళ్లు !! ఏదో కాస్త మా మేనత్త గయ్యాళి తనం వచ్చింది కనుక– నోరెట్టుకుని బతికేస్తున్నాను !

## కె.ఎవ్.ఆర్. – శివం

కొందరు సినిమాలు చూసి పాడవుతున్నారంటున్నారు మీరేమంటారు ?




★ పాడవడానికి ఒంకలకోసం వెతికేవారికి– సినిమాలైనా చాలన్నమాట !!

## ఆర్. ఆర్. వి. – పొందూరు

స్త్రీలకి స్వేచ్ఛ యిచ్చామంటుంది సొసైటీ. ఎప్పుడు ఎవరికి యిచ్చింది ? అత్యాచారాలకు బలి అయిపోతూన్న పడతులకా ? వరకట్నపు జ్వాలలో మాడిపోతూన్న వనితలకా ? పురుషాహంకారానికి నల్గిపోతూన్న మగువలకా?... స్త్రీకి స్వేచ్ఛ కల్గించడమనేది ఈ ప్రభుత్వానికి గాని. యీ వ్యవస్థకుగాని సాధ్యంకాదు. స్త్రీ పక్షపాతి అయిన ప్రకృతి మారినప్పుడే స్త్రీకి స్వేచ్ఛ లభించేది.

★ ఆవేశంతో మీరేమంటున్నారో మీకే తెలియడంలేదు. స్వేచ్ఛ – ఒకరిచ్చేదీ, యింకోరు పుచ్చుకునేదీ కాదు. అది ఎవరికివారు – సహజంగా కల్గివుంటారు. కాని స్త్రీలు ''స్వేచ్ఛాకాములు'' కానందువల్లనే – స్వేచ్ఛ లేదు అన్న వాదన బలపడుతోంది. మనిషిగా తన ఉనికికి తానే స్వస్తి చెప్పకునే స్త్రీలకి స్వేచ్ఛ లేదనే హక్కు కూడా వుండదు... సంఘ జీవితానికి దూరమై మనిషిగా గుర్తింపునకు నోచుకోక... కాలగమనంలో వెనుకబడిపోయి – నీడగా మారిపోయింది స్త్రీజాతి. యీ జాతిని ఉత్తేజితులను చేస్తూ అక్కడక్కడ అప్పుడప్పుడు ఆణిముత్యాల వంటివారు వస్తూనేవున్నారు. సముద్రంలో నీటిబొట్టులాగా వీరి కృషికి పర్యవసానం కన్పించే అదనులేకుండా పోతూంది దీనికి సొసైటీ ఏంచేస్తుంది ? పరిస్థితులేం చేస్తాయి ? ప్రకృతి ఏంచేస్తుంది. స్త్రీజాతి జాగృతం కావాలంటే ముందు వ్యక్తిత్వం అనే పౌరుషం తలెత్తాలి... అది లేకుండా ఆడిపోసుకోవడం – చేతకాని ఆడతనంగా తోసిపారేస్తారు.

## పి. హెచ్. ఎస్. – బొంబాయి

పురుషుల ఆగడాలవలన, దౌర్జన్యంవలన ఎందరో స్త్రీలు పతనమయ్యారని బలిఅయ్యారని అంటారుకదా, ఎందరో పురుషులు సమాజంలో తలెత్తుకు తిరుగలేక మానసికంగా శారీరకంగా కృంగిపోతున్నారే. వాళ్లమాటేమిటి ?

★ కృంగిపోడం, తలెత్తుకోలేక పోవడం – పతనం బలీ– కాదే !! మామూలుగానే అనేక మంది స్త్రీలు పురుషుల ప్రవర్తనవల్లన తలెత్తుకు తిరగలేకపోవడం మీరు చూడలేదా ?

## ఆర్.ఆర్.వి. – పొందూరు

అమాయకులైన ఆడపిల్లల శీలాలు దోచేటప్పుడు గుర్తుకురాని తల్లితండ్రులు పెళ్లి విషయం రాగానే గుర్తుకువస్తారా యీ మగవాళ్లకు ?

★ పెళ్లంటే– ఒక్క శీలం దోచుకోవడమే కాదని వాళ్లకి తెలుసు ! అందుకే ఆ జాగ్రత్త.

## పి.ఎవ్.ఆర్. – కామారెడ్డి

అక్కయ్యా నేను కాలేజీలో ఒక పేరుతోను, బయట మరో పేరుతోను ఇబ్బంది పొందుతున్నాను. అధికారికంగా కాలేజి రికార్డులో నా పేరు మార్చుకొందుకు మార్గం తెలియచేయండి.

★ మీ కాలేజీలో ఆఫీసు వుందా ? అక్కడ అడిగి తెలుసుకో. అతగాడు చెప్పిన ప్రకారం – యూనివర్శిటీ రిజిస్ట్రారుకి రాయిమన్నా రాయాలి. ఏదో కాస్త ఫీజు వుంటుంది. రిజిస్టరులో పేరు మార్చడానికి అది కట్టేస్తే – సరిపోతుంది.

## ఎం. వి. – కర్నూలు

నేనొక అమ్మాయిని ప్రేమిస్తున్నాను. ఆమె యింకా చదువుకుంటోంది. చెప్పాలంటే చదువు పాడవుతుందని...

★ మంచిదయ్యా విశ్వనాథా ! చెప్పకుండా వున్నంత కాలం – ఇద్దరికీ – మంచిది ? ★

# షర్టింగులు: పాలియెస్టర్, పాలియెస్టర్ బ్లెండ్ మరియు కాటన్

మంచి అభిరుచి.
తగిన ధరలు.

నేషనల్ టెక్స్‌టైల్ కార్పొరేషన్




(తమిళనాడు మరియు పాండిచెరి) లి
భారత సర్కారపు ఒక ఉద్యోగ సంస్థ
10/64 సోమసుందరం మిల్స్ రోడు, కొయమత్తూరు-641009

ఇండెంటింగ్ ఏజెంట్లు: ఆంధ్ర ప్రదేశ్: బాలాజీ టెక్స్‌టైల్ ఏజెన్సీస్, 3-4-394, టొబ్యాకో బజారు, సికింద్రాబాద్-500 003 (ఏ.పి.). సంగం టెక్స్‌టైల్స్ ఏజెన్సీస్, 230, మొదటి అంతస్థు, డి.బి. రోడ్డు, కొయమత్తూరు-641 002. ఆర్. పి. డిస్ట్రిబ్యూటర్స్, 3-4-394, టొబ్యాకో బజారు, సికింద్రాబాద్-500 003 (ఏ.పి.).

MCA/NTC/87 TEL



# రైలు ప్రయాణం

## కో. తిరుమల రావు

రైలు బయలుదేరడానికి పదినిముషాలుండనగా ఒక టికెట్ కలెక్టర్ రామకృష్ణ దగ్గరకి వచ్చి "మీరేనా ఆర్. కె. కిషన్ !" అని తన చేతిలోని కాగితాలవైపు చూస్తూ ఇంగ్లీషులో అడిగాడు. రామకృష్ణకు తన పేరునిలా మార్చి అడగడం ఒక క్షణం చిరాకెత్తించింది కాని తను టికెట్ కొనుక్కున్నప్పుడే అలా తప్పు వ్రాయడం చేత టికెట్ కలెక్టర్ మీద విసుక్కుని లాభం లేదని "అవును" అని మాత్రం సమాధాన మిచ్చాడు. "ఢిల్లీ వరకూ వెళ్తున్నారు ?" అని నిర్ధారణ చేసుకుని ఆ రైల్వే ఉద్యోగి వెళ్ళిపోయాడు. రత్‌లాంలో తనొకరోజు దిగవచ్చునని అతనితో రామకృష్ణ చెప్పలేదు.

రామకృష్ణ ప్లాట్‌ఫారం మీద నుంచి తన కంపార్ట్‌మెంట్‌లోకి ఎక్కి తలుపుదగ్గర నుంచున్నాడు బొంబాయి నుంచి ఢిల్లీ వెళ్ళడం అతనికిదే మొదటిసారి. బొంబాయి కూడా తను ఇంతకుముందు రెండుసార్లే వచ్చాడు. అక్కడ తనకున్న ఒక్క స్నేహితుడూ వేరే పని మీద మరింకొక చోటికి వెళ్ళవలసి వచ్చింది. అందువల్ల స్టేషన్‌కి తనకి తెలిసిన వారెవరూ రాలేదు.

కంపార్ట్‌మెంట్‌లోని నాలుగు బెర్తులలోనూ మూడు ఖాళీగా ఉన్నాయి. ఎవరూ రారను కుంటూ ఉంటే, ఇందాక వచ్చిన టికెట్ కలెక్టరుతో ముగ్గురు త్వరత్వరగా వచ్చి, లోపలికి ఎక్కడం మొదలుపెట్టారు. రామకృష్ణ వారిని రానిచ్చేందుకు లోపలికి జరిగాడు. వచ్చిన వారిలో ఒకతను సిక్ అని అతని వేషమే తెలుపుతూ ఉంది. మిగిలిన వారిద్దరిలో ఒక మనిషి బలంగా ఉన్నాడు, పెద్దమీసాలతో. అతని వెంట సన్నగా, పొడుగ్గా ఉన్న ఒకతను లోపలికి వచ్చాడు. మొహం పాలిపోయి కణతల దగ్గర రక్తనాళాలు పచ్చగా కనిపిస్తున్నాయి. టికెట్ కలెక్టర్ వారి పేర్లు గబగబ వ్రాసుకుని, ఏదో చెప్పి పరిగెత్తుకుంటూ వెళ్ళిపోయాడు.

వాళ్ళు సామాను సర్దుకుంటూ ఉంటే, రైలు బయలుదేరింది. మీసాల మనిషి వచ్చి రామకృష్ణ పక్కన కూర్చున్నాడు. తక్కిన వారిద్దరూ సామానంతా సర్ది ఒక పెట్టెను మధ్య నిలువుగా నుంచోపెట్టారు. దానికి మూడువైపులా రెండు పెట్టెలు చిన్న ఒక బుట్టా అమర్చాడు. రామకృష్ణకు ఇదెందుకో బోధపడలేదు.

"ఎంతవరకు వెళ్తున్నారు ?" అని మీసాలున్నతను అతన్ని అడిగాడు ఇంగ్లీషులో.

"ఢిల్లీ" అని రామకృష్ణ చెప్పాడు. "మీరు ?" అని అడిగాడు. అతనొక విధంగా నవ్వి ఏదో సణిగాడు. రామకృష్ణ తన స్నేహితుడొకడు రత్‌లాంలో ఉండడంచేత అక్కడ దిగిపోతే దిగవచ్చుననే సంగతి చెబుదామా అని ఆలోచించి, ఊరికేనే చెప్పకుండా వదిలివేశాడు. ఇంతలో సన్నగాఉన్న వ్యక్తి వచ్చి, రామకృష్ణను హిందీలో ఏమో అడిగాడు. రామకృష్ణకు

అర్థంకాలేదు కాని, ''కిషెన్'' అనే మాట వినిపించింది.

ఇంగ్లీషులో ''నా పేరడుగుతున్నా రనుకుంటాను. ''కిషెన్ కాదు! రామకృష్ణ! బొంబాయిలో బుకింగ్‌క్లార్క్ తప్పుగా అలా రాశాడు. నాకు హిందీరాదు.'' అని అన్నాడు.

''అలాగా ?'' సన్నగా ఉన్న తను జవాబిచ్చాడు. తక్కినవారిద్దరూ అంతా వింటున్నారు.

''మీ పేరు ?'' అని రామకృష్ణ అడిగాడు. వారు ముగ్గురూ ఒకరి ముఖాలొకరు చూసుకున్నట్లు అతనికి అనిపించింది. ఒక క్షణం తర్వాత సిక్, ''నా పేరు కమల్‌సింగ్, ఇతను,'' అని మీసాల మనిషిని చూపిస్తూ, ''కపూర్, ఇతనిపేరు బాల్టె,'' అని పరిచయం చేశాడు. రామకృష్ణ లేచి అందరితోనూ కరచాలనం చేశాడు.

బాల్టె జేబులోంచి రెండు చీకట్ల పేలుతీసి 'సెల్లోఫేన్' కవర్‌లను చించివేస్తున్నాడు. కమల్‌సింగ్ హిందీలోనో, ఇంకొక భాషలోనో, గబ గబ మాట్లాడుతున్నాడు. కపూర్ నిర్లక్ష్యంగా తలఆడించినట్లనిపించింది రామకృష్ణకు. బాల్టె వంకరగా చిరునవ్వు నవ్వుతూ పేకముక్కల నొక చేతినుంచి మరొక చేతిలోకి ధారగాపోస్తూ మంచున్నాడు. చివరకు, కమల్‌సింగ్ రామకృష్ణతో, ''చిన్న ఆట వేస్తున్నాం. మీరు కూడా...'' అని వదిలివేశాడు. రామకృష్ణకు పేకాటంటే అసలు ఇష్టంలేదు. ఏమనాలో తెలియక చూస్తూఉంటే కపూర్, బాల్టేలు తన వైపు కొంచెం దీక్షగా చూస్తున్నారని గ్రహించాడు. ఎందుకో కపూర్ చూపు అతన్ని కలవర పెట్టింది. కొంచెం భయంవేసిందికూడా. అనుకోకుండా, ''సరే'' నన్నాడు.

''మీకు మూడు ముక్కల ఆట వచ్చుననుకుంటాను. మనమిప్పుడాడబోయేది అదే,'' అని కమల్‌సింగ్ చెప్తూ కూర్చున్నాడు; అతనికి ఎదురుగా రామకృష్ణ, కుడిచేతివైపు సీట్‌మీద బాల్టే, ఎదురుగా కపూర్.

''అంత బాగారాదు. అయినా మీరెంత ఆటలాడుతున్నారు ?'' అని రామకృష్ణ ఎదురు ప్రశ్న వేశాడు. కమల్‌సింగ్ సమాధానం ఆశ్చర్యం, సందేహం కలిగించాయి. తను అంతకు ముందెప్పుడూ అటువంటి పందెంతో ఆడలేదు. అయినా మొత్తం తన దగ్గరున్న మూడు వందలను తలుచుకొని ఆడేద్దామనుకున్నాడు.

మొదటి రెండు ఆటలూ కపూర్ గెల్చాడు. తర్వాత కమల్‌సింగ్ కొన్ని, తను కొన్ని గెల్చారు. కపూర్ మధ్యలో లేచి పెట్టెలో నుంచి ఒక 'విస్కీ' సీసా తీసాడు. రామకృష్ణ ఎంత బలవంతం చేసినా తాగదల్చుకోలేదు. వారు ముగ్గురూ త్రాగడం మొదలుపెట్టారు ''మద్యపాన నిషేధం'' గురించి చిన్న చిన్న ''జోక్స్'' అందరూ చేశారు. సుమారు గంట సేపటివరకూ బాల్టే ఒక్క ఆటకూడా గెలువలేదు. కపూర్ ఈ విషయాన్ని గురించి బాల్టేను కొంచెం వెక్కిరించడం మొదలుపెట్టాడు. అప్పటికి అతనే బాగా గెల్చాడు. రామకృష్ణకు అందరిలోకీ తక్కువపోయింది.

బాల్టే ఒక ఆట గెల్చాడు. ''ఇక మీరు గెలుస్తారనుకుంటాను,'' అని రామకృష్ణ అంటే అతను సమాధాన మియ్యకుండా పేకముక్కలను కలిపి పంచడం మొదలుపెట్టాడు. తర్వాత రెండు ఆటలు గెల్చాడు. ఒకటి రెండు ఓడిపోయి మళ్ళీ గెల్చాడు. కపూర్ కొంచెం విసురుగా ఆడి బాగా నష్టపడ్డాడు. ప్రత్యేకం ఒక ఆటలో అతనూ, బాల్టే ఒకరిమీద ఒకరు పందెం వేసిన తర్వాత ముక్కలు తిరగవేశారు. బాల్టేవి మూడు రాజులూ, కపూరువి ఆసూ, రాజా, రాణీ. కపూర్ విసుక్కుంటూ ముక్కలు విసిరివేశాడు. రామకృష్ణ, కమల్‌సింగ్‌లు వాటిని ఏరి బాల్టేకు ఇచ్చారు.

బాల్టే వరుసగా గెలవటం మొదలుపెట్టాడు సూరత్ స్టేషన్ వచ్చేసరికి కపూర్ డబ్బంతా పోయింది. బండి ఆగుతూ వుండగానే అన్నీ లోపల దాచేశారు. మళ్ళీ బయలుదేరిన తర్వాత కపూర్ తన పెట్టెలో నుంచి నోట్ల కట్టలు బయటికి తీశాడు. ''రామకృష్ణా! ఇక మనదే గెలుపు చూస్కో ?'' అని తనకు వేసిన ముక్కలను చూడకుండానే డబ్బు కట్టడం మొదలుపెట్టాడు. మళ్ళీ పోయింది. బరోడా స్టేషను వచ్చేవరకూ అతను ఓడిపోతూనే ఉన్నాడు.

రామకృష్ణ దిగి కొంచెం టీ త్రాగి, ఫ్లాస్కులో కొంచెం పోయించుకుని వచ్చాడు. మళ్ళీ ఆట మొదలు పెట్టిన తర్వాత ఒక ఆట గెలిచాడు. దానితో అతని నష్టం పది, పదిహేను రూపాయలకు తగ్గిపోయింది.

''త్రాగడం కొంచెం తగ్గించు! లేకపోతే ఆట గెలవ్వు!'' అని కమల్‌సింగ్ కపూర్‌తో అన్నాడు. కపూర్ అతనిమీద కసురుకున్నాడు. సుమారు ఒంటిగంట అవుతుందనగా బాల్టే ఒక పెద్ద ఆట గెలిచి పేక కలుపుతున్నాడు. కపూర్ అతని చేతులవైపే జాగ్రత్తగా చూస్తున్న వాడల్లా ''ఆగు!'' అని అరిచి ముక్కల్నిలాక్కుని తెరిచి పరీక్ష చేయడం మొదలు పెట్టాడు. వాటిని క్రిందకి విసిరి ఏదో అరుస్తూ, సీసాను చేతోకి తీసుకొని బాగా వెనక్కిలాగి బాల్టే నెత్తిమీద కొట్టాడు. అతని తల గాజుసీసాకు తగిలినపుడు కలిగిన చప్పుడుకు రామకృష్ణ వళ్లు జలదరించింది. ఇదంతా కొన్ని సెకన్లలో జరిగిపోయింది. బాల్టే చిన్న అరుపుతో వెనక్కి పడిపోయాడు. కమల్‌సింగ్, రామకృష్ణ అతన్ని లేవదీశాడు.

''మోసం చేస్తున్నాడు రాస్కెల్ !'' అని కపూర్ ఏదో అంటున్నాడు. బాల్టే కణత చితికిపోయి ఉన్నది. రామకృష్ణ గుండెమీద చేయివేసి చూశాడు. ప్రాణం లేదనిపించింది.

''గొలుసులాగి ఎవరైనా డాక్టర్...'' అని మొదలు పెట్టిన రామకృష్ణ మాటల్ని మింగివేశాడు. తన కళ్ల ముందర జరిగిన సంఘటనని తనే నమ్మలేక పోతున్నాడు. బలవంతంగా మనిషిని బాదటం తనెప్పుడూ ఇంతకుముందు చూడలేదు. కపూర్ సీసాను మరింత గట్టిగా పట్టుకుని కమల్‌సింగ్‌వైపు చూశాడు. అతను కనుబొమలు ఎగరవేసి ఊరుకున్నాడు.

''ఏం గొలుసు ?'' అని కపూర్ నెమ్మదిగా అడిగాడు.

''అదే, ఎమర్జెన్సీ...'' అని రామకృష్ణ మళ్ళీ మాట్లాడలేక ఊరుకున్నాడు.



కపూర్ జేబులోనుంచి చిన్న రివాల్వర్ తీశాడు, ''ఏ గొలుసూలేదు,'' అన్నాడు కఠినంగా. రామకృష్ణ రివాల్వర్‌ను చూస్తూ ఊరుకున్నాడు. బొమ్మలలో, సినిమాలలో తప్ప తనింతవరకూ రివాల్వర్‌ను చూడలేదు. 'క్లిక్' అనే శబ్దంతో కపూర్ ఏదో మీటరు నొక్కాడు. 'సేఫ్టీకాచ్'ని వదిలించాడని రామకృష్ణ గ్రహించాడు.

''కమల్‌సింగ్ ! నువ్వైనాసరే'' అన్నాడు కపూర్.

''ఫూల్‌లాగ మాట్లాడకు. ఇప్పుడేం చేద్దాం ?''

''అదే ఆలోచిస్తున్నాను.''

కమల్‌సింగ్ కొంతసేపు ఆలోచించి, ''బయట పారేద్దాం'' అన్నాడు.

''పక్కవారెవరైనా చూస్తే...'' కపూర్‌కు అనుమానం వేసింది. కమల్‌సింగ్ తలుపు తెరిచి చూశాడు. ''మనం బండి చివరున్నాం. లైటు ఆర్పేసి ఆ పనిచేస్తే భయం ఉండదు'' అన్నాడు. కపూర్ ఒక క్షణం ఆలోచించి 'బాత్‌రూమ్' తలుపు తెరిచి, ''ఈ లైట్ చాలు మీరేమైనా కోతి పనులు చేయకుండా చూడటానికి''అన్నాడు. కమల్‌సింగ్ లైట్లు ఆర్పేసి రామకృష్ణతో శవం కాళ్ళు పట్టమన్నాడు.

''ఉండు ! జేబులన్నీ ఖాళీచెయ్యిముందు'' అని కపూర్ అనడంతో లైట్లు మళ్లీ వేసి బాల్టే జేబులలో ఉండేవన్నీ తీసివేశారు. మళ్లీ లైట్లు ఆర్పి తలుపు తీశారు. బండి వేగానికి గాలి పెద్ద హోరుతో లోపలి పేకముక్కలన్నిటినీ చిందరవందర చేసింది. బాల్టే శరీరాన్ని బయటకు తోసివేసి తలుపు మూశారు. మళ్లీ లైట్లు వేసిన తర్వాత రామకృష్ణ సీటుమీద కూలి పోయాడు. కడుపులో కొంచెం తిప్పడం మొదలు పెట్టింది.

# రైలు ప్రయాణం

''సీటుని శుభ్రం చెయాలి'' అని కమల్‌సింగ్ ఒక చిన్న గుడ్డతో రక్తపు మరకలను తుడిచి కిటికీలోంచి పారవేశాడు. కంపార్ట్‌మెంట్ లోని సామానులన్నిటినీ సర్దారు. కపూర్, కమల్‌సింగ్‌లు తమలో తాము ఏదో మాట్లాడుకోవడం రామకృష్ణ గమనించాడు. గాని ఏమిటో అర్థం కాలేదు. కపూర్ నవ్వుతూ, ఇంగ్లీషులో ''మళ్లీ పేకాడుదాం, వేరే పనేముంది ? ఇతన్నికూడా పంపించేస్తే మనమిద్దరమే ఏమాడుకుంటాం?'' అన్నాడు.

''మళ్ళీ ఆటా ?'' అని రామకృష్ణ అనగలిగాడు. కపూర్ అన్న మాటలు అతని తలలోకి సగం సగమే ఎక్కాయి.

''ఏం ! ఆడలేవా? ఇది కొంచెంపుచ్చుకో'' అని బాల్టేను కొట్టిన సీసాను అందిచ్చాడు. రామకృష్ణ, ''నేను తాగలేన''ని తడబడుతూ చెప్పాడు. కపూర్ విరగబడి నవ్వాడు. కమల్‌సింగ్ చిరునవ్వు నవ్వుతూ సీసాను తీసుకొని గ్లాసు లేకుండానే తాగి రామకృష్ణకు అందిచ్చాడు. ఇష్టం లేకపోయినా అందుకొని కొంచెం నోట్లో పోసుకుని మింగాడు. విస్కీ రుచి పోయేందుకు టీ ఫ్లాస్కులోనుంచి పోసుకుని త్రాగాడు.

కపూర్ కోటుమీద కొన్ని విస్కీ మరకలు రామకృష్ణకు కనుపించాయి. సీసా పైకి ఎత్తినప్పుడు పడి ఉంటాయనుకున్నాడు. కపూర్‌కి చెప్పాడు. అతడు పెట్టెలోనుంచి బట్టలుతీసి బాత్‌రూమ్ వైపుకు వెడుతూ ''పిచ్చిపనులేమీ చెయ్యక'' అని తలుపు మూసుకున్నాడు. వెంటనే కమల్‌సింగ్ సీటుకింద కపూర్ బట్టలు తీసిన పెట్టెపక్కన పెట్టెను తెరిచి కొన్ని నోట్ల కట్టలను బయటకులాగి గబగబ జేబులో పెట్టుకున్నాడు. రామకృష్ణవైపు తిరిగి చిరునవ్వుతో ''నువ్విప్పుడేమీ చూడలేదు'' అన్నాడు. రామకృష్ణ ఏమనాలో తెలియక తల అడ్డంగా ఆడించాడు. కపూర్ కూడా బయటకు వచ్చాడు.

''బాల్టే డబ్బెంతా...'' అని కమల్‌సింగ్ అడిగాడు.

''ముగ్గురం పంచుకుని ఆడ్దాం!'' అన్నాడు కపూర్.

''నాకక్కరలేదు. మీరిద్దరూ పంచుకోండి'' అని రామకృష్ణ అనుకోకుండా పైకి అనే తీశాడు. వారిద్దరూ అతనివైపు చూశారు.

''నీ ఇష్టం'' అని కపూర్ సమాధానమిచ్చి కమల్‌సింగ్‌తో తమ భాషలో ఏదో చెప్పి నవ్వాడు. కమల్‌సింగ్ చిరునవ్వు రామకృష్ణ కెందుకో భయం కలిగించింది.

మళ్ళీ ఆట మొదలుపెట్టారు. రామకృష్ణ రిస్టువాచీ వైపు చూసుకొన్నాడు. ఒకటి ఇరవై అయిదయింది. ఈమాటు కమల్‌సింగ్ గెలవడం మొదలెట్టాడు. కపూర్ నవ్వు చిరాకుగా మారింది. సీసా ఖాళీచేసి పారవేయడానికి తలుపు దగ్గరకి వెళ్లాడు. తిరిగివస్తూ, ''పై స్టేషన్ ఏమిటి ?'' అని అడిగాడు.

''గోధ్రా'' అని రామకృష్ణ సమాధానమిచ్చాడు. కపూర్ కూర్చోబోతూ తన పెట్టెల వైపు చూశాడు. అలాగే నుంచుని, కమల్‌సింగ్, నా పెట్టెలోంచి ఏం తీశావ్ ? అన్నాడు నెమ్మదిగా.

కమల్‌సింగ్ పేకముక్కలు పంచుతూండడంచేత తలవంచి ఉన్నాడు. మెల్లిగా పైకి చూసి ''ఏం పెట్టె ? ఏం మాట్లాడుతున్నావ్ ?'' అని అడిగాడు.

''పెట్టె ఇవతలకు జరిపి ఉంది – ఒకవైపు 'లాక్' వేయడం మర్చిపోయావ్.'' కపూర్ ఇంకా నెమ్మదిగా మాట్లాడుతున్నాడు గాని జేబులో నుంచి రివాల్వర్‌ను తీశాడు. ''రామకృష్ణ ! నువ్వు చూశావా ?''

రామకృష్ణకు నోటమాట రాలేదు. కపూర్ తన వైపు తిరగగానే కమల్‌సింగ్ అతని మీదకు ఉరికాడు. కాని కపూర్ కొంచం వెనక్కి జరిగి రివాల్వర్‌తో ఒకసారి కాల్చాడు. కమల్‌సింగ్ రెండు చేతులతో పొట్టను పట్టుకొని కిందపడి పోయాడు. రామకృష్ణ రాయిలాగ నుంచుని చూస్తున్నాడు. కపూర్ మళ్లీ రెండుసార్లు కమల్‌సింగ్‌ను కాల్చాడు. కంపార్ట్‌మెంట్ గుభుమందు వాసనతో నిండిపోయింది. కమల్‌సింగ్ శరీరం రైలు కుదుపుకి కొంచెం అదురుతూ ఉన్నది కాని ప్రాణంపోయి ఉంటుంది. రామకృష్ణ కల కంటున్నానేమో అనుకున్నాడు.

కపూర్ రివాల్వర్ తన వైపు గురి పెట్టి ఉండడం గమనించాడు. కాని మళ్లీ ఏమను కున్నాడో దించేసి, ''బయటకు తోసేద్దాంరా !



# బ్రూ: దక్షిణ భారతదేశపు నం.1 ఇన్‌స్టెంట్ కాఫీ

## (నిజమైన కాఫీ ప్రియులు అందుకు కారణం చెప్తారు)







### "అది ఎంతో మంచిది"

బ్రూవలె సాటిలేని రుచి, సువాసన మరి యే ఇతర ఇన్‌స్టెంట్ కాఫీకీ లేదు. మరి యే ఇతర ఇన్‌స్టెంట్ కాఫీ దీనిలాగా ఏ మాత్రమూ నాకు అనిపించదు.

### "అదిచిక్కనిది"

ఒక్క సారి త్రాగితే చాలు ఫిల్టర్ కాఫీ అంత చిక్కగా బ్రూ రుచి వుంటుందని మీకు తెలుస్తుంది.

### "సరసమైన ధర"

ధర కూడా ఎంతోన్యాయంగా వుంటుంది. ప్రతి కప్పు బ్రూ దరిదాపు ఫిల్టర్ కాఫీ అంత పొదుపు గానూ వుంటుంది. ఇక రుచి దగ్గరకు వస్తే ఆయన మరో ఇన్‌స్టెంట్ కాఫీ త్రాగరు.









## బ్రూ : రుచిలోనూ, సువాసనలోనూ నం. 1

OBM 1048 Te

ముందు వాడి జేబుల్లో ఏమైనా ఉంటే ఖాళీ చెయ్యి. పిచ్చివేషాలు వేశావంటే పందినికాల్చినట్లు కాల్చేస్తాను'' అన్నాడు ఇంగ్లీషులో. రామకృష్ణ కదలలేకపోయాడు. కపూర్ దగ్గరగావచ్చి చేతి వెనుకతో రామకృష్ణ మొహంమీద కొట్టాడు. మెల్లిగానే కొట్టినా రామకృష్ణ పెదవి కొంచెం చిట్లింది. ''నిన్నే అన్నాడు'' కపూర్ రివాల్వర్ పైకి ఎత్తుతూ.

రామకృష్ణ క్రిందికివంగి కమల్‌సింగ్ శవాన్ని త్రిప్పాడు. కళ్లు తెరుచుకొని ఉన్నాయి, నోట్లో నుంచి కొంచెం రక్తం కారుతూ ఉంది. ఒక గుండు పొట్టలోనుంచి, తక్కినవి రెండూ వీపులోనుంచి దూసుకుపోయినాయి. నేలమీద కూడా కొంచెం రక్తం కారి ఉన్నది. రామకృష్ణ కాళ్లు కొంచెం వణకసాగాయి.

''వాడి జేబులో గుడ్డతీసి తుడిచెయ్యి'' అని కపూర్ గొంతు వినిపించింది. వీలైనంత పొడిగా తుడిచివేశాడు. కపూర్ ఆజ్ఞాపించినట్లు శవం కాళ్లు పట్టుకొని తలుపు దగ్గరకు లాక్కునివెళ్ళాడు. కపూర్ తలుపుతీసి, ''లైట్లు ఆర్పేస్తున్నాను. గొడవలేకుండా పని కానియ్యి,'' హెచ్చరించాడు.

తలుపు మూసిన తర్వాత సామానంతా సర్దించాడు. కపూర్ కమల్‌సింగ్ సామానంతా బయట విసిరిపారవేశాడు. నేలమీద రక్తపు మరకలు ఎండిపోతూ ఉన్నాయి. వాటిని తడి గుడ్డతో తుడవమని కపూర్ చెప్పాడు. రామకృష్ణ కపూర్ ఎదురుగానే గుడ్డను నీళ్ళతో తడిపి తుడుస్తున్నాడు. కపూర్ కాళ్ళు మాత్రం కనిపిస్తున్నాయి అతనికి.

''ఈ గుడ్డనేం చెయ్యమంటావ్ ?'' అని తల పైకెత్తకుండానే అడిగాడు రామకృష్ణ.

# రైలు ప్రయాణం

''చూద్దాం ! అసలు నీ సంగతేమిటా అని ఆలోచిస్తున్నాను.''

''నన్ను కూడా కాల్చేస్తావా ?'' ఏదో కథలో పాత్రలాగ అడిగాడు ఈ ప్రశ్నను.

''ఎందుకూ ! బులెట్ల దండగ ?'' కపూర్ నవ్వుతూ సమాధానమిచ్చాడు. ''అంతా అయిన తర్వాత చూద్దాంలే ... ఈ రైలు స్పీడు ఏభైమైళ్ళుండదా ?'' అని ఆలోచిస్తూ ఉండిపోయాడు.

రామకృష్ణ అమాంతంగా లేచి తన తలతో కపూర్ పొట్టలో కొట్టాడు. అతను బాధగా అరిచి రివ్వాలర్‌ను వదిలివేశాడు. రామకృష్ణ లేచి నుంచుని చెయ్యి వెనక్కి లాగి అతని



మొహంపై గుద్దాడు. ఆ దెబ్బకి తన మోచెయ్యి అదిరిపోయింది. కపూర్ మూలుగుతూ వెనక్కి పడిపోయాడు. రామకృష్ణమళ్ళీ రెండు మూడు సార్లు మొహంమీదా, పొట్టలోను బలంగా పిడికిలితో మోదాడు. కపూర్ ముక్కులోనుంచి రక్తం కారడం రామకృష్ణ చూశాడు. మళ్ళీ మళ్ళీ కొట్టాడు. వేళ్ళ కణుపులు వాచిపోయి నొప్పిపెట్టడం మొదలుపెట్టింది. రైలువేగం కొంచెం మారి కుదుపు ఎక్కువైపోయింది. కపూర్ తలుపువైపున్న సీటుమీద పడిపోయాడు. రామకృష్ణ ఇంకా వొళ్ళు తెలియకుండా అతన్ని కొడుతున్నాడు. కపూర్ పెద్ద ప్రయత్నం చేసి నుంచుని రామకృష్ణను తిరిగి కొట్ట బోయాడు. ఆ సమయంలో తలుపు విసురుగా తెరుచుకుని అతని తలకి వెనుక గట్టిగా తగిలింది. ముందుకు పడిపోతూ ఉండగా రామకృష్ణ నుంచోబెట్టి మళ్ళీ కొట్టేందుకు చెయ్యి వెనక్కి తీశాడు. రైలు మళ్ళీ బాగా ఆడి కపూర్ వెనక్కి పడిపోయాడు, తలుపులోనుంచి, బయటికి. రామకృష్ణ అతన్ని పట్టుకోబోయాడు కాని వీలులేకపోయింది. బయట చీకటిగా ఉన్నది. రైలు ఎత్తుగా ఉన్న కట్టమీద వెళ్తోంది. రామకృష్ణ బయటికి వంగి రెండు వైపులా చూశాడు. పక్కన పెట్టెలలో లైట్లు వెలగడం లేదు. అంతేకాక రైలు వంపు తిరగడంలో అవతల వైపుకు వంగి ప్రయాణం చేస్తూ ఉన్నది. కపూర్ గట్టుమీద నుంచి దొర్లి కిందపడిపోయి ఉండాలి. తలుపుమూసి లోపలికివచ్చి కూర్చున్నాడు రామకృష్ణ. ఉద్రేకంలో కపూర్‌ను కొట్టాడు గాని ఇప్పుడు వళ్లంతా వణుకు పట్టింది. చేయి కొంచెం వాచి ఉన్నది. కొంతసేపటికి తర్వాత బాత్‌రూంలోకి వెళ్ళి చన్నీళ్లతో చేతులు మొహమూ కడుక్కుని వచ్చాడు. ఆ ముగ్గురిది తక్కిన వారి సామానూ బయటికి లాగాడు. ఒక్కొక్కటిగా బయటకు పారవేయడం మొదలు పెట్టాడు, లైట్లు ఆర్పిన తర్వాత. మళ్ళీ లైట్లు వేసి కపూర్ పెట్టె మాత్రం తెరిచి చూశాడు. చిల్లర సామానుకాక, కొన్ని నోట్ల కట్టలూ, పాత వార్తాపత్రికలలో నుంచి 'క్లిప్పింగ్సూ' కనుపించాయి. ఒక క్షణం ఆలోచించి ఆ క్లిప్పింగ్స్ మాత్రం ఉంచుకొని తక్కిన వాటిని పెట్టెలో పెట్టేసి బయటకు విసిరి వేశాడు. ఆ 'క్లిప్పింగ్స్'లోని వార్తలన్నీ దోపిడీలకూ, దొంగతనాలకూ సంబంధించినవి. అన్నీ వీరు ముగ్గురూ కలిసి చేసినవయి ఉంటాయని నిశ్చయించుకున్నాడు.

కొంచెం నిద్రరావడం మెదలు పెట్టింది. లైట్లు తీసివేసి పడుకున్నాడు. జరిగినవన్నీ తను బయట పెట్టడమా వద్దా అని ఆలోచించాడు. అనవసరంగా తను ఇబ్బందులలో చిక్కుకొనడం తప్ప వేరేమీ జరుగదని మాట్లాడకుండా ఊరు కొనడడానికే నిశ్చయించుకున్నాడు.

రత్‌లాం స్టేషన్‌లో దిగగానే శ్రీనివాసరావు కనుపించాడు. ''ఏమోయ్ ఒక్కడివే ప్రయాణం చేశావా ?'' అని అడిగాడు కంపార్ట్‌మెంట్‌లోకి చూస్తూ.

ఆంధ్ర పచిత్ర వారపత్రిక
1959 సెప్టెంబరు 16
సంచిక నుంచి




## ఆరోగ్య రహస్యం !

వెనిస్ నగరానికి చెందిన ఫ్రాన్సిస్కో నెకార్డి హాంగో అనే ఆయన 1587లో పుట్టి 117 ఏళ్ళు హాయిగా జీవించి 1704లో చనిపోయాడట. ఈయన తన జీవితకాలంలో అయిదుగురు భార్యలతో 49 మంది పిల్లలకు తండ్రి అయ్యాడట. చనిపోయేంత వరకూ కళ్ళకు జోడు లేకుండా చదివేవాడట. ఏనాడూ ఏ మందూ మింగి ఎరుగడట. రోజుకు ఎనిమిది మైళ్ళు చనిపోయేనాటివరకూ నడిచేవాడట. 112వ ఏట ఆయన తెల్లజుట్టు తిరిగి నల్లబడి, 113వ ఏట కనుబొమ్మల, కనురెప్పలూ నల్లబడ్డాయట తిరిగి. 116వ ఏట వో రెండు దంతాలు కూడా ఆయనకు మొలిచేయట. ఆయన ప్రతి రాత్రీ స్త్రీ సుఖంతోనే గడిపేవాడట. నేను తృప్తిపొందని రాత్రి, ఎనిమిది మైళ్ళు నడవని రోజూ నా జీవితంలోలేదు. అదే నా ఆరోగ్య రహస్యం అనే వాడటాయన.




## 150 మందిని హత్యచేసిన లూకాస్ !

టెక్సాస్‌కు చెందిన దక్షిణ మాంటెగ్‌లో 47 ఏళ్ల హెన్రీలీ లూకాస్ అనే వో వ్యక్తిని అరెస్టుచేసి జైల్లో పెట్టారట. 80 ఏళ్ల కేట్‌రిచ్ అనే అతన్ని హత్యచేసిన నేరంమోపి జైల్లో యీ లూకాస్‌ను కూర్చోపెడితే అతను వెన్నులో చలిపుట్టే వార్త బయట పెట్టాడట. అతను తన జీవిత కాలంలో నూరుమంది స్త్రీలను, యాభైమంది పురుషులనూ అతి లాఘవ చమత్కారాలతో హత్యచేశాడట. పదహారు రాష్ట్రాలకు చెందిన నూరుమంది ఆడవారినీ చంపి, పోలీసులను, నేరపరిశోధక శాఖవారినే నేను తికమక పరిచాను అన్నాడటా హెన్రీలీ లూకాస్ –

## సౌరశక్తితో నడిచే రైల్వేస్టేషన్ !

బంగారుపేటకు చెందిన బిసానత్తమ్ అనే రైల్వేస్టేషనులోని విద్యుత్తంతాకూడా సౌరశక్తి ద్వారా పనిచేయించగలిగారట. ఈ పరికరాలకు ఐదు లక్షలు ఖర్చయినదట. నవంబరు నెలాఖరుకు యీ పని నూరు శాతమూ పూర్తవుతుందట. ఏషియా ఖండంలోనే సౌరశక్తితో ఒక రైల్వే స్టేషను విద్యుచ్ఛక్తి పనిచేయడం యిది ప్రప్రథమట –

## మేకుల పడకపై ప్రపంచ రికార్డు!

ఆస్ట్రేలియా సిడ్నీకి చెందిన ''జనేఅజర్'' అనే వో ఫకీరు మేకుల పాన్పుమీద ఇరవై య్యయిదున్నర గంటలు పడుకుని ప్రపంచ రికార్డు స్థాపించాడట. తలకో తలపాగా, మొలకో ఆచ్ఛాదనా మాత్రమే వుంచుకుని ఆరంగుళాల పొడవున్న సరికొత్త మేకులు బిగించిన బల్లమీద అలానే వెల్లికిలా పడుకుని, ఆహారంగా అయిస్ క్రీము, పళ్ళూ తిన్నాడట ఆ 25½ గంటల కాలంలో.

## అధిగమించని 1915 రికార్డు !

ఆస్ట్రేలియాకు చెందిన మెల్‌బోర్న్‌లో 190 పౌనుల బరువున్న వో యువకుడు 150 పౌనుల బరువున్న మరో యువకుణ్ణి వీపుమీద ఎక్కించుకుని ఒక మైలు దూరాన్ని ఎనిమిది నిముషాల ముప్ఫయి సెకనులలో పరుగెత్తి 1915 ఏప్రియల్ 12వ తేదీన ప్రపంచ రికార్డు సృష్టించాడట. ఈ రికార్డు నింత వరకూ ఎవరూ అధిగమించలేదట.

## ఆస్తికోసం తండ్రి హత్య !

బెక్కలి తాలూకా కొమరల్తాడ గ్రామానికి చెందిన 17 ఏళ్ల మండల యర్రయ్య అనే అతని తండ్రి రెండో పెళ్లి చేసుకుని, ఆమెకు పుట్టిన పిల్లాడిమీదే ఎక్కువ మక్కువతో వుండేసరికి తనకిక ఆస్తి సొడ్డేనని భయపడి, తన తండ్రి 45 ఏళ్ల మండల లచ్చుమయ్యను తన ఆస్తిని తనకు పంచి యివ్వమన్నాడట. దానికా లచ్చుమయ్య యిచ్చ చూపకపోయేసరికి యర్రయ్య కోపం వచ్చి పారను తిరగేసి, తండ్రి తలమీద ఒకేఒక దెబ్బకొట్టాడట. దాంతో ఆ లచ్చుమయ్య చనిపోయాడట.

## పలకని పలుకుబడి !

కుంభకోణం వి. పి. ఆర్. జ్యూయలర్స్ అధిపతి వి. పి. రంగనాథన్ కొడుకు 28 ఏళ్ల సుకుమారన్ తన భార్య 22 ఏళ్ల మీనా మీద కిరసనాయిలు పోసి, నిప్పంటించి పోయినేడు ఆగస్టులో చంపేశాడట. ఈ చావుని ఆతని తండ్రి ఆత్మహత్యగా ప్రకటించి, తన పలుకు బడితో ఫైలు మూయించెద్దామని విశ్వప్రయత్నం చేసి విఫలుడయ్యాడట. చట్టం యీ సుకుమారనుకు మొన్న యావజ్జీవ శిక్ష విధించిందట. ఈ హత్యకు కారణం తన భార్య తన తండ్రితో అక్రమ సంబంధం కలిగివుండడమేనని అనధికారంగా అనుకుంటున్నా కారణం ఏమిటని ఎవరూ విచారించలేదట.




## వయవంచనతో హత్య

తమిళనాడుకు చెందిన ఇళంగినశాలై అనే గ్రామంలో 28ఏళ్ళ రాజమాణిక్యం తన మొదటి భార్య చిన్నపొణ్ణుమీద మోజుతీరి చిన్నకణ్ణు అనే అమ్మాయిని రెండో పెళ్ళి చేసుకుని, ఆమెతో కొన్నాళ్లు వుండి, ఆమె మీద మోజు తీరాక తిరిగి మొదటి భార్య చిన్నపొణ్ణు వద్దకు వచ్చేశాడట. చిన్నకణ్ణు కడుపుతో వుండడంవల్ల కాన్పుకు తన పుట్టింటికి వెళ్లిందట. మళ్లీ మొగుడుకు తన మీద మోజుపోయి తిరిగి రెండో పెళ్లాం వద్దకు పోతాడేమోనని చిన్నకణ్ణు మీద లేనిపోనివన్నీ చెప్పేదట. రాజమాణిక్యం చిన్నకణ్ణ యింటికివెళ్లి భార్యను తనతో వచ్చెయ్యమన్నాడట. ఇంకా బాలింతకదా అని ఆమె తలిదండ్రులు అంటే అయితే తన బట్టలూ, నగలూ, తీసుకుపోతుంది నాతో పంపండి అని చిన్నకణ్ణుని ఇంటికి తీసుకు వచ్చి, కత్తితో పొడిచి చంపేశాడట. ★



'తెల్ల గులాబీలు' కొత్తనటి మంజా, రాజేష్




## సత్యచిత్ర వారి చిత్రాలు

నిర్మాతలు సత్యనారాయణ, సూర్యనారాయణ తెలుగు, హిందీ భాషల్లో చిత్రాలు నిర్మించడానికి సన్నాహాలు చేస్తున్నారు. కృష్ణతో ఫిబ్రవరిలో సెట్స్‌కు వెళ్లే చిత్రానికి పర్వతనేని సాంబశివరావు దర్శకుడు. మార్చి మంచి షూటింగ్ జరిగే హిందీ చిత్రంలో అమితాబ్ బచన్, శ్రీదేవి నాయకా నాయికలు.

## కృష్ణ హీరోగా ఎమ్. ఎస్. రెడ్డి "ప్రళయం"

"కృష్ణ పక్కన జయసుధ, జయప్రద నాయికలు," అన్నారు ఎమ్. ఎస్. రెడ్డి. ఈయన నిర్మించే కౌముది పిక్చర్స్ "ప్రళయం" చిత్రం ఫిబ్రవరిలో సెట్స్‌కు వెళ్తుంది. ఎం. డి. సుందర్ కథ, పరుచూరి సోదరుల సంభాషణలు, సత్యం సంగీతం, ప్రసాద్ బాబు ఛాయతో ఎం. మల్లికార్జునరావు దర్శకుడు.

## కె. బాపయ్య దర్శకత్వంలో డి. వి. ఎస్. రాజు "ఇంటిగుట్టు"

"చిరంజీవి — నళిని ఒక జంట, చంద్రమోహన్—సుహాసిని మరో జంట... సెంటిమెంట్‌తోపాటు సున్నితమైన హాస్యం మేళవించిన చిత్రం," అన్నారు నర్మ ప్రొడక్షన్స్ అధినేత డాక్టర్ డి. వి. ఎస్. రాజు. ఈయన చిత్రం "ఇంటిగుట్టు" లో ఇంకా సత్యనారాయణ, ప్రభాకరరెడ్డి, రావు గోపాలరావు, గిరిబాబు, సూతన్‌ప్రసాద్, సారథి, ఆనందమోహన్, భీమరాజు, బాబూరావు, జయమాలిని, అత్తిలి లక్ష్మి, కాకినాడ శ్యామల, అన్నపూర్ణ, నవనటి లక్ష్మి నటిస్తున్నారు. పరుచూరి సోదరులు, వేటూరి, చక్రవర్తి, వెంకట్, భాస్కరరాజు, కోటగిరి వెంకటేశ్వరరావు, దాట్ల బలరామరాజు, దాట్ల శ్రీరంగరాజు తెర వెనుక కృషి చేస్తున్నారు. "నవంబర్‌లో షూటింగ్ పూర్తయిపోతుంది," అన్నారు డైరెక్టర్ కె. బాపయ్య.

కవిత, మోహన్‌బాబు 'మూగవాడి పగ'



'కోటీశ్వరుడు'
అక్కినేని, సుజాత

## "జడగంటలు"లో ఆధునికతత్వం — అమాయకత్వం

పట్నవాసం నాగరికత అంటే ఏమిటో తెలియని నూటికి నూరుపాళ్ళు పల్లెటూరి అమ్మాయి జానకి (విజయశాంతి)ని ప్రేమించి, పెళ్ళి చేసుకుని, పట్నం తీసుకొచ్చాడు, అమెరికా వెళ్ళబోతున్న రాంగోపాల్ (సురేష్). సిగ్గు మొగ్గలు వేసే ఆ ముగ్ధ మోహన లావణ్య రాశిని గదిలోకి తీసుకొచ్చి, "ఇదే మన బెడ్ రూమ్. ఇక్కడ నీదే రాజ్యం. నువ్వే ఎలిజబెత్ రాణివన్నమాట. ఎలా వుంది మన ఇల్లు ?" అన్నాడు.

"గొప్పగా వుంది. గొప్పవారిల్లు. ఈ ఇంటి కోడలు కావడంతో ఈ లోకంలో నాకంటే అదృష్టవంతురాలే లేదనిపిస్తోంది," అంటూ జానకి నలువైపులా చూసింది. "ఏమిటండీ ఈ గోడలో పెట్టె ?" విస్తుపోయింది.

రాంగోపాల్ నవ్వాడు. "ఇది గోడలోపెట్టె కాదు; ఏర్ కండిషనర్."

"అంటే ?"

"చల్లదనాన్నిచ్చే మిషన్."

"అమ్మో ! అంతా తెల్లోళ్ళ మాయ," అంటూ మరింత నివ్వెరపోయిన జానకి చెయ్యి పట్టుకుని మంచంమీదకు లాక్కున్నాడు రాంగోపాల్. "అమ్మో ! ఏమిటిలా ఊగుతోంది ?" అంది జానకి గాభరాతో.

"భయపడకు జానకీ ! ఇది స్ప్రింగ్ పరుపు. ఇవన్నీ తెలుసుకోకపోతే ఎలా ? ఇక్కడే కాపురం చెయ్యాలమ్మా జడగంటమ్మా ! ఏమిటలా చూస్తావ్ ? ఇలా రా !"

జానకి కంగారుగా చూస్తూండిపోయింది.

ఆధునికత్వానికి— అమాయకత్వానికి ప్రతిబింబాలైన ఆ భార్యాభర్తల పరిచయం ఏ విపరీతానికి దారితీస్తుందో అనిపించింది నవత ఆర్ట్స్‌వారి "జడగంటలు" చిత్రానికి పై సన్నివేశాన్ని చిత్రీకరిస్తున్నప్పుడు.

కె. ఎస్. రామిరెడ్డి దర్శకత్వంలో ఎన్. కృష్ణంరాజు నిర్మించే ఈ చిత్రం రెండవ షెడ్యూల్‌కు సగానికి పైగా పూర్తయింది. చివరి షెడ్యూల్ నవంబర్‌లో జరుగుతుందని నిర్మాణ సారథి ఎన్. అచ్యుతరామరాజు తెలిపారు.



విజయశాంతి, సురేష్
'జడగంటలు'



నరేష్, పూర్ణిమ 'కొత్త దంపతులు'

## సినిమా

### విశ్వలవ ఛాయాగ్రాహకుల చలన చిత్రం

మంజాలా క్రియేషన్స్ పతాకంలో సినిమా రంగంలో 'మోహన్ బ్రదర్స్‌గా' అందరి మన్ననలందుకున్న మోహన్‌జీ–జగన్ సోదరులు సమర్పించే తొలి చిత్రానికి అక్టోబర్ 10 న పాటల రికార్డింగ్‌తో ప్రారంభోత్సవం జరిగింది. "అతి సర్వత్ర వర్జయేత్"– అనే నగ్నసత్యాన్ని దృష్టిలో ఉంచుకొని కథ, స్క్రీన్‌ప్లే తయారుచేశాను," అన్నారు డైరెక్టర్ కోడి రామకృష్ణ. భానుచందర్, సుహాసిని, గుమ్మడి, నూతన్ ప్రసాద్, పి. ఎల్. నారాయణ, రాళ్ళపల్లి ముఖ్య భూమికలు పోషిస్తారు. ఎం. వి. ఎల్. హరనాథరావు సంభాషణలు, చంద్రశేఖర్ సంగీతం, కన్నప్ప ఛాయ, భాస్కరరాజా శిల్పం, బాలు కూర్పు, టి.వి. సాంబశివరావు నిర్వహణలో గోగినేని ప్రసాద్ రూపొందిస్తారీ చిత్రాన్ని. అక్టోబర్ 21 నుంచి నవంబర్ 18 వరకు ఒకే షెడ్యూల్లో చిత్రీకరణ ముగుస్తుందని నిర్మాతలు ద్వారక్‌నాథ్ బాబు, ఎస్. నాగేశ్వరరావు తెలిపారు.

## యువతరంగంలో మరో నటుడు

# అమర్ మోహన్



ఇంటర్వ్యూ: 'కల్యాణి'

ఈ మధ్య కాలంలో నూతన నటులకు, ప్రత్యేకించి యువతరంగానికి సినీరంగంలో ప్రాముఖ్యం బాగా లభిస్తోంది. పెద్ద హీరోల చిత్రాలతోపాటు కొత్త హీరోల చిత్రాలు కూడా ఈ మధ్య బాగానే వస్తున్నాయి.

యువతరంగంలో నేడు వస్తూన్న సాయిచంద్, శివకృష్ణ, రాజేంద్రప్రసాద్, రవివర్మ ప్రేక్షకుల్ని బాగా ఆకట్టుకుంటున్నారు.

రచయితగా, కార్టూనిస్టుగా, ఫ్రీలాన్స్ జర్నలిస్టుగా ప్రవృత్తి పరంగా పైకొస్తున్న యువకుడు అమర్ మోహన్ చిత్రంగా చిత్ర రంగంలోకి ప్రవేశించి సుచిత్రా ఇంటర్నేషనల్ "రంగుల కల"లో శ్రీ బి. నరసింగరావు దర్శకత్వంలో ఓ పాత్రధరించాడు.

ఆంధ్రా యూనివర్సిటీ నుంచి ఎమ్.కామ్. డిగ్రీ పొందిన ఈ యువకుడు దాదాపు అన్ని తెలుగు దిన, వార పత్రికలలో, తమిళం, కన్నడ, మళయాళ, హిందీ, ఇంగ్లీషు పత్రికలలో చాలా కాలంగా కార్టూన్స్ వేస్తున్నాడు.

శ్రీదేవిప్రియ ప్రోత్సాహంతో, శ్రీ బి. నరసింగరావుగారిచ్చిన అవకాశాన్ని 'రంగులకల'లో చక్కగా వినియోగించుకున్నట్టు సినీ విమర్శకుల ప్రశంసలు.

1974లో అమరావతిలో ఇంటర్మీడియట్ చదువుతున్నప్పుడు తొలిసారిగా "జరుగుతున్న చరిత్ర" అనే నాటకంలో స్త్రీ పాత్ర ధరించి ప్రేక్షకుల ప్రశంశలు అందుకున్నాడు. ఆనాటి నుండి సాహిత్య సేవలో ఉన్నా అప్పుడప్పుడు నటనమీద ఉన్న అభిరుచితో దాదాపు 50 నాటకాలలో నటించాడు.

కంచికచర్ల తాలూకా మున్నలూరులో జన్మించిన అమర్ మోహన్ ప్రస్తుతం హైద్రాబాద్ ఓ ప్రభుత్వ రంగ సంస్థలో ఉద్యోగం చేస్తూన్నాడు.

త్వరలో విముక్తి కోసం దర్శకుడు శ్రీ ఉదయ్‌కుమార్ దర్శకత్వంలో రానున్న రెండవ చిత్రంలో నటిస్తున్నాడు.

మరో చిత్రంలో నటించే అవకాశాలు వచ్చాయన్నాడు.

ఎలాంటి పాత్రలు ధరిస్తారు అని అడగ్గా— నటునికి ఫలానా పాత్రనేముంది ? ఏదైనా సరే, గుర్తింపు ఉన్న పాత్రలో నటించడానికి ఇష్టమే నన్నాడు.

సూర్యదేవర రామమోహనరావు అనేది సొంత పేరయినా రచయితగా, కార్టూనిస్ట్‌గా 'అమర మోహన్' అనే పేరుమీదే పాపులర్ కావటం జరిగిందట. అందుకని సినిమాలలో కూడా అదే పేరుని పెట్టుకోవటం జరిగిందన్నాడు.

స్టార్ మేకర్ దాసరిగారు, జంధ్యాలగార్ల చిత్రాలలో నటించే అదృష్టం కోసం వేచి చూస్తున్నానన్నాడు.

తనకు తొలి సినిమా అవకాశం కల్పించిన శ్రీ బి. నరసింగరావుగార్కి, శ్రీ దేవిప్రియ గార్కి కృతజ్ఞతలు తెలుపుకుంటున్నాడు.

ఈ యువ నటుడు త్వరలోనే పైకి వస్తాడని ఆశిద్దాం. ★

## భీమవరపు బుచ్చిరెడ్డి చిత్రాలు

కె. ఎస్. రెడ్డి స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో బుచ్చిరెడ్డి సమర్పించే కౌసల్య పిక్చర్స్ "నాగభైరవ" చిత్రానికి అక్టోబర్ 11 న పాటల రికార్డింగ్‌తో ప్రారంభోత్సవం జరిగింది. పేరాల రచన, సత్యం సంగీతం, రంగా ఛాయ, భాస్కరరాజు శిల్పం, బి. అంజిరెడ్డి నిర్వహణతో శ్రీమతి కౌలస్య బుచ్చిరెడ్డి నిర్మించే ఈ చిత్రం షూటింగ్ అక్టోబర్ 25 న ప్రారంభమవుతుంది.

ఎ. ఎన్. ఆర్‌తో భీమవరపు బుచ్చిరెడ్డి నిర్మించే జ్యోతి ఆర్ట్స్ క్రియేషన్స్ 4వ చిత్రం షూటింగ్ వచ్చే ఫిబ్రవరి నుంచి జరుగుతుంది— చక్రవర్తి సంగీతం, సెల్వరాజ్ ఛాయతో సింగీతం శ్రీనివాసరావు దర్శకుడు.

'విముక్తి కోసం' వర్కింగ్ స్టిల్. సాయిచంద్‌కి సూచనలిస్తున్న దర్శకుడు ఉదయ్‌కుమార్



# మీ జీవితంలో మీకు ఇది అవసరమ



రమేష్ అప్పరెంటీస్‌గా చేరి
తన జీవితాన్ని ప్రారంభించాడు.

అయితే, అతడు కష్టపడి పనిచేయుట వలన, మరి
చేసుకొనుటచే ఫిట్టర్ అయ్యాడ

**BSA Deluxe**

# య్యేటంతటి ఉన్నత స్థితికి వచ్చారు



యు పనికి అంకితము
స...

ఇప్పుడో! అతని అత్యుత్తమైన
నైపుణ్యత వల్ల ఫోర్‌మెన్‌గా
ప్రమోట్ అయ్యాడు.



రమేష్. తన జీవితంలో ఎంతో కష్టపడి పైకి వచ్చాడు. అతను ఒక ప్రత్యేకమైనది పొందటానికి తగినవాడు...బిఎస్ఎ. డీలక్స్. ఇండియా దేశంలోని రోడ్ల స్థితి, దృఢత్వమునను సరించి తయారుచేయబడిన అత్యుత్తమమైన బైసికల్.
అంతేకాదు, మరికొన్ని విశేష లక్షణాలు :– ● బ్రూక్స్ సేడిల్ మరియు లెదర్ క్రోమియమ్ ప్లేటింగ్ చేయబడిన స్పోక్స్. ● తినివేయని పెయింట్ మెరిసే ఆకుపచ్చరంగు లేక అద్దపు నునుపుగల నలుపు రంగులో లభ్యం.
● టిఐ హాల్‌మార్క్ యొక్క నాణ్యతపై గ్యారంటీ.
● ఒక సంవత్సరం గ్యారంటీ సరిక్రొత్త బిఎస్ఎ డీలక్స్. ఇండియాలో ఉత్తమమైన బైసికల్.
ఇండియాలో ప్రఖ్యాతిగన్న బైసికల్ తయారుచేయువారగు టిఐ వారిచే తయారు.

# క్రొత్త బిఎస్ఎ డీలక్స్

Rediffusion/TI/1401TL



'శుభముహూర్తం' పూర్ణిమ, చంద్రమోహన్

## సినిమా

### "మంచి మనిషి"లో ఎవరెవరో తెలియని స్థితిలో తండ్రీకొడుకులు

భద్రం గ్యారేజ్ దగ్గర పెద్ద కారొచ్చి ఆగింది. భద్రం హడావిడిగా పరుగెత్తుకుంటూ వచ్చి కార్లోంచి దిగిన ధర్మారావును ఆహ్వానించాడు. 'అయ్యా... అయ్యా... ఎన్నాళ్లకెన్నాళ్లకి ... ? ఈ మధ్య బొత్తిగా రావడం మానేశారు. ఎప్పుడో ఏడాది అయింది. మీ కారు రిపేరుతోనే మా రెండోవాడి మెడలో గొలుసు చేయించింది' అంటూ ఆహ్వానించాడు. 'ఆ కారు మళ్లీ రోడ్డు ముఖం చూడలా ... అమ్మేశాను' అన్నాడు ధర్మారావు.

'మళ్లీ ఈ కారు కొన్నారు కదండీ ..., మీలాంటి పెద్దవాళ్ల పెద్దకార్లు వస్తే కదండీ మా బండి రన్నింగ్‌లో వుంటుంది' అన్నాడు భద్రం.

'బిల్లులోనే కాదు ... మాటల్లో కూడా నువ్వు సుత్తి బాగా కొడుతున్నావయ్యా ... ' అన్నాడు ధర్మారావు.

'అబ్బెబ్బే ... యిప్పుడు సుత్తీ గిత్తీ లేదండీ ... వీలుంటే పంపు కొట్టడమే ... యింతకీ మీ కారుకి రిపేరేమిటి ... ??'

'ఏమో...పది గజాలకొకసారి ఆగిపోతుంది.'

'ఇంత డబ్బుపోసి కొని ... పది గజాల కోసారి ఆగిపోవడమా ... ?? నా దగ్గర చాకు లాంటి మెకానిక్ వున్నాడు ... వాడి చెయ్యి పడిందంటే ...'

'గజానికి పదిసార్లు ఆగిపోతుందా ... ??'

'భలేవారే ... కుర్రాణ్ణి చూసి చెప్పండి... ప్రభా ... ప్రభా ...' అంటూ పిలిచాడు భద్రం.

'ఏమిటి బాబాయ్ ... ??' అంటూ వచ్చిన ప్రభుకి ఆయన్ని పరిచయం చేస్తూ 'ధర్మారావు గారని ... పెద్దమనిషి, పెద్దమనసు, పెద్ద బంగ్లా, పెద్ద ఆస్తి, నమస్కారం చెయ్ ...' అంటూండగా ప్రభు ధర్మారావుగారి వంక, ధర్మారావు ప్రభువంక రెప్పవాల్చకుండా చూసుకున్నారు. 'అంత పెద్ద వ్యక్తికి నమస్కారం చెయ్యకూడదు' అంటూ పాదాభివందనం చేశాడు. ధర్మారావు హృదయంలో కూడా ఏవో మధురమైన సంకేతాలు వీణా గానంలా ధ్వనించాయి. అతన్ని లేవదీస్తూ 'లే బాబూ ... లే ... ఎవరబ్బాయివి నాయనా ... ??' అన్నాడు.

'తండ్రి ప్రేమకు నోచుకోని అభాగ్యుణ్ణి' అని ప్రభు అంటూండగా ధర్మారావు హృదయం ఎందుకో బాధతో మూలిగింది. వాళ్ళిద్దరూ తండ్రీ కొడుకులేనని చెప్పి నమ్మించగల అద్భుత శక్తి ఏది కూడా ఆ క్షణంలో అక్కడలేదు.

కరుణరసం పొంగి ప్రవహించే ఈ దృశ్యం విడుదలకు తుదిమెరుగులు దిద్దుకుంటున్న అభినయ మూవీస్‌వారి "మంచి మనిషి"లోది.

రమణమూర్తి, వీరభద్రరావు, రాజేష్ నటించారు. వీరభద్రరావు ఈ చిత్రంలో ఒక కొత్తరకం హాస్యాన్ని అందిస్తున్నారు. ప్రేక్షక హృదయాలను ఆకట్టుకునే మంచి మనిషి చిత్రానికి స్క్రీన్‌ప్లే దర్శకత్వం యస్. రవీంద్రరెడ్డి, నిర్మాతలు జె. అక్కిరెడ్డి, జి. తిరుపతిరావు. లక్ష్మీ ఫిలింస్ ద్వారా విడుదల.



'మంచి మనిషి'లో రాజేష్, రమణమూర్తి, వీరభద్రరావు



'సింహపురి సింహం' చిరంజీవి, మారుతీరావు

సిల్క్ స్మిత 'పులిదెబ్బ'



"ఆవుడ్డోరు షూటింగ్ వద్దయ్యా అంటే ఎవరన్నా విన్నారా ?"

## సినిమా

### "వీరభద్రుడు" గా మాదాల రంగారావు

"మాదాల రంగారావుది వెరైటీ పాత్ర. కార్తీక్, విజయశాంతి, నూతన్‌ప్రసాద్ ఇతర ముఖ్య పాత్రధారులు," అన్నారు జయకృష్ణ. ఈయన నిర్మాణ సారథ్యంలో ముద్దుకృష్ణ సినిమా "వీరభద్రుడు" చిత్రం షూటింగ్ అక్టోబర్ 1న మొదలైంది. ముళ్ళపూడి వెంకటరమణ రచయిత. ఇళయరాజా సంగీతం, కోటేశ్వరరావు ఛాయ, సుబ్బారావు కూర్పుతో పినిసెట్టి రవిరాజ్ దర్శకుడు.

### కోదండరామిరెడ్డి దర్శకత్వంలో "గూండా" గా చిరంజీవి

"చిరంజీవి సరసన తొలిసారిగా రాధ నాయికగా నటిస్తోంది" అన్నారు మిద్దె రామారావు. ఈయన నిర్మించే శ్రీ రాజ్యలక్ష్మి ఆర్ట్ పిక్చర్స్ "గూండా" చిత్రం షూటింగ్ సెప్టెంబర్ 18న మొదలైంది. సత్యనారాయణ, రావు గోపాలరావు, అల్లు రామలింగయ్య, వేలు, వీరభద్రరావు, అన్నపూర్ణ, చక్రపాణి, పూర్ణిమ తక్కిన ముఖ్య భూమికలు ధరిస్తున్నారు. గిరిజశ్రీ భగవాన్ కథకు సత్యానంద్ సంభాషణల రచయిత. చక్రవర్తి స్వరకల్పనలో వేటూరి గీతాలురాశారు. కె. ఎల్. ఎన్. శాస్త్రి నిర్మాణత, వెంకట్ ఛాయ, సలీం నృత్యాలు, శరత్ సహకార దర్శకత్వం, ఎస్. వెంకటేశ్వరరావు నిర్వహణలో కోదండరామిరెడ్డి దర్శకుడు. అక్టోబర్ 21 నుండి నవంబర్ 10 వరకు జరిగే రెండవ షెడ్యూల్‌తో షూటింగ్ పూర్తవుతుంది. ★

తప్పక చూడండి!

గంగాధర్



ఈతరం పిక్చర్స్



# నేటి భారతం

కథ-స్క్రీన్‌ప్లే-దర్శకత్వం : కృష్ణ

నిర్మాత : పోకూరి వెంకటేశ్వరరావు

SREE PUBS

సంగీతం : చక్రవర్తి

ఫోటోగ్రఫీ : ఆర్ రామారావు

కూర్పు : చౌదుల సుబ్బారావు



సీరియల్

# మాఘ ముత్యాలు

## యలమంచిలి ఝాన్సీలక్ష్మి

సీత మనస్సు ఆ రోజంతా ఆలోచించుతూనే వుంది

"రేఖ మనస్సు యింత లోతుగా ఆలోచిస్తుందా? నా కోసం... తిరిగిందా అన్ని రోజులూ! ఏదో పల్లెటూరు వెళ్ళానన్నది యిందుకా? కానీ... అతడు... ఎలా ఒప్పుకున్నాడూ? నాలోని అందం చూసి కాదుగదా! నా మనస్సు యీ ఒంటరితనాన్ని భరించలేక పోతోంది! అన్నయ్యకి బరువై పోతానేమో! కానీ... ఆ మనిషి నాకు ఏ మధురానుభూతినీ మిగల్చలేదు! లేకపోయినా నా మనస్సుని ఎందుకో చెప్పరానంత విషాదం చుట్టేస్తోంది! ఆడదాని "జీవితంలో చాలా సమస్యలున్నాయి" ఆ రాత్రి సీతకి సరిగ్గా నిదురేలేదు.

మరునాటి వుదయం విజయని పంపించింది సారధిని చూసిరమ్మని.

"నేను తర్వాత వెళ్తాను! ముందు నువ్వెళ్ళిరా వది ' !" అన్నది.

విజయ మనస్సుని ఆ పిలుపు మంత్రించి వేస్తోంది. ఒకవిధమైన ధైర్యాన్నీ, విశ్వాసాన్ని నింపుతోంది.

"ఈ మాట .ఆ ప్రవరుడికి...చెప్పాలి!" అనుకుంది నవ్వుతూ.

సారధి విజయని చూడగానే నవ్వాడు — అంతులేనంత విరక్తి లేచిపడింది నవ్వులో.

(గత సంచిక తరువాయి)

"రేఖని... ఎన్నెన్ని మాటలతో హింసించారో విన్నావా విజయా?"

అతనికి రేఖపైన దిగులుగా వుంది!

"మీ పుణ్యమా అని నేమా అన్ని మాటలు పడ్డానులెండి!" కావాలనే ఆమె సంభాషణని తన వైపుకి త్రిప్పుకుంది.

"నేనేం చేశాను?" అతడు తెల్లబోయాడు.

"మాయింటిచుట్టూ మీరన్నిసార్లు ప్రదక్షిణలు చేశారెందుకో?"

"నిజమే! అదో నిషా ఆవహించిందపుడు! ఇప్పుడు దిగిపోయిందిలే! రేఖ కోసం ఏమీ చేయలేని యీ మూర్ఖుణ్ణి చూసి అమ్మ స్వర్గంలో నవ్వుకుంటూ వుండాలిప్పటికే!"

"మీకెపుడూ మీ వాళ్ళ గురించే దిగులు! తాతయ్యకి జబ్బుచేసింది మొన్న! మిమ్మల్ని చూడాలని తపించిపోయాడు! మా బంధువులు ఆస్తికోసం కోర్టులు దాకా వెళ్ళే స్థితికి వచ్చారు! అప్పుడు దీన్ని చూసి ఆగిపోయారు!" విజయ మెళ్ళోవున్న మంగళసూత్రాన్నితీసి చూపించింది.

సారధి రెండు మూడు నిముషాల వరకు నోరు మెదపలేకపోయాడు. అతనికదంతా కలగా వుంది. గుండెల్లో పెద్ద తుఫాను చెలరేగినంత హోరుగావుంది. సర్వస్వమూ పొగొట్టుకున్నంతగా వణికిపోయిందతని మనస్సు! ఎప్పటికో నోరు విప్పాడు—

"ఎవరు విజయా? ఆ అదృష్టవంతుడు?"

"మాటికి నూరుపాళ్ళు మీలాగే వుంటాడు! కాని ఒట్టి బుద్ధావతారం!" విజయ పెదవులపైన చిలిపినవ్వుల విన్యాసాలు.

"ఏ వూరు? ఏం చేస్తున్నాడిపుడు?"

"తాతయ్యకి బాగా తెలిసిన వారేలెండి! హైద్రాబాదులోనే వుద్యోగం చేస్తున్నారు!"

"మంచి వుద్యోగంలోనే వున్నాడన్నమాట!" అతడు గొణుక్కున్నాడు లోలోన.

"పేరడగరేమిటి?"

"పేరా? ఆ! అవును! ఏం పేరు?" నిరుత్సాహంతో అతని గొంతు మరింత ముడుచుకుపోయింది.

"సారధి!" ఆమె కళ్ళనిండుగా ఆనందంతోపాటు చిలిపితనం.

"అలాగ! మంచిపేరు!" అతనికి ఆమె చిలిపితనం అర్థంగాలేదింకా.

"పేరులో ఏముందిలెండి! ఆయన... ... గారికి... ... మనిద్దరిపైన అనుమానంగా వుంది! అందుకే... నన్ను అనరాని మాటలన్నారు!"

"ఏమన్నాడు?" నిరాసక్తంగా ప్రశ్నించాడు.

"నేను... మీ దాన్నట! నా మనస్సంతా మీదేనట! మీరు మా యింట్లో అన్నాళ్ళున్నది నాకోసమేనట!"

అతడు మూఢుడిలా చూడసాగాడు.

"పాపం! ఆయనగారి చెల్లెళ్ళిద్దరూ మహా మంచివాళ్ళు! నన్ను 'వదినా! వదినా!' అని ఆప్యాయంగా పిలుస్తారు! వాళ్ళని చూసే ఆ బుద్ధావతారాన్ని భరించుతున్నాను! ఎవరని అడగరేమిటి?"

"ఎవరూ?"

"వాళ్ళు...సీతా, రేఖలని..."

"విజయా!..."

"నిజం! వాళ్ళే నా ఆడపడుచులు!"

అప్పటికి అర్థమైందతనికి ఆమె చిలిపి నాటకం. ఆమె చేతుల్ని అందుకోబోయినవాడే ఆగిపోయాడు. కళ్ళల్లోకి కాంతి వచ్చింది. కానీ క్షణంలో కరిగిపోయింది!

"మాట్లాడరేమిటి?"

"ఎందుకు విజయా నాకోసం యిన్ని కలలు?! రేఖకీ, నాకూ సుఖపడే యోగం లేదు!"

"ఆ సంగతి నాకొదిలి వేయండి! మా వూళ్ళోకిక అడుగపెట్టలేను మీరు లేకుండా! నన్ను మీ మనిషిగా లెఖ్ఖవేశారెప్పుడో! కాదనడానికి వీల్లేకుండా రాఘవులు 'మా అమ్మాయి గోరికి సారధిగారితో ఎప్పుడో పెళ్ళయిపోయింది' అని చాటింపు వేశాడు! అక్కడితో మా పెదనాన్నగారబ్బాయి— ఆటలు కట్టుపడ్డాయి! దూరపు చుట్టరికం పట్టుకునివచ్చి 'మమ్మల్ని

**జరిగినకథ — 14:** సారధి, విజయ ఒకరిపై ఒకరికి గల ప్రేమను వ్యక్తం చేసుకుంటారు. సారధి హైదరాబాదుకు రాగానే శశిరేఖ తను శ్రీనివాసును పెళ్లి చేసుకోబోతున్నట్లు చెపుతుంది. అది విని బాధపడతాడు సారధి. శ్రీనివాస్ ప్రవర్తనకు అసహ్యపడి అతడిని వెళ్లిపొమ్మని శాసిస్తుంది శశిరేఖ. ఆషా, సలీమ్‌ల పెళ్లి నిశ్చయమవుతుంది. రేఖ కోసం వచ్చిన శ్రీనివాస్ సీతను చూస్తాడు. రేఖ మాటలకు తికమకపడతాడు శ్రీనివాస్. సీతని పెళ్లి చేసికోమని శ్రీనివాస్‌ను కోరుతుంది రేఖ. తను రేఖకోసమే పుట్టానంటాడు శ్రీనివాస్ ఆషా ఆత్మహత్యకు కారణం సారధేనని ఆమె మరణ వాగ్మూలం ద్వారా తెలుసుకొన్న పోలీసులు అతన్ని అరెస్టు చేస్తారు. సారధిని రక్షించుకోవడానికి రేఖ, సీత, విజయ, సలీమ్ తమ తమ ప్రయత్నాలు సాగిస్తుంటారు. వాదోపవాదాలు జరిగిన తర్వాత సారధి కేసు మరునాటికి వాయిదా పడుతుంది. శ్రీనివాస్‌ని రివాల్వర్‌తో కాల్చి చంపిన రేఖని పోలీసులు అరెస్టు చేస్తారు. రేఖ కేసుకూడా కోర్టులో వాదోపవాదాలు జరిగినమీదట వారంరోజులు వాయిదా పడుతుంది

పిచ్చివాళ్లని' జేసి ఆస్తికి వారసుణ్ణి నేనే నన్నాడు! అప్పుడు నా పెట్టెలోవున్న మీ ఫోటో నన్ను రక్షించింది! రాజ్యం క్షణాల్లో మంగళసూత్రం సృష్టించి నన్ను... మీతో ... ముడివేసింది!'' విజయ చెక్కిళ్లు రాగరంజితాలయ్యాయి చెబుతూంటే.

''కానీ నీకు సుఖం వుండదు విజయా యీ నాటకం వలన!''

''మీ బాధ నాకు తెలుసు! మీ విజయ మరో నాటకం ఆడదిక!''

సారథి కళ్ళల్లో ఆశ మెరిసింది.

''కానీ సలీమ్‌నీ, సీతనీ, రేఖనీ ఎవరు ఓదారుస్తారు విజయా?''

''సీతని కూడా రేఖ ఒప్పించి వేసింది. విశ్వం అని ఒకతను వున్నాట్ట! సీతని చేసుకుంటానని మాట యిచ్చాట్ట! రేపు వెళ్ళి నేనూ సలీమ్ మాట్లాడుతాం!''

సారథి ముఖాన నిజమైన నవ్వు మెరసిందప్పటికి–

''సీత సుఖపడితే చాలు విజయా!''

''మీరిలా నిరుత్సాహంగా వుంటే నేనేమీ చేయలేనని గుర్తుంచుకోండి!''

''నేను... నాలో ప్రాణం వున్నంతవరకు... నీవాణ్ణే విజయా!''

''బ్రతికించారు! ఇక నన్ను వెళ్ళనివ్వండి! చాలా పనులున్నాయి!''

''మళ్ళీ రావడానికి వీలుంటుందా విజయా?''

''ఎందుకో?''

''నిన్ను చూస్తోంటే నాకు ధైర్యంగా వుంది విజయా! ఎన్నెన్నో భయాలు! నన్ను నన్నుగా నిలవనీయడంలేదు!''

''వస్తానులెండి! ప్రతి రోజూ వెళ్ళమని రేఖ ఆజ్ఞాపించింది! సీత నన్ను వేధించుకు తింటోంది– మీ దగ్గరికి వెళ్ళలేదని నిన్నటి నుంచి!'' విజయ అతని గుండెల్లోని అనురాగాన్ని మేల్కొలిపి వెళ్ళింది.

సలీమ్ ప్రతిరోజూ వచ్చి కేసు వివరాలు సీతకీ, విజయకీ చెప్పి వెళ్తున్నాడు. సీతను కోరుకున్న విశ్వం కూడా వచ్చాడా రోజున.

విజయే పిలిచింది కావాలని. సీతకి కాఫీ యిచ్చి పంపించింది – సలీమ్ వచ్చాడు చూడమని చెప్పి. కానీ విశ్వాన్ని చూడగానే సీత సిగ్గుతో తలెత్తలేకపోయింది.'

''రండి! కూర్చోండి!'' విశ్వమే లేచి కుర్చీ ఆమె వైపుకి జరిపాడు.

''నేను బ్యాంకులో ఆఫీసరుగా పనిజేస్తున్నాను. నాకు మీరుతప్ప కావలసిన బంధువులెవరూ లేరు. మనక్కావలసినవన్నీ సమకూర్చుకోగలిగాను. మొన్ననే కారు కొన్నాను. దేవాలయం వుంది చూశారా? దాని ప్రక్కనున్న డాబాయే మన యిల్లు! రేపోసారి వచ్చి చూడండి! మీకు నచ్చకపోతే అమ్మేసి మరోటి కొందాం!''

అతడు అక్షరంకూడా దాచకుండా చెప్పేస్తూంటే సీతకి చచ్చేంత సిగ్గుగా వుంది. అన్నింటికీ 'మన' అన్నమాట అతని గొంతు నుంచి అతిసహజంగా వస్తోంటే వినసొంపుగా వుందామెకు.

''మీకు... నేనంటే భయమా?''

''అబ్బే!... అదేమీలేదు!'' సీత కంగారుపడిపోతూ తల ఎత్తి చూసింది. వెంటనే కళ్ళు వాల్చుకుంది సిగ్గుని భరించలేక.

''మరి మాట్లాడరేం?''

''ఏం మాట్లాడమంటారు?'' అన్నట్లు చూసింది.

''మీరు కళ్ళతో మాట్లాడతారనుకుంటాను!''

మళ్ళీ తడబడిపోయిందామె –

''రేపు... గుడికి వస్తారా? మీకోసం చూస్తుంటాను!''

''రేపా!... రేఖ కేసు విచారణ గదా! ఎలా రాను?''

''మనం గుడికి వెళ్ళి కోర్టుకు వెళ్దాం! మీ అన్నయ్యతో చెప్పానులెండి! ఈ విశ్వం నీవాడు సీతా! ఇంద! సాక్ష్యంగా నా వ్రేలి వుంగరం నీ వ్రేలికి పెడుతున్నాను! 'వి' అంటే ఏమిటో తెలుసా?'' అనురాగంతో నిండిన అతని స్వరం ఆమెనిట్టే మంత్రించివేసింది. మనస్సు తీయని వూహలతో పులకించిపోతూంటే కళ్ళెత్తి చూసి నవ్వింది సమ్మోహనంగా.

''నీ కోసం తపస్సు జేశానిన్నాళ్ళూ!'' ఆమె చేతిని మృదువుగా నొక్కుతూ అన్నాడతడు.

''నాకు... చదువు లేదంతగా.. పల్లె



టూళ్ళో పుట్టానేమో ఫేషన్లేమీ రావు! మీకు.. తెలియదేమో ! శ్రీనివాస్ గురించి... నేను..."

"నాకంతా తెలుసు సీతా! నాక్కావలసింది నువ్వు ! అవన్నీ నా కనవసరం !" అతడామె చేతి వ్రేళ్ళతో ఆడుకుంటూ చెప్పాడు. మృదువుగా చేతిని తీసుకుంది.

"ఇవిగో ! ఈ తాళాల్ని మోసే భారం నీదే యిక !" అతడు బీరువా తాళాల్ని ఆమె చేతిలో వుంచాడు.

"నాకెందుకూ ?"

"మరింకెవరికివ్వను ? నీ వస్తువుల్ని నీవే భద్రపరుచుకోవాలిగదా ! ఆ ! ఈ కేసు తేలిన తరువాత మద్రాసు వెళ్ళాలి సీతా ! అక్కడ నాకో స్నేహితుడున్నాడు... ! వాడికి నిన్ను చూపించుతానని మాట యిచ్చాను !" అతని కళ్ళనిండుగా అనురాగం ! ఆనందం! సీత కాదన లేకపోయింది.

"రేపు మల్లెపూలు పంపిస్తాను ! మన తోటలో వున్నాయి ! మాలకట్టి వుంచు ! దేవుడికి ! నీక్కూడా వుంచుకోవాలి సుమా !"

సీత మనస్సు ఆనందంగా నవ్వింది అతడలా చెబుతూంటే. విశ్వం వెళ్ళిపోయినా చాలాసేపటి వరకు మనసు పరవశించిపోతూనే వుంది.

"ఎంత అందంగా వున్నారో ! ఎంత చక్కగా మాట్లాడారు?" ఆమె మనస్సులో చెప్పుకుంది.

ఆరోజున మళ్ళీ విచారణ మొదలైంది. రేఖ కేసుమూలాన సారథి కేసు వాయిదా పడింది. సలీమ్ రాగానే రేఖ వంక చూసి కళ్ళతో సైగ జేశాడు.

విచారణ ఆరంభం కాగానే జనం విరగబడి చూడడం మొదలెట్టారు.

విజయ, సీత, విశ్వం అందరికన్నాముందే వచ్చి కూర్చున్నారావేళ. ముందుగా ఆషా తరపున

# మూగ ముత్యాలు

వాదించే ప్లీడరే లేచి నిలబడ్డాడు. రేఖ బోనులో తలవంచుకుని నిలబడివుంది.

"ఆషాని సారథి చంపలేదని మీరెలా చెప్ప గలరు ? " ప్లీడరు రేఖని ప్రశ్నించాడు.

"ఆషాని చంపింది శ్రీనివాస్ ! మీరు ఎన్ని విధాల ప్రశ్నించినా వచ్చే నిజం యిదే !"

"అబద్ధం !"

"కాదు ! నిజం యిదే !"

"మీకెలా తెలుసు నిజమనీ ? ఆషాని శ్రీనివాస్ ఎప్పుడూ కలుసుకోలేదు ! ఆ సంగతి గుర్తుంచుకోవాలి మీరు !"

"కలుసుకున్నాడు ! రెండు మూడుసార్లు పిచ్చి పిచ్చిగా వాగుతూ ఆషా కాలేజీకి వెళ్తూంటే వెంటబడ్డాడు ! కావాలంటే సుజాతనడగండి ? ఆషా కాలేజి నుంచి వస్తోందారోజున ! ఫంక్షను పూర్తయ్యేసరికి చీకటిపడింది ! సుజాతతో కలిసి బయల్దేరింది ! ఆ రోజున వాళ్ళ కారు రాలేదు. శ్రీనివాస్ యింటి ముందు నుంచే వెళ్ళాలి ! అప్పుడతడు యింట్లోనే వున్నాడు ! ఆషాని చూసి 'సారథి, రేఖా లోపలున్నారు ! మిమ్మల్ని పిలుస్తున్నారు' అని చెప్పాడు వెళ్ళి. ఆషా నమ్మి లోనికి వెళ్ళింది. కానీ ! ఆ నీచుడు వెంటనే తలుపు మూసివేశాడు. అంతలో సీత వెళ్ళింది. తలుపుల్ని దబదబా బాదుతూంటే కోపంతో కిటికీలోనుంచి రూళ్ళకర్ర విసిరాడు బలంగా. సీత తలకి పెద్దగా గాయమైపోయి కూలబడిపోయింది. ఎప్పటికో స్పృహవచ్చి చూసేసరికి హాస్పిటల్లో వుంది. శ్రీనివాస్ పనిమనిషి హాస్పిటలుకి చేర్చింది. ఆ నీచుడే "ఎవరో పడిపోయింది పాపం !" అని చెప్పి డబ్బులిచ్చి పంపించాడట ! ఈ లోపలే... ఆషా... జీవితాన నిప్పులు కురిశాయి. సీత వరండాలో స్పృహతప్పి పడివుంది. లోపల ఆషా శీలాన్ని... దోచుకున్నాడా నీచుడు. ఏడుస్తూ బయటికి వచ్చిన ఆషాని అప్పుడే వచ్చిన పని మనిషి చూసింది. 'ఈ బాబుగోరికి బుద్ధీ గేనం లేదు' అని చెంపలు వేసుకుని ఆషాని పలకరిం చింది. కానీ ఆషాకి ఏమీ విన్పించుకో బుద్ధిగాలే దప్పటికే."

"ఇదంతా కట్టుకథ మైలార్డ్ !"

"సుబ్బమ్మని పిలిచి అడగండి. అదుగో వచ్చింది !" అన్నది రేఖ అప్పుడే వచ్చిన సుబ్బమ్మని చూపించి.

సుబ్బమ్మని బోనులో నిలబెట్టారు.

"ఏం సుబ్బమ్మా? ఈ అమ్మాయిని చూశావా నువ్వెపుడైనా ?" ప్లీడరు ఆషా ఫోటోని చూపించాడు.

"ఈ యమ్మేనండి బాబో ! ఆ యేల అయ్యగోరి గదికాన్నుంచి ఏడుత్తా ఎల్లిపోయి నారండి !"

"ఏ అయ్యగారింట్లోనుంచి ?"

"మా అయ్యగోరేబాబో! ఆయన కిట్టాంటి అలవాట్లుండాయిబాబూ ! 'ఏటిబాబో యిది?' అన్నానుండి ! 'ఏంలేదుపోవే' అన్నారుండి ! ఆ మట్టున నా సేతిలో వంద రూపాయిల నోటెట్టారు బాబూ ! 'వుంచు సుబ్బమ్మా !' అన్నారుండి ! గుమ్మంలో పడున్న ఓ అమ్మగార్ని చూపిచ్చి 'దవాకానాకి' తీసికెళ్లమన్నండి ! ఎవరుబాబో అన్నా! 'ఎవరోలే ! పడిపోయిందన్నా' రుండి !"

"సుబ్బమ్మా నీకిలా చెబితే మరో వంద యిస్తానని చెప్పారా ఎవరైనా ?"

"అయ్యబాబో ! ఎంతమాటన్నారు ? ! నానలాంటి గడ్డి తిననుండి ! ఆ సీనువాసులుగో రిచ్చిన వొందా నేన్తీసుకోలేదండే ! ఆయమ్మకి కట్టుకట్టిచ్చి మిగిలిన చిల్లరంతా సీనుగోరుకి చ్చెల్లిపోయానుండి !"






# మంగళకరమైన వెన్నెల మోమును మెరుగు పరచటానికి

# ఐటెక్స్

## మాట్ ఫినిష్ తిలకం




## ఉచితము

**దీపావళి సందర్భములో మా అభిమాన వాడుక దారులకు ఐటెక్స్ కానుక**

ఇదుగో! మీ వెన్నెల మోమును
మెరుగు పరిచే ఐటెక్స్ డీలక్స్
మాట్ ఫినిష్ తిలకమును–9 గ్రాములు
లేక 5 గ్రాములలో ఒక దానిని కొను నప్పుడు –
ఐటెక్స్ మీడియం కాటుక
ఒకదానిని ఉచితముగా పొందండి.

**త్వరపడండి! 1-11-1983 మొదలు అమలు పరుచే ఈ అవకాశము — దక్షిణ భారతము లో మాత్రమే.**



**అరవింద్ లాబొరేటరీస్**
**మద్రాసు 600 033**

వ్యాపార మరియు వర్తక వివరములకు :

**ప్రగతి ఏజెన్సీస్,** పో. బా. 162, విజయవాడ-1. రాయలసీమ, నెల్లూరు, ప్రకాశం మరియు గుంటూరు జిల్లాలకు.

**ప్రగ్‌జ్యోతి ఏజెన్సీస్,** పులిపాటివారి వీధి, విజయవాడ-1. ఉత్తరాంధ్ర మరియు తెలంగాణా ప్రాంతములకు.

Imageads M-1807

''ఇదంతా అబద్ధం!'' ప్లీడరు ఆమెనే చూస్తూ పెద్దగా అరిచాడు.

''ఏటిబాబో! నిజం సెబితే అరుత్తారెందు కండే? ఇంద! సూడుబాబో! ఆ డాటరుగోరు యిచ్చారీకాయితంముక్క! సచ్చిపోనారు సూడండి! పాపం ఆ యమ్మగోరి వుంగరం బాభో! వూడి కిందడ్డాదిగామోను! ఇల్లూడు త్తుంటే అయ్యగోరి మంచంకింద దొరికింది బాబో!'' సుబ్బమ్మ చెంగున వున్న వుంగరాన్ని తీసి యిచ్చిందీ. ప్లీడరు మొహం సున్నంవేసి నట్లు తెల్లబడిపోయింది 'ఆషా' అన్న అక్షరాలు వుంగరంలో నుంచి చూసి వెక్కిరిస్తూంటే

''మై లార్డ్! ఈ వుంగరాన్ని సలీమ్‌గారు యీ అమ్మాయికి యిచ్చారని నా నమ్మకం! ఏమ్మా? నిజంచెప్పు? నీకీ వుంగరం ఆయన యిచ్చారుగదూ?'' సలీమ్‌ని చూపించుతూ అడిగాడు.

''ఇదెక్కడ గోలండి బాబో! ఆ అయ్య గోరికే నానియ్యబోయాను గందా! బోరున ఏడిశారయ్యగోరు! కోరుటులో యియ్యమ్మా అన్నారుండి! మా మావ ఎంకన్న కూడా సూశాడుబాబో! ఆ యమ్మగోర్ని! ఇద్దరం పనిలో కొత్తన్నాం! అల్లుడుగో! అప్పుడే యీ గోరం జరిగిపోనాదండి! 'పెద్దోల్లుగందా! ఏంజేసినా చెల్లిపోద్దే' అన్నాడు మా మావ! మరిసేపోయినానయ్యో! ఇంద! ఆ యమ్మగోరి సిలుకు రుమాల నాకాడుండాదయ్యో! ఆ గదిలో పడుండాది! మా సిన్నోడికిద్దావని బద్దిరంగా ఎత్తుకెల్లానయ్యా!'' ఓ ఎర్రని సిల్కురుమాలు తీసి ప్లీడరు చేతికిచ్చింది. రేఖ కోసం వాదిస్తూన్న ప్లీడరు లేచివచ్చి చూశాడు ఆ రుమాలు మధ్యలో 'సలీమ్!' అన్న అక్షరాలు అందంగా కుట్టబడివున్నాయి! జడ్జీకి తీసుకువెళ్ళి చూపించాడతడు.

సుబ్బమ్మ భర్త, వెంకన్నని కూడా పిలిచారు బోనులోకి. అతడూ అదే చెప్పాడు.

''నమ్మలేం మై లార్డ్! వీళ్ళు డబ్బు కోసం ఎన్నైనా చెప్పగలరు.'' అన్నాడు ప్లీడరు

రేఖ తరఫున వాదించే ప్లీడరు సలీమ్ దగ్గరకెళ్ళి టేప్‌రికార్డర్ని తీసుకువచ్చాడు.

''మై లార్డ్! రేఖ, శ్రీనివాస్‌తో స్నేహం నటించి ఓ రోజున బాగా విషా ఎక్కేట్లు త్రాగించింది ఆ నిషాలో శ్రీనివాస్ వున్న నిజాన్ని చెప్పకుండా వుండలేకపోయాడు! వినండి!'' ప్లీడరు టేప్‌రికార్డర్‌ని ఆన్ చేశాడు.

అంతా నిశ్శబ్దంగా వుంది! ప్రేక్షకులు కుతూహలంగా చూడశాగారు సలీమ్ తల వాల్చుకుని కూర్చున్నాడు

''రేఖా డాలింగ్! బావుంది? చాలా ఫైన్ ...గా వుంది!''

# మూగ ముత్యాలు

శ్రీనివాస్ నిషాతో అరుస్తున్నాడు అంతలో రేఖ గొంతు విన్పించింది.

''శ్రీనూ? నువ్వు ఆషాని నాశనం జేశావు గదూ?''

''ఎవర్ని? ఓ? ఆషా.. నా? యస్! యస్! పాపం! ఏడవలేక. ఏడ్చింది! దణ్ణం బెట్టింది డార్లింగ్.. మనకి! అయినా.. మనం ఒప్పుకోలేదనుకో!.. మాంచి బ్యూటిఫుల్‌గాళ్! ఊ! అషా!.. కమాన్! ఒక్కసారి! ప్లీజ్! ఆ .. డర్టీ.. రేఖని.. రేపు. చంపిపారేస్తానే! దాని డబ్బంతా మనదే! డాలింగ్!''

''శ్రీనివాస్! ఆషా చచ్చిపోయింది!'' రేఖ గొంతు!

''వాట్! చచ్చిపోయిందా?!! ఓ! చచ్చిపోయిందా? పోన్లే!.. అవును డాలింగ్! చావడమెందుకు? హాయిగా నన్ను . నాతో ఖుషీగా వుంటే బావుండేదిగాదూ?''

''ఆషాని నువ్వే చంపివేశావు? రాస్కెల్! నిన్ను షూట్ చేసినా పాపంలేదు!'' శశిరేఖ అరిచింది పెద్దగా.

''యూ! డర్టీ క్రీచర్! . నిన్ను కూడా చంపిపారేస్తాను! ఏదీ! పిస్టలు? ఆ! రా! నీ కోసమే దీన్ని దిండుక్రింద . దాచిపెట్టాను!''

''వదులు! అబ్బా! గొంతు రాస్కెల్! నువ్వు నన్ను చంపుతావా?'' పిస్టల్ పేలిన చప్పుడు రేఖ గొంతు శ్రీనివాస్ చావుకేకలు. అంతా రణరంగంలా ఉంది. ఆ తరువాత టేప్ రికార్డర్‌లో ఏ శబ్దమూ లేదు. ఆగిపోయింది. సలీమ్ శిలా విగ్రహంలా కూర్చున్నాడు. అతని కళ్ళు ఎర్రగా జోతుల్లా మండిపోతున్నాయి.

సీత బొమ్మలా కదలలేనట్లుంది. విజయ కళ్ళనిండుగా నీళ్ళే

కోర్టులో విషాదం నిండిపోయింది

జడ్జి కంఠం గంభీరంగా విన్పించిందంతలో

''సారధి నిర్దోషి గనుక విడుదల చేస్తున్నాము? రేఖ ఆత్మ రక్షణకోసం శ్రీనివాస్‌ని చంపింది. ఆమె నిస్సహాయ స్థితిలో అలా చేయ వలసి వచ్చింది అయినప్పటికి మనిషిని చంపడం నేరంక్రిందే వస్తుంది. కనుక శశిరేఖకి జైలు శిక్ష తప్పదు!'' అన్నాడు జడ్జి

అయిదేళ్ళవరకు జైలుశిక్ష పడింది రేఖకి

సలీమ్ తండ్రి భుజాలమీదవాలిపోయి— నడవడానిక్కూడా ఓపిక లేనివాడిలా నెమ్మదిగా నడిచికెళ్ళాడు. సీతా, విజయా, విశ్వం సారధి దగ్గరికి వెళ్ళారు. ఆ వుత్సాహంలో సీత విశ్వం చేతిలో చేయివేసి లాక్కు వెళ్ళింది

''సీతా! ఈ అదృష్టం నాది!'' అంటూ విశ్వం సీతవంక చూసి చిలిపిగా నవ్వాడు ఆమె సిగ్గుతో కళ్ళు వాల్చుకుంది సారధి విడుదలైన క్షణమే రేఖ దగ్గరకివెళ్ళాడు

''అమ్మా! రేఖా!'' సారధి రేఖ చేతుల నందుకుని కన్నీళ్ళు పెట్టుకున్నాడు

''చూశావా అన్నయ్యా! వాళ్ళందరికీ నువ్వు కావాలి! నీకు నేను కావాలి! నిన్న వీళ్ళందరూ నీకోసం పరుగెత్తారు! నేను నిస్సహాయంగా చూస్తూండిపోయాను!'' రేఖ పసిపిల్లలా ఫిర్యాదు చేసింది

సీత, విజయ ''అయ్యయ్యో! రేఖని చూసేపని! నిన్న!''అనుకున్నారు సిగ్గుపడుతూ

''నన్ను క్షమించన్నయ్యా! నేను నిన్నూ, సీతనీ చాలా బాధపెట్టాను! కానీ నాకు. నా కన్నవాళ్ళెవరూ లేక అలా దిగజారి పోయాను!'' ఎన్నాళ్ళకో లభించిన తల్లి కౌగిట్లో ఒదిగిపోయిన పసిబిడ్డలా సారధి గుండెలపైన వాలిపోయి వెక్కి వెక్కి ఏడ్చింది!

''ఏడవకమ్మా! ఏడవకు! ఈ సంఘం స్త్రీని ఒంటరిగా బతకనీయదమ్మా! నేనిన్నాళ్ళూ నీకు దూరంగా బ్రతికినందుకు నాకెంతో సిగ్గుగావుంది! బాధతో రగిలి పోతున్నానమ్మా!'' సారధి రేఖ చెక్కిళ్ళపై జారి పడుతూన్న కన్నీటి ధారల్ని తుడుస్తూ అన్నాడు

''నాకిక ఓపికలేదన్నయ్యా! అలసి పోయానురా!''

## రెండేళ్ల పాపకి కాలేయం మార్పిడి!

హానోవర్‌లోని డాక్టర్లు రెండు సంవత్సరాల పాపకు ఆపరేషనుచేసి పాడైపోయిన కాలేయాన్ని తొలగించి దాని స్థానంలో మరొక కాలేయాన్ని అమర్చారు చికిత్స జరిగిన వారం రోజుల తరువాత కూడా ఆ పాప ఆరోగ్యంగా ఉన్నట్లు డాక్టర్లు ప్రకటించారు చిన్న పిల్లలకు అవయవ మార్పిడి చికిత్స చేయటం చాలా కష్టం వారి అవయవాలు చిన్నవిగా ఉంటాయి. అవయవ దాతలు ఉంటారు. అందుకని అందుబాటులో ఉన్న కాలేయాన్ని కొంత భాగం కోసి ఆ పాప కడుపులో అమర్చారు ఇది కూడా ఆ పాప కాలేయంలాగే పాపతో పాటు పెరిగి పెద్దది కాగలదని వైద్యులు తెలియ చేశారు ఆరుగురు డాక్టర్లు పాల్గొన్న ఈ ఆపరేషన్‌కి 12 గంటలు పట్టింది.

# బ్రహ్మాండమైన అవకాశం!

# బాదల్ ఫ్యానులు

ఉచితం!
ఒక్కొక్క
ఫ్యాన్‌తోను ఒక
స్టెయిన్‌లెస్
స్టీల్ పాత్ర




## త్వరపడండి!

ఈ కొద్ది రోజుల సదవకాశాన్ని చేజారనీయకండి

**Badal** *fans*

• టేబుల్ • సీలింగ్ • పెడస్టల్ • క్యాబిన్

• ప్రముఖ ఫ్యాన్ డీలర్లందరివద్ద లభ్యంకాగలదు.

అసోసియేటెడ్
మార్కెటింగ్ ఏజెన్సీస్
4-4-340/బి గిరిరాజ్ లేన్
బ్యాంక్ స్ట్రీట్, హైదరాబాద్-500 001

AMA 21 83TEL

రేఖ గుండెల్లోని మమతానురాగాలు సారధిని వుక్కిరిబిక్కిరిచేసి వేయసాగాయి తల్లిని చుట్టి వేసినట్లు రేఖ చేతులు సారధి మెడచుట్టూవేసి ఏడుస్తూ గుండెల్లో వున్న సంతోషాన్నీ, బాధనీ, విప్పుకుంటోంది.

"ఇన్నాళ్ళూ నీకు నేనేమీగానట్లు వుండడానికి నేను సర్వశక్తుల్నీ కూడదీసుకోవలసి వచ్చింది! నా ఛాయకూడా నీమీద పడనీయకుండా చేయాలని తపించిపోయాను! కానీ సర్వనాశనం చేశాను!"

"అదంతా ఆ శ్రీనివాస్ మూర్ఖత్వం తల్లీ! నీకు శిక్ష యింకా తగ్గిపోతుందమ్మా! యిలాగే నిర్మలంగా.... "

"వద్దన్నయ్యా! శిక్ష యింకా పెరగాలి! నాకీ ప్రపంచంలోకి రావాలనిలేదు! ఈ శిక్ష పూర్తయ్యే లోపలే నా ప్రాణాలు పోవాలి! అప్పుడే నాకు మనశ్శాంతి!"

రేఖ అప్పటికి లేచి అవతలకి జరిగి నిలబడింది.

"నేమ నీకేమీగానామ్మా? నా కోసం బ్రతకాలిక!"

"సీతకి నేను జేసిన అన్యాయం నన్ను చిత్రవధ జేస్తోంది! మీ నుంచి దూరంగా వెళ్ళిపోతాను! నా లాంటి వాళ్ళకి కలకత్తాలో ఓ శరణాలయం వుందట! అక్కడికి వెళ్ళిపోతాను! అక్కడే వుండిపోతాను! ఎప్పుడైనా నిన్ను.. . చూడాలన్పిస్తే రాస్తాను ఎప్పుడురా!" రేఖ నిలబడడానిక్కూడా ఓపికలేనట్లు కూర్చుండి పోయింది.

"ఒక్కసారి .. యీ నీ అన్నయ్య గురించి ఆలోచించమ్మా!"

"వద్దు! నన్ను నేనుండలేను! నామనస్సు ముక్కలు ముక్కలైపోయింది! దానికిక ... ఏ బంధాలుగా లేవు! నన్నర్థంజేసుకో! రేపే యిక్కడి నుంచి వెళ్ళిపోతున్నాను. ఇక్కడ వుండలేనని జడ్జిగారికి చెప్పకున్నాను!" ఆవేదనతో ఆమె మనస్సు దహించుకుపోతోంది. "సలీమ్‌కూడా అన్యాయం జరిగిపోయింది నా మూలాన్నే ఆ సలీమ్ అన్నయ్యని మనిషిగా నువ్వే మార్చాలి! అంత దుఃఖంలో వుండీ నీ కోసం కేసుక్కావలసిన వివరాలన్నీ సేకరించాడు! రాత్రింబవళ్ళు ప్లీడర్ల చుట్టూ తిరిగాడు! మీ స్నేహమే నన్ను మార్చి వేసిందన్నయ్యా! వచ్చే జన్మంటూవుంటే నేను మరో సలీమునైపుట్టాలి! రేఖ సీతకీ, విజయకీ క్షమాపణలు చెప్పి లోనికి వెళ్లిపోయింది సారధి కళ్ళు వత్తుకుంటూ వెనుదిరిగాడు.

సారధి యింటికి వెళ్లేసరికి — విజయ సోమయాజులుగారు రాసిన వుత్తరం తెచ్చి యిచ్చింది—

# మూగ ముత్యాలు

"చిరంజీవి సారధికి భగవదాశీస్సులు!

నాయినా! మంచి మనసుని ఆ పరమాత్మ డెపుడూ రక్షించుతాడు. విజయ విన్న నే టెలిగ్రాం పంపింది! నీకు న్యాయం జరిగింది. నాకందుకు సంతోషంగా వుంది బాబూ!

విజయ గురించి నేను ఆలోచించాను! మీ యిరువురి మనస్సులేనాడో అనురాగంతో బంధించబడ్డాయి! కానీ నువ్వు మీ అమ్మకోసం, రేఖ కోసం నీ చుట్టూ పద్మవ్యూహాన్ని నిర్మించుకున్నావు! సారధీ! భగవంతుడు సృష్టించింది మనుష్యుల్ని. కులాల్ని సృష్టించలేదని గుర్తుంచుకో! నా దృష్టిలో మనుషులకున్నది రెండే కులాలు! మంచివాళ్లు! చెడ్డవాళ్లు! అంతే! అందుకే విజయని నీ భార్యగా పరిగణించి పంపి వేశాను! ఈ వూళ్లో నే నొక యోగిని! కులాన్ని దాటిపోయానని... అజ్ఞానంతో నాపైన రాళ్ళు రువ్వుతారు! విజయనీ, రాజ్యలక్ష్మినీ వెలివేస్తారు.

అజ్ఞానాన్ని జయించడానికి సమయం కావాలి! శక్తి కావాలి! యుక్తి కావాలి! నేను ఆరిపోతూన్న దీపాన్ని! నాక్కావలసింది నీవు! విజయ కోరుకున్నదీ నిన్నే! రేఖని యీ సంఘం లోని అజ్ఞానం మ్రింగివేసింది! మనిషిగా బ్రతకనీయలేదు! అందుకే ఆ పిచ్చితల్లి మూగముత్యమై పోయింది.

సలీమ్ మనస్సుని నీ స్నేహమే లాలించి మనిషిని జేస్తుంది! నాకా నమ్మక ముంది! సలీమ్‌ని వెంటబెట్టుకుని దేశం నాలుగుమూలల్నీ చూసిరా బాబూ! అతని మనస్సు కాస్త ఆ విషాదం నుంచి తేరుకుంటుందపుడు.

ముహూర్తాలు పెట్టి పంపించు! నీవేవచ్చి నన్ను తీసుకువెళ్లు నాయనా! విజయని నీకు కానుకగా అర్పించినందుకు నాకెంతో ఆనందంగా వుంది బాబూ!

సీతకు నా భగవదాశీస్సులు. విశ్వం వంటి మంచివాళ్ళున్నంత కాలం మూగముత్యాలవంటి సీతలూ, రేఖలూ సుఖసంతోషాల్ని నింపుకుని మెరిసిపోతారు నాయనా!

నీలాంటి రత్నం మా విజయకు లభించినందుకు ఆ భగవంతునికి వేల నమస్కారాలర్పిస్తున్నానయ్యా!

నీకోసం నిరీక్షిస్తున్న— నీ తాతయ్య."

సారధి, విజయ కళ్ళల్లోకి చూసి నవ్వాడు

"మీరే గెలిచారు ఆఖరికి!" విజయ కళ్ళ నిండుగా ఆనందం మెరిసిపోతోంది.

"ఈ గెలుపు మా రేఖది!" సారధి, రేఖని ఆశీర్వదించాడు మనస్సులో

"సారధిగారూ! సీతని నాకు వరంగా యిచ్చి వెళ్ళింది మీ రేఖ! రేపు మద్రాసు తీసుకువెళ్తున్నాను!" విశ్వం గొంతు వినగానే సీత మనస్సు నిండుగా అనురాగం ప్రవహించింది

"మీరే మాకు వరం బావగారూ!" సారధి విశ్వంలోని మంచితనాన్ని ప్రశంసించాడు.

విజయ, సీత కళ్ళల్లోకి చూస్తూ చిలిపిగా నవ్వింది

*(అయిపోయింది)* ★



శ్రీ వై. వెంకటనరసింహారావు

## అంకితం

మీరు మరణించారని యిప్పటికీ నమ్మలేకపోతున్నాము ఇంత హఠాత్తుగా మీరిలా మమ్మల్ని వదిలి వెళ్ళిపోతారని మేము కలలో కూడా వూహించలేదు అప్పుడే రెండేళ్ళు గడిచిపోయాయి. అయినా మీరింకా మా గుండెల్లో జీవించే వున్నారని— కన్నీటిని దిగమ్రింగుతూ — ధైర్యాన్ని కూడదీసుకుని బ్రతుకుతున్నాం! మీ ఆశీస్సులు మా కెల్లపుడూ వుంటాయని నమ్ముతూ యీ నవలను మీకు అంకితమిస్తున్నాము.

నమస్కృతులతో,

మీ

ఝాన్సీలక్ష్మి

చిరంజీవులు-కృష్ణ, పాండు, మీనాక్షి

## మీరు వాడేది ఏ టూత్‌పేస్ట్ అయినా కానివ్వండి...

# సిగ్నల్- ఇచ్చేదేమిటో- కనుక్కోండి!

★★★★★★★★★★★★★★★★★★★★★★★★★★★★★★★★★★★

ఫ్లోరైడ్ సిగ్నల్-2 పిప్పిపళ్ళను నిరోధించే అత్యుత్తమమైన టూత్‌పేస్ట్. ప్రతివాళ్ళూ దీనిని కనుక్కోవడం కోసమే. మరి ప్రత్యేకమైన యీ కానుక :

### సిగ్నల్-ఇచ్చేదేమిటో-కనుక్కోండి:

బ్రహ్మాండమైన తగ్గింపు-300 గ్రా. ప్యాక్‌పైన రూ. 3.00, 200 గ్రా. ప్యాక్‌పైన రూ. 2.00, 125 గ్రా. ప్యాక్‌పైన రూ. 1.00, 75 గ్రా. ప్యాక్‌పైన 50 పై.

అందుకే త్వరపడండి : సిగ్నల్-2ని కొనుక్కోండి. బ్రహ్మాండమైన తగ్గింపు ధరలో ఒక్కసారి వాడిచూసారంటే, మరిక వదిలిపెట్టరిక మీరు, ఎప్పటికీ.

### అది తెచ్చుకోవడం ఎలా?

★ మీరు వాడేసిన ఖాళీ టూత్‌పేస్ట్ ట్యూబు ఏదైనా సరే దుకాణదారుడికి ఇవ్వండి. (అది సిగ్నల్-2 మాత్రమే కానక్కరలేదు: అది ఏ బ్రాండుదైనా ఏ సైజుదైనా కావచ్చు)

★ సిగ్నల్-2 టూత్‌పేస్ట్‌ని తగ్గింపు ధరలో కొనుక్కోండి.

★ సిగ్నల్-2 తాలూకు ఖాళీ పెట్టెను మీ పేరు, అడ్రసుతో పాటు అక్కడ యిచ్చెయ్యండి.

ఏ టూత్‌పేస్ట్ వాడేవారైనా వారందరికీ యీ కానుక 1 మార్చి 1984 వరకు

### సిగ్నల్- ఇచ్చేదేమిటో- కనుక్కోండి

★★★★★★★★★★★★★★★★★★★★★

వాడేసిన ట్యూబును (అది ఏ టూత్‌పేస్ట్‌దైనా, ఏ సైజుదైనాసరే) మీ దుకాణదారుడికి తిరిగి యిచ్చెయ్యండి. సిగ్నల్ 2ని. కొనుక్కోండి: బ్రహ్మాండమైన తగ్గింపు ధరలో.

★ 300 గ్రా. పైన రూ 3.00 ఆదా చెయ్యండి

★ 200 గ్రా. పైన రూ 2.00 ఆదా చెయ్యండి

★ 125 గ్రా. పైన రూ 1.00 ఆదా చెయ్యండి

★ 75 గ్రా. పైన 50 పై ఆదా చెయ్యండి




ఈ కానుక ఎన్నిక చేయబడిన ప్రాంతాల్లో మాత్రమే

## సిగ్నల్ 2 పిప్పిపళ్లను నిరోధించే టూత్‌పేస్టు

వాడిచూసారంటే, మరిక వదిలిపెట్టలేరు మీరు, ఎప్పటికీ!

హిందుస్థాన్ లీవర్ వారి విశిష్ట ఉత్పత్తి

LINTAS SG 2 43 2315 TL

# అవశ్యదర్శనీయ పుణ్యక్షేత్రం ధర్మస్థలం

సుప్రసిద్ధ పుణ్యక్షేత్రమైన ధర్మస్థలం కర్నాటక రాష్ట్రములో దక్షిణ కన్నడ జిల్లాలోని బెళ్తంగడి తాలూకాలో మలెనాడను ప్రదేశపు విశిష్టమైన ప్రకృతి సౌందర్యపు ఒడిలో విరాజిల్లుతున్నది. అక్కడి వారు దీన్ని శ్రీక్షేత్రం అని కూడా అంటారు. చుట్టూ కొండ గుట్టలు, వెళ్ళడానికి అరణ్యంలో వాడుక దారి ఉన్నది.

## ధార్మిక కేంద్రం

శ్రీ ధర్మస్థలం క్షేత్రము సర్వధర్మములకు పుట్టినిల్లు. ఇచ్చట— ఆరాధ్య దైవం శ్రీ మంజునాథస్వామి. శ్రీ ధర్మస్థలం కేవలం పుణ్యక్షేత్రమే కాక, ధార్మిక కేంద్రం కూడా. వచ్చిన యాత్రికులందరికీ ఉచితంగా భోజన, వసతి సౌకర్యాలు ఉంటాయి. అన్నదానం ఇక్కడి ముఖ్యమైన దానాలలో ఒకటి ఇక్కడికి విచ్చేసిన వారంతా శ్రీ స్వామివారి ప్రసాదాన్ని స్వీకరించి వెళ్లాలనే ఆచారం ఉంది ఇక్కడ కులమత బేధాలు లేవు అందరికీ ఒకేరకమైన ఆదరాతిథ్యాలు లభిస్తాయి

ఈ క్షేత్రానికి ధర్మాధికారులు జైన మతావలంబులైన శ్రీ వీరేంద్ర హెగ్గడెగారు శ్రీ హెగ్గడెగారు అనేక విద్యా సంస్థలను నడపటమేకాక ఉచిత విద్యానిలయం, ఉచిత పుస్తకములు, పసు వస్త్రదానం, విద్యార్థి వేతనములు, ఔషధోపచారములు, ధన సహాయం, ఉచిత సంచార ఆస్పత్రిని కూడా నిర్వహిస్తున్నారు ఇక్కడ నిరంతరం జరుగుతున్న దాన ధర్మాలవల్లనే ఈ క్షేత్రానికి 'ధర్మస్థలం' అనే పేరు వచ్చిందని ప్రతీతి. మొదట దీనిని 'కుడుమ' అని పిలిచేవారట.

## 200 టన్నుల బాహుబలి విగ్రహం!

ధర్మస్థలములో ప్రవేశద్వారానికి ఎడమవైపు శ్రీ మంజునాదేశ్వరుని హైస్కూలు భవనం, కుడివైపు ఎత్తైన బాహుబలి విహారపు కొండ కనబడుతుంది. కొండపై విశాలమైన బాహుబలియొక్క శిలా విగ్రహం ఉంది. ఇది సుమారు 200 టన్నుల బరువు, 52 అడుగుల పొడవు, 14 అడుగుల వెడల్పు ఉంటుంది.

ఇక రోడ్డుకు ఇరువైపులా యాత్రికులకు బసచేసేందుకు నిర్మించిన కావేరి, గంగా, నర్మదా అనే ధర్మ సత్రములు. మధ్యలోఉన్న సత్రంలో విచారణ కేంద్రం ఉంది. దేవాలయం ముందు శ్రీ హెగ్గడెగారి నిలయం, ప్రక్కన అన్నపూర్ణ అన్నసత్రమున్నది ఇక్కడ ప్రతిరోజు అన్న సంతర్పణము జరుగుతుంది



శ్రీ మంజునాధేశ్వరస్వామి ఆలయ దృశ్యం

## నేత్రావతి జన్మవృత్తాంతం!

ధర్మస్థలమునకు దగ్గరలో నేత్రావతి నది ప్రవహించుచున్నది యాత్రికులు ఈ నదిలో స్నానమాచరించి స్వామిని దర్శిస్తారు పూజ్యులైన శ్రీ వాదిరాజస్వాములవారు ఈ నదిని గురించి "తీర్థప్రబంధం"లో భగవంతుడు వరాహ రూపముదాల్చి ప్రళయంలో మునిగిన భూమిని పైకెత్తినపుడు కృతకృత్యతాభావముతో అతని నేత్రములనుండ ఆనందాశ్రువులు చిమ్మినాయట. ఇలా జన్మించిన నదియే "నేత్రావతి" అని రాశారు

ఈ క్షేత్రం సర్వతో ముఖాభివృద్ధికి ఇప్పటి వరకు ఇరవై మంది హెగ్గడెగార్లు కృషి చేసారు.



శ్రీ మంజునాథస్వామి

ఇరువది ఒకటవ హెగెడెగారు శ్రీ డి. వీరేంద్ర హెగ్గడెగారు. వీరు 1968లో ధర్మాధికారులుగా అధికారం స్వీకరించారు. 1972లో ధర్మస్థలంలో వీరు వరకట్న రహితమైన సామూహిక వివాహ కార్యక్రమం ప్రారంభించారు. ఇది ప్రజాదరణ పొందింది. కులమత బేధములు లేకుండా సర్వమతముల వారును ఇందులో పాల్గొనెదురు. వీరి చిరునామాలు, ఇతర వివరాలు ఒక ప్రత్యేక పుస్తకములో నమోదు చేస్తారు. అందరికీ ఒక ముహూర్తంలో, ఒకే సభాంగణములో అతిధులు, ఆహ్వానితుల ఎదుట మంగళవాద్యాలతో వివాహ కార్యక్రమం జరుగుతుంది.

ప్రతిరోజు దేవస్థానములో ధర్మదర్శనం ఉంటుంది. దైవదర్శనార్థము ఎలాంటి రుసుము తీసుకోరు. స్వామి వారి సన్నిధిలో విశేషపూజలు, ఉత్సవములు, అభిషేకములు, తులాభారములు

శ్రీ వీరేంద్ర హెగ్గడె



చేయించేవారు ముందుగానే డబ్బుకట్టి టికెట్ తీసుకోవాలి. రాత్రివూట విశేషపూజలు, అభి షేకములు లేకుండా మంగళారతి కుంకుమార్చన మొదలైనవి జరుగుతాయి.

## కార్తీక మాసంలో లక్ష దీపోత్సవం !

ధర్మస్థళంలో ధర్మదేవతలైన కాళరాహు, కాళర్కాయి కుమారస్వామి, కన్యాకుమారి దేవతల ప్రత్యేక మందిరాలు ఉన్నాయి. దేవ స్థానములో ప్రవేశించడానికి పురుషులు చొక్కా బనియన్ విప్పేసి, శాలువను కప్పకోవాలి. 8 సం॥లు లోపుగల పిల్లలను, రోగులను, లోపలికి పోనివ్వరు. మన ప్రధాని శ్రీమతి ఇందిరాగాంధి, మాజీ రాష్ట్రపతి వి. వి. గిరి కూడా ఈ క్షేత్రాన్ని సందర్శించారు.



బాహుబలి విగ్రహం

అణ్ణప్పస్వామి మరియు ధర్మదేవతలు వెలసిన 'బదినడె' కొండకూ, నెల్యాడి బీడుకూ స్త్రీలు, పిల్లలు వెళ్ళకూడదు. ఇది అనాది కాలమునుండి ఆచరిస్తూవస్తున్న సాంప్రదాయం. చంద్రనాధస్వామి బసది, కళ్ళేరితాయస్వామి మందిరం దర్శింపదగినవి. ప్రతి సంవత్సరం కార్తీక మాసంలో శ్రీ మంజునాధస్వామికి లక్ష దీపోత్సవము జరుగుతుంది. భక్తులు, యాత్రికులు వేలాదిగా విచ్చేసి ఈ ఉత్సవంలో పాల్గొంటారు. ఉత్సవపు చివరి రెండురోజుల్లో సర్వధర్మ, సాహిత్య సమ్మేళనాలు జరుగుతాయి

వ్యాసం . జయసుమన్

ఫోటోలు : ధర్మస్థళంవారి సౌజన్యంతో ★





# వాహన యోగం

విన్నకోట సుశీలాదేవి

రామ్మూర్తికి సూపర్నెంటుగా ప్రమోషన్ వచ్చింది! ఆ విషయం వినగానే రెహమాన్ రామ్మూర్తి దగ్గరకు పరిగెట్టుకు వచ్చాడు

"సార్! నిజమేనా సార్! మీకు ప్రమోషన్ వచ్చిందిట కదా!" తనకే వచ్చినంత సంతోషంతో పొంగిపోతూ అడిగాడు.

"అవునోయ్! ఇప్పుడే తెలిసింది! మన ఆఫీసరుగారు పిలిచి చెప్పారు!" అన్నాడు రామ్మూర్తి చిరునవ్వుతో

"సార్! మీకు ప్రమోషన్ వచ్చింది గదా! నాకిక బహుమానం ఇచ్చెయ్యాలి!"

రామ్మూర్తి నవ్వాడు.

"అలాగేలేవోయ్! అప్పుడే మన వాళ్లందరూ టీ పార్టీకి ఎరేంజ్ మెంట్సు చేస్తున్నారు!" అన్నాడు.

"అబ్బే! నాక్కావలసింది 'టీ' పార్టీ కాదండీ!"

"మరేమిటి?"

"సార్! అప్పుడే మర్చిపోయారా!" నిష్ఠూరంగా అన్నాడు రెహమాన్

"ఏమిటో చెప్పవోయ్"

"నాకు మీ సైకిలు ఇస్తానన్నారుగా సార్!" చిన్నగా అడిగాడు.

రామ్మూర్తి పెద్దగా నవ్వాడు.

"సార్! మీరు సూపర్నెంటవగానే కారు కొనుక్కుని మీ సైకిలు నాకిస్తానన్నారు మీరు సూపర్నెంటయ్యారు గదా! ఇక వెంటనే కారు కొనుక్కోండి సార్!"

అతని మాటలు వింటూ రామ్మూర్తి ఆలోచనలో పడ్డాడు

"సార్! మళ్లీ సాయంత్రం కలుస్తానండీ" రెహమాన్ వెళ్లిపోయాడు

రామ్మూర్తి అది గమనించలేదు కొద్దిసేపు ఏదో తీవ్రంగా ఆలోచించి - ఆ తర్వాత తన కెదురుగా ఉన్న ఫైళ్లను ముందుకు లాక్కున్నాడు

రామ్మూర్తి పదిహేనేళ్ల క్రితం ఆ ఆఫీసులో గుమాస్తాగా చేరాడు సరిగ్గా ఆరోజునే రెహమాన్ ఆఫీసు ప్యూనుగా వచ్చాడు. ఒకేరోజు చేరడంతోపాటు — ఒకే వీధివాళ్లు కావడంతో వాళ్లిద్దరి పరిచయం స్నేహంగా మారడానికి ఎంతో కాలం పట్టలేదు మతంగానీ, అంతస్తుగానీ వారి స్నేహానికి ప్రతిబంధకం కాలేదు రోజూ కలిసి ఆఫీసుకు వెళ్లి తిరిగొచ్చేవారు.

మొదట ఇద్దరూ కొద్దిదూరం నడిచేవారు ఆ తర్వాత రెహమాన్, రామ్మూర్తి సైకిలు వెనక కూర్చునేవాడు అది కూడా రామ్మూర్తి బలవంతంమీదే.

'రెహమాన్! రోజూ బ్రతిమాలించుకోందే సైకిలు ఎక్కవా ఏమిటి?' రామ్మూర్తి ఒక రోజు అడిగాడు

"అది కాదండీ! నాకెందుకో సిగ్గుగా వుంటుంది!"

"సిగ్గా! అదేమిటోయ్! వింతగా మాట్లాడుతున్నావ్!"

"ఏమోనండీ" మొహమాటంగా అన్నాడు

"రేపటినుండీ ఆ మొహమాటలన్నీ పక్కనపెట్టి ముందు సైకిలెక్కు" అన్నాడు రామ్మూర్తి

కానీ రెహమాన్ ఎందుకో బిడియపడేవాడు

అటువంటి సందర్భంలోనే ఒకరోజు రెహమాన్ తన మనసులోని మాటను రామ్మూర్తి చెవిని వేశాడు

"సార్! నాకొక కోరిక వుందండీ!"

"ఏమిటది?"

"ఒక సైకిలు కొనుక్కోవాలనే కోరికండీ!"

రెహమాన్ చెప్పిన విషయం వినగానే అతనికీ హఠాత్తుగా తన మనసులోని కోరిక జ్ఞాపకం వచ్చింది

"నాకూ వుందోయ్ ఒక కోరిక!"

"ఏమిటి సార్ అది!" రెహమాన్ ఆత్రంగా అడిగాడు

"ఒక కారు కొనుక్కొని దాన్లో కూర్చుని హాయిగా తిరగాలని వుందోయ్!"

రెహమాన్ ఆశ్చర్యపోయాడు.

"సార్! కారు కొంటారా" అతని కంఠంలో ఆనందం తొంగిచూసింది

"అవునోయ్! ఈ వెధవ సైకిల్ కి రోజూ ఏదో ఒక ట్రబులేనోయ్ కానీ రెహమాన్! నాలాటివాడు కారు కొనడం చాలా అసాధ్యమైన విషయం," రామ్మూర్తి విచారంగా అన్నాడు!

రామ్మూర్తి కుటుంబ విషయాలు తెలిసిన రెహమాన్ ఏమనలేకపోయాడు. కానీ తన మనసులోని మాటను రామ్మూర్తికి చెప్పకుండా వుండలేకపోయాడు.

"సార్! మీరు కారు కొనుక్కుంటే మీ సైకిలు నాకిచ్చెయ్యండి."

"సరేలేవోయ్! అలాగేలే."

రెహమాన్ పొంగిపోయాడు.

"సార్! మీకు సూపర్నెంటు ప్రమోషన్ వస్తే కారు కొనుక్కోవచ్చుగా."

రామ్మూర్తి క్షణం ఆలోచించి—

"ఆ! కొనుక్కోవచ్చు. కానీ ఆ ప్రమోషన్ రావాలిగదా" అన్నాడు.

"అల్లా దయవల్ల మీకు త్వరలోనే ప్రమోషన్ వస్తుంది సార్." రెహమాన్ నమ్మకంగా అన్నాడు.

రామ్మూర్తి నవ్వి వూరుకున్నాడు.

ఆ రోజు నుండే రెహమాన్, రామూర్తికి త్వరలో ప్రమోషన్ రావాలని దేవుడుని ప్రార్థించసాగాడు.

ఇంటికి తిరిగి వెళ్లేటప్పుడు రోడ్డుమీద పోయే కార్లని చూడడం, వాటి మంచిచెడ్డలు చర్చించుకోవడం, ప్రస్తుతం వాళ్ల దినచర్యలో ఒక భాగమైపోయింది.

"సార్! సార్! ఆ కారు చూడండి! ఎంత బాగుందో! మీకు ప్రమోషన్ రాగానే అటువంటి కారు కొనాలండీ!" అంటూ రోడ్డుమీద పోతున్న కారుని చూపేవాడు రెహమాన్.

రామ్మూర్తి అటువేపు చూసి "అవునోయ్! ఆ కారు చాలా బాగుంది! దాని పేరేమిటో!" అని అడిగేవాడు.

"అదా సార్! బహుశ 'బెంజ్' కారు అయివుంటుందండీ! దాని ఖరీదు ఎక్కువ వుండదు! కానీ చాలా బాగా పని చేస్తుందండీ!" అంటూ ఆ కారుని వర్ణించి చెప్పేవాడు.

రామ్మూర్తి ఆసక్తిగా వినేవాడు

కానీ నిజానికి రెహమాన్ కి కార్లగురించి ఏమీ తెలీదు. అయినా తెలిసినట్లు మాట్లాడేవాడు ఇదేకాదు — ఇంకేదైనా సరే — తనకు తెలీని విషయం ఏదీ లేదన్నట్లు మాట్లాడడం అతనికి అలవాటు

ఆఫీసులో — విస్కీ దగ్గర్నించి విమానాల వరకూ — ఎవరేది మాట్లాడినా—

"ఓ! అదా సార్! దాని విషయం నన్నడగండి చెప్తాను," అంటూ చిలవలు కల్పించి చెప్పేవాడు ఇక అవతలివాడు డంగైపోయి రెహమాన్ తెలివితేటల్ని తెగ మెచ్చుకునేగాడు

"రెహమాన్! నీకు కార్ల గురించి ఎలా తెలుసోయ్!" రామ్మూర్తి ఒకరోజు అడిగాడు

"నేను ఒకప్పుడు కారు డ్రైవరుగా పని చేశాను సార్!"

"అలాగా!" రామ్మూర్తి ఆశ్చర్యపోయాడు

రెహమాన్ డ్రైవరుగా పని చేసింది నెల

రోజులు మాత్రమే అదికూడా జీప్ డ్రైవరుగా. ఆఫీసరుగారి జీప్ డ్రైవరు శెలవు పెడితే రెహమాన్ ఆ స్థానంలో చేరాడు డ్రైవింగ్‌లో తనకెంతో నేర్పు వుందని ఆయన్ని నమ్మించి ఆ వుద్యోగం సంపాదించాడు. కానీ ఆ నెల రోజుల్లోనే అయిదు ఏక్సిడెంట్లయ్యాయి. జీపులో పాడవని భాగమంటూ ఏదీ మిగల్లేదు

ఆ ఆఫీసరు రెహమాన్‌ని నానాతిట్లుతిట్టి, ఆ జీపు బాగుచెయ్యడానికి అయిన డబ్బుని రెహమాన్ జీతం నుండి కట్ చేశాడు కానీ ఆ విషయం రెహమాన్‌ని ఎక్కువ బాధించలేదు తను ఆఫీసరుగారి జీపుని డ్రైవ్ చేశానని అందరితో గర్వంగా చెప్పుకునేవాడు

''రెహమాన్! నువ్వు డ్రైవర్‌గా పని చేశావు కాబట్టి నీకు కార్ల గురించి బాగా తెలిసే వుంటుంది'' అన్నాడు రామ్మూర్తి

''అవున్సార్! కార్ల పుట్టుపూర్వోత్తరాలన్నీ నాకు తెలుసు'' గర్వంగా చెప్పాడు రెహమాన్.

''అదుగో అటు చూడు! ఆ పచ్చకారు బాగుంది కదూ! నేనూ అటువంటిదే కొంటానోయ్!'' రామ్మూర్తి మరో కారుని చూపిస్తూ అడిగాడు

రెహమాన్ పెదవి విరిచాడు

''అబ్బే! అదంత బాగా పనిచేయదు సార్! మీకు మంచి కారు నేను సెలక్ట్ చేసిపెడతానండీ!''

''అలాగే'' రామ్మూర్తి బాధ్యతంతా రెహమాన్ మీద పెట్టేశాడు

ఇంటికి వచ్చినా రామ్మూర్తి మనసంతా ఆ కార్ల చుట్టూనే తిరుగుతుండేది. తను కారు కొంటే దాన్ని పెట్టుకోవడానికి ఈ ఇంట్లో బొత్తిగా స్థలం లేదు. గారేజ్, పెద్ద గేటు, వున్న మరో ఇల్లుని తీసుకోవాలి కారుకి డ్రైవరుని పెట్టుకోవడం శుద్ధ దండగ! తనే డ్రైవింగ్ నేర్చుకోవడం మంచిది అయితే తను కారు కొన్నాక డ్రైవింగ్ నేర్చుకోవాలా! ముందే నేర్చుకోవడం మంచిదా? ఇలా ఆలోచించేవాడు

ఈరోజు కూడా కారు గురించి ఆలోచిస్తుండగా —

''ఏవిటండీ! అలా కూర్చున్నారు?'' అంటూ రామ్మూర్తి భార్య పద్మ వచ్చి అతని ప్రక్కన కూర్చుంది.

''మరేంలేదు పద్మా! మనం కొనబోయే కారుని గురించి ఆలోచిస్తున్నాను''

ఆ మాట వినగానే పద్మ క్షణంసేపు స్తబ్దురాలైపోయింది. ఈయనకింకా ఈ పిచ్చి వదల్లేదా? ఈమధ్య ఈయన ప్రతిరోజూ, ప్రతి క్షణం కారు గురించే మాట్లాడుతున్నారు. అయినా కారు ఎలా కొందామని ఈయన వుద్దేశం? తమకేమీ ఆస్తులు లేవు ఆయన జీతం మీదే తను, ఇద్దరు పిల్లలు — బ్రతకాలి! అంతేకాక ప్రతినెలా వందరూపాయలు పల్లెటూళ్లో అన్నగారి దగ్గరున్న తల్లిదండ్రులకు పంపిస్తారు ఇక ఎలా కొంటారు కారు ఏవిటో? తన కసాధ్యమైన విషయం గురించి ఆలోచిస్తూ, ఆరోగ్యం పాడుచేసుకుంటున్నారు,అనుకుంటూజాలిపడింది!

''పద్మా! నాకు సూపర్నెంటుగా ప్రమోషన్ వస్తే కారు కొనగలనేమో కదా!'' ఆశగా అడిగాడు రామ్మూర్తి.

పద్మ మాట్లాడలేదు సూపర్నెంటు కాదు గదా, ఆఫీసరుగా ప్రమోషన్ వచ్చినా ఆయన కారు కొనలేరు అది తనకు తెలుసు అలా చెప్పి ఆయనని నిరుత్సాహ పరచలేదు అందుకే కారు గురించి చెప్పినప్పుడల్లా మౌనంగా వుండిపోతుంది, లేదా సంభాషణ మార్చేస్తుంది.

''పద్మా! రెహమాన్‌కి కార్లగురించి బాగా తెలుసు! అతడే ఒక మంచి కారు సెలక్ట్‌చేసి పెడతానన్నాడు పద్మా! కారు కొన్నాక మనం ప్రతి రోజూ షికారుకి వెళ్లాలి!''

ఇంతలో— ''డాడీ! ఈ లెక్క చెప్పవూ?'' అంటూ కూతురు రావడంతో రామ్మూర్తి మాటలు ఆగిపోయాయి.

రామ్మూర్తి, రెహమాన్ ఎదురు చూసిన సమయం వచ్చింది రామ్మూర్తికి సూపర్నెంటుగా ప్రమోషన్ వచ్చింది.

ఆ సాయంత్రం ఇంటికి తిరిగి వస్తున్నపుడు రెహమాన్ అన్నాడు.

''సార్! ఇక మీ కోరిక తీరినట్లేనండీ!''



# వాహనయోగం

తన కోరిక కూడా తీరబోతుందనే ఆనందం అతని మాటల్లో తొంగి చూసింది.

రామ్మూర్తి కూడా సంతోషంగానే వున్నాడు

"అవునోయ్! అదుగో రెహమాన్! అటు చూడు! ఆ కారు ఎలా వుందంటావ్?" రామ్మూర్తి అడిగాడు ఈ రోజు రామ్మూర్తి ఎంతో ధైర్యంగా రోడ్డుమీద పోతున్న కార్లను చూడసాగాడు.

కొద్దిదూరం నడిచి— ఇద్దరూ రోడ్డు ప్రక్కనున్న టీ స్టాల్‌కు వెళ్లి 'టీ' త్రాగారు. ఆ తర్వాత రామ్మూర్తి ప్రక్కగా పెట్టిన తన సైకిలు స్టాండు తియ్యబోతుంటే —

"పది పైసలకే మీ అదృష్టం తెలుసుకోండి రండి. రండయ్యా ఆలస్యం చెయ్యకండి. ఖచ్చితమైన జవాబు అబద్దానికి చోటు లేదు. ఒక్కసారి అడిగి చూడండి మీకే తెలుస్తుంది" అన్న మాటలు విన్పించాయి రామ్మూర్తి అటు చూశాడు

రెహమాన్ కూడా అటువైపు చూస్తూ— "సార్! ఒక్కసారి అక్కడకు వెడదాం రండి" అన్నాడు రామ్మూర్తికి కుతూహలం కలిగింది చిలకజోశ్యం మీద

ఇద్దరూ అతడి దగ్గరకు వెళ్ళి పదిపైసలిచ్చారు ఆ వ్యక్తి పంజరం తెరిచాడు చిలక తన కెదురుగా ఉన్న అట్టల్లో ఒకటి తీసి అతడి ముందు పడేసింది అతడు తీసి చదివాడు

"త్వరలోమీకొక గొప్ప యోగం కలుగును"

అది వినగానే రామ్మూర్తి పొంగిపోయాడు "రెహమాన్! విన్నావా? నాకు యోగం పడ్తుందిట! అంటే నాకు అపూర్వ వస్తువు ప్రాప్తిస్తుందన్నమాట!" అన్నాడు రెహమాన్‌తో.

"అంటే! మీరు త్వరలోనే కారుకొంటారు సార్! దీనికిక తిరుగులేదండీ!" రెహమాన్ అన్నాడు

ఇద్దరూ అక్కడ నుండి కదిలి ఇంటిదారి పట్టారు

"రెహమాన్! కారు కొనాలంటే కనీసం పాతికవేలన్నా వుండాలేమో?" అన్నాడు రామ్మూర్తి మధ్యదారిలో.

"అబ్బే! అంత అవసరం లేదు సార్ పదిహేను వేలయితే చాలుతుంది."

"అంత తక్కువలో కారు వస్తుందంటావా?"

"మీ కెందుకండీ! నేను చూసిపెడతాగా" అన్నాడు రెహమాన్ ధీమాగా రామ్మూర్తికి ఆశ్చర్యం కలిగించినా, రెహమాన్ మాటలని కాదనలేకపోయాడు రెహమాన్ తలుచుకుంటే ఏదైనా సాధించగలడని రామ్మూర్తి నమ్మకం "సరే రెహమాన్ ఇక భారమంతా నీమీదే పెట్టాను"

"ఏం ఫర్వాలేదు సార్! మీరు నిశ్చింతగా వుండండి! వారం రోజుల్లో మీరు కారు కొంటారు!" అన్నాడు రెహమాన్.

ఆ రాత్రి రామ్మూర్తి ఏవేవో లెక్కలు వేశాడు. రెహమాన్ పదిహేనువేలు అన్నాడు కానీ అంతా కలిపితే ఇరవైవేలు దాటుతుంది ఇప్పటికిప్పుడు తన చేతిలో ఇరవైవేలు వుండాలి! ప్రమోషన్ రావాలని కోరుకున్నాడు గానీ దాని వలన తనకు జీతంలో పెద్దగా పెరిగేదేమీ వుండదు ఇక కారు కొనాలంటే పి ఎఫ్ లోను తీసుకోవాలి పద్మక్కూడా తెలీకుండా తను ఇన్నాళ్లూ కడుతున్న రికరింగ్ డిపాజిట్ మీద కూడా లోను తీసుకోవాలి ఇంతా చేస్తే అంతా, కలిపి పదివేలు అవుతాయేమో! మిగతా డబ్బు ఎలా?

చూద్దాంకానీ, తనకు వాహన యోగం వున్నదనీ— అదికూడా త్వరలోనేననీ చిలకజోస్యం చెప్పింది కదా ఏమవుతుందో! అదృష్టం కలిసి వస్తే ఎక్కడినుంచైనా డబ్బు రావచ్చు! ఏం జరుగుతుందో చూడాలి.

అనుకుంటూ కళ్లు మూసుకున్నాడు

* * *

రెండురోజులు గడిచాయి.

ఒకరోజు సాయంత్రం, రామ్మూర్తి, రహమాన్ ఆఫీసు నుండి తిరిగొస్తున్నారు రామ్మూర్తి సైకిలు నడిపించుకొస్తుంటే — రహమాన్ ప్రక్కన నడుస్తున్నాడు.

"రెహమాన్, ఇవాళ ప్రొద్దున ఈ సైకిల్ కదలనంటూ కూర్చుందయ్యా! కష్టపడి నడిపించుకు తెచ్చాను!" అన్నాడు రామ్మూర్తి

"ఇంకెన్ని రోజుల్సార్, రేపో, మాపో కారు వచ్చేస్తుంది! ఈ సైకిలు నాకిచ్చేద్దురుగానీ!"

"ఈ డొక్కు సైకిలు నీ కెందుకయ్యా!"

"అబ్బెబ్బె! అలా అనకండి! ప్రస్తుతం ఇదే నాకు విమానం"

రామ్మూర్తి అతని మాటలు విన్పించుకోకుండా—

"రెహమాన్! అటు చూడు!" అన్నాడు రెహమాన్ చూశాడు

రోడ్డు ప్రక్కగా ఎవరిదో ఇంటి ముందు ఆగి వుందొక బిస్కెట్ కలర్ కారు సాయంత్రపు

## పట్టాలపై బస్సులు!

బస్సుల కోసం రోడ్లపై పట్టాలను నిర్మించాలని పశ్చిమ జర్మనీ ప్రభుత్వం ఆలోచిస్తున్నది దీనివలన నగరంలో బస్సులు అంతరాయం లేకుండా ఎక్కువ వేగంతో తిరగటానికి వీలుకాగలదు. దీని కోసం పశ్చిమ జర్మనీలోని క్రూప్ కంపెనీ ఫెర్రో కాంక్రీటు పద్ధతిపై పట్టాలను తయారుచేస్తున్నది.

సీరెండలో మిలమిలా మెరిసిపోతోంది.

"అవున్సార్! చాలాబాగుంది" రెహమాన్ మెచ్చుకున్నాడు.

"ఒక్కసారి ఆ కారు దగ్గరికెళ్లి చూద్దాం రా!" అంటూ రామ్మూర్తి కారుకి కొంచెం దూరంలో తన సైకిలుపెట్టి స్టాండు వేశాడు.

తను కారు దగ్గరకు వెళ్లాడు రెహమాన్ కూడా అతడితోపాటు కారు దగ్గరకు వచ్చాడు ఆ కారుకి సంబంధించిన వాళ్లెవరూ ఆ చుట్టు పక్కల కన్పించలేదు

రామ్మూర్తి ముందుకు వంగి స్టీరింగుని చూస్తున్నాడు

"సార్! ఈ కార్లో రేడియో కూడావుంది చూడండి!" రెహమాన్ రేడియోమీద చెయ్యి వేశాడు

రామ్మూర్తి రేడియోని ట్యూన్ చెయ్యబోయాడు.

ఇంతలో —

ఇద్దరి బుజాలమీద రెండు చేతులు పడ్డాయి వెయ్యి టన్నుల బరువు పడినట్లు ఇద్దరూ వంగిపోయారు

"దొంగనాయాళ్లల్లారా! కారుని దొంగిలిద్దామనుకుంటున్నారా!"

"లేదు సార్! మేం దొంగలం !" రెహమాన్ మాట పూర్తి కాకుండానే మరో దెబ్బపడింది ఇద్దరికీ స్పృహ తప్పింది

తిరిగి కళ్లు తెరిచేసరికి ఎదురుగా పోలీస్ స్టేషన్ గోడలు కన్పించాయి

పోలీసు ఇనస్పెక్టరు లాఠీతో ఇద్దరినీ తట్టుతూ — "మీ రిద్దరూ కొత్త దొంగల్లా వున్నారు. ఏ వూరు నుండి వచ్చార్రా మీరు?" అన్నాడు

"వారం క్రితం రెండు కార్లు పోయాయని మనకు రిపోర్టు వచ్చింది సార్! బహుశ వాటిని కూడా వీళ్ళే దొంగిలించి వుంటారు!" కానిస్టేబుల్ ఇనస్పెక్టరుతో అంటున్నాడు

రామూర్తికి తలకొట్టేసినట్లు అయింది సిగ్గు, అవమానంతో తలెత్తలేకుండా ఉన్నాడు.

రెహమాన్ భయంతో వణికిపోతున్నాడు. "లేదు సార్! మేం దొంగలంకాదు! ఆయన సెక్షన్ సూపర్నెంటుగారు! నేను ప్యూను ని. కావాలంటే మా ఆఫీసరుగారికి ఫోను చేసి కనుక్కోండి!" ఏడుపు గొంతుతో అన్నాడు రెహమాన్.

ఇనస్పెక్టర్ నమ్మలేదు.

"అయితే కారుదగ్గరి కెందుకెళ్లారు?"

రెహమాన్ ఏడుపు దిగ్రమింగి సమాధానం చెప్పాడు "సార్! అయ్యగారికి ప్రమోషన్ వచ్చింది! కారు కొనుక్కోవాలనుకుంటున్నారు! ఆ కారు బాగుంది. అటువంటిది కొనాలని వుందంటే దగ్గరికెళ్లి చూస్తున్నాం. అంతే సార్!" అన్నాడు



ఇనస్పెక్టర్ రామ్మూర్తిని పై నుండి క్రిందవరకూ చూడసాగాడు.

"ఈ కాలంలో ఎవరు దొంగలో ఎవరు దొరలో తెలీకుండా వుంది. ఏదీ మీ ఆఫీసరు నెంబరు చెప్పు!" అన్నాడు ఇనస్పెక్టర్.

రెహమాన్ చెప్పాడు.

ఇనస్పెక్టర్ ఫోను చేతిలోకి తీసుకుని డయల్ చేయసాగాడు. రెహమాన్ ఆయనవేపు ఆత్రంగా చూస్తున్నాడు రేపటినుండి ఆఫీసరు ముందు ఎలా తలెత్తుకు తిరగాలా అని ఆలోచిస్తూ మధనపడి పోతున్నాడు రామ్మూర్తి.

ఇంతలో—

"హల్లో ఇనస్పెక్టర్‌జీ! ఏంచేస్తున్నారు!" అంటూ నలభై ఏళ్ల వ్యక్తి లోపలకు వచ్చాడు

ఇనస్పెక్టర్ తలెత్తి అతనివేపు చూసి —

"డాక్టరుగారా! రండి, రండి!" అంటూ ఆహ్వానించాడు నవ్వుతూ.

డాక్టరు భానుమూర్తి కుర్చీలో కూర్చోబోతూ రామ్మూర్తిని చూసి —

"అరె! రామ్మూర్తిగారా! మీరిక్కడ వున్నారేమిటి?" అంటూ లేచి దగ్గరికొచ్చాడు.

"భానూ! ఈయన నీకు తెలుసా?" ఇనస్పెక్టర్ అడిగాడు.

'తెలియడమేమిటి! మా ఇద్దరిదీ ఎన్నో ఏళ్ల పరిచయం! ఇద్దరం ఒకే వీధిలో వుంటున్నాం వీరీమధ్యనే సూపర్నెంటుగా ప్రమోట్ అయ్యారు అంతేకాదు వీళ్ల ఆఫీసరు గారితో చెప్పి నాకొక మహోపకారం చేశారు కూడా! వీరికి నేనెంతో ఋణపడివున్నాను."

భానుమూర్తి గబగబా చెప్పాడు.

ఇనస్పెక్టర్ చేతిలోని ఫోన్ని తిరిగి పెట్టేశాడు.

"రామ్మూర్తిగారూ! మీరిక్కడ ఉన్నారెందుకు? అరె! నుదుటిమీద ఈ దెబ్బలేమిటి! ఏం జరిగింది?" భానుమూర్తి ఆత్రంగా అడిగాడు

"నేను చెప్తాను వినరా!" అంటూ ఇనస్పెక్టర్ జరిగింది చెప్పాడు.

"ఎంత పొరపాటు జరిగింది. ఒరేయ్ ఇనస్పెక్టరూ! అందరినీ దొంగలుగా భావిస్తే చాలా ప్రమాదంరా! చెవులనే కాదు కళ్లనీ వుపయోగించడం నేర్చుకో!" అన్నాడు భానుమూర్తి.

"అదికాదురా ఆ కారుగలాయన చాలా నమ్మించాడు"

"ఇంతకీ ఆయనేడీ?"

"లేడు! నెంబరిచ్చి వెళ్లిపోయాడు"

"సరే! జరిగిందేదో జరిగింది, నేను రామ్మూర్తిగారిని వాళ్లింటి దగ్గర దింపివస్తాను"

"సరే!" ఇనస్పెక్టర్ రామ్మూర్తి వేపు చూస్తూ — "సారీ! రామ్మూర్తిగారూ! పొరపాటయింది ఏమీ అనుకోకండి" అన్నాడు

రామ్మూర్తి మాట్లాడలేదు అతనింకా షాక్‌నుండి తేరుకోలేదు. రెహమాన్‌కి మాత్రం చాలా ఆనందంగా వుంది. "డాక్టరుగారి పుణ్యమా అని ఆపద నుండి బయటపడ్డాం. లేకపోతే ఎంత గొడవయి పోయేదో," అనుకున్నాడు.

భానుమూర్తి తన కారు దగ్గరకు వచ్చి — వెనక డోర్‌తీశాడు "ఎక్కండి మూర్తిగారూ," అన్నాడు.

రామ్మూర్తి, రెహమాన్ ఎక్కారు.

భానుమూర్తి వాళ్లను మొదట తన డిస్పెన్సరీకి తీసుకెళ్లి దెబ్బలు తగిలిన చోట



ధర్మపథం.

బులుసు వేంకటరమణయ్య



# మనః పరిశీలన

పెద్దవారి మనస్సు ఎటువంటిదో, వారి ప్రవర్తన వల్లనే తెలుసుకోవచ్చును. మంచి వారి మనస్తత్వాన్ని తెలుసుకోవడం కొంత కష్టమే! వారు కఠిన పరీక్షలకు నిలిచి ఉన్నప్పుడే యదార్ధ స్థితి బయట పడుతుంది మొదట కష్టాలు పడినా, అట్టి పరీక్షలకు నిలిచిన వారికి భగవంతుడు మేలు కలిగిస్తాడు

పూర్వం సుశీల అనే ఉత్తమురాలుండేది ఆమెకు దైవభక్తితోపాటు పతిభక్తీ, అతిథుల యందు ఆదరమూ ఎక్కువ తనకు లేకపోయినా అతిథిని తృప్తిపరచాలనే గట్టిసంకల్పం ఆమెది ఆమె భర్త పిసినిగొట్టులలో పిసినిగొట్టు ఇతరుల దగ్గర్నుంచి తృణమైనా రాబట్టడానికే చూస్తాడు కాని ఖర్చు చెయ్యడు. పై చోట్ల భోజనం చేస్తూ, భార్య తిండికి కాలబత్తెంగా ముక్కిపోయిన బియ్యం ఇచ్చేవాడు. ఆమెకు ఎప్పుడూ సగంకడుపుకే తిండి. ఎక్కువ వడ్డీకి అప్పులిచ్చి డబ్బుదాగా కూడబెట్టేవాడు. అప్పుల కోసం ఇతరులు అతనికి రకరకాల తినుబండారాలు బహూకరించేవారు. భార్యకు తెలియకుండా వాటిని అటకమీద దాచుకునేవాడు అది కనిపెట్టినా ఆమె వాటిని ముట్టుకునేదికాదు

ఒకనాటి ఉదయం అతడు గ్రామాంతరం పోతూ, రెండు, మూడు రోజులవరకూ రాననీ, కాలబత్తెంకంటే ఎక్కువ ఖర్చు చెయ్యవద్దనీ, గట్టిగా చెప్పి వెళ్లాడు అప్పుడొక పొట్టి బ్రహ్మచారి వచ్చి "అమ్మా! సహచగులతో తీర్థయాత్రకు బయలు దేరినాను నిన్నటినుంచీ తిండిలేదు. ఆకలివల్ల అడుగు ముందుకు పడలేదు. మా వాళ్లు ముందుకు సాగిపోయారు కడుపు దహించుకు పోతున్నది కాస్త అన్నం పెట్టి, ఇన్ని నీళ్లు ఇయ్యి" అని అడిగాడు. అతని అవస్థకు జాలిపడి, సుశీల భర్త విధించబోయే శిక్షకు సిద్ధపడి, అతని ఆకలే తీర్చుటకు సిద్ధపడి కొంచెంసేపు ఆగితే వంటచేసి అన్నం పెట్టెదనని చెప్పినది అతడు, ఒక్క క్షణం కూడా ఆగలేననీ, ప్రాణాలు పోతున్నాయనీ, కాస్త చలిది అన్నమున్నా పెట్టి ప్రాణాలు నిలపాలని ప్రాధేయపడ్డాడు. ఆమె, తాను రెండు, మూడు పూటల తినడానికి ఉంచుకున్న చల్ది అన్నం, పెరుగుపోసి, అతనికి పెట్టింది ఆ వటువు ఒక్క క్షణంలో దానిని తినిచేసి, 'ఆకలి కొంచెమైనా తీరలేదనీ, ఇంకా ఏమైనా ఉంటే పెట్టాలనీ, అడిగాడు. సుశీల "మరి అన్నం లేదు భక్ష్యాలున్నాయి" అన్నది. "అయితే మరీ మంచిది. తె"మ్మన్నాడు ఆ వటువు. తన భర్త అటకమీద దాచి ఉంచిన భక్ష్యాలు ఆమె తెచ్చి ఇచ్చింది. అతడు క్షణంలో వాటిని ఖాళీచేసి ఆకలి తీరలేదని మొగం వేలవేశాడు. అతడు ఆ వేషంతో ఆమెను పరీక్షింపవిచ్చిన శ్రీహరి కాని, మరొకడు కాడు. ఆమె, ఆ వ్యక్తి సామాన్య మానవుడు కాదని గ్రహించి "ఉండండి. వేగంగా వంటచేసి పెడతా"నని సమ్మతింపజేసి, అగ్నిదేవుని ప్రార్థించగా, ఆమె పాతివ్రత్య ప్రభావంవల్ల వంట యింట్లో సమృద్ధిగా సర్వ పదార్థాలూ సిద్ధమైనవి. అప్పుడు మాయావటువు శ్రీకృష్ణుడుగా మారి, ఆమె భక్తికీ, ఆతిథ్యానికీ ఎంతో మెచ్చుకుని "ఓ పతివ్రతా! నీ సహనభావానికీ, ఆదరణకూ, భక్తికీ చాలా సంతోషించాను. నిన్ను పరీక్షించడానికే మాయా వటుడనై వచ్చాను ఇకమీద నీ భర్త నిన్నెంతో గౌరవంగా చూస్తూ, త్యాగపరాయణుడై ఉంటాడు— మీరు కలకాలం సుఖంగా ఉండి, పుత్ర పౌత్రులతోనూ, సిరిసంపదలతోనూ ఆనందిస్తూ, అంతమునందు నా సాన్నిధ్యాన్ని పొందగలరు. నీ విందు శబరివిందుకన్నా, ద్రౌపది విందుకన్నా నన్నెంతో ఆకర్షించింది" అని చెప్పి అంతర్ధానం పొందాడు.

సుశీల అట్టి కఠిన పరీక్షలకు నిలిచి ఉండుట వల్లనే భగవదనుగ్రహాన్ని పొందగలిగినది. ★

మందువేసి కట్లు కట్టాడు. ఆ తర్వాత రామ్మూర్తి ఇంటి దగ్గరికి తీసుకెళ్లాడు

రామ్మూర్తి, రెహమాన్ కారు దిగి ఆయనకి కృతజ్ఞతలు చెప్పారు కారు కదిలి పోయింది

పద్మ కారు చప్పుడు విని గుమ్మం దగ్గిరికి వచ్చింది

"ఎవరిదండీ ఆ కారు?" అంది లోపలి కొస్తున్న భర్తని చూస్తూ.

"మనది మాత్రం కాదులే" చిరాకు పడుతూ లోపలకు వచ్చాడు రామ్మూర్తి

"ఆదేమిటండీ ఆ కట్లేమిటి? ఏమయింది?" పద్మ కంగారుగా అడిగింది

సమాధానం చెప్పకుండా రామ్మూర్తి కుర్చీలో కూర్చున్నాడు

"అయ్యగారి సైకలుకి యాక్సిడెంటయిందమ్మా!" అన్నాడు రెహమాన్

"ఏం ప్రమాదం లేదుగదా!" అంది రామ్మూర్తి నుదుటిమీద చెయ్యి వేసి

"ఏం లేదులే!" అన్నాడు రామ్మూర్తి

## వాహనయోగం

కుర్చీలో వెనక్కివాలి కళ్లు మూసుకుంటూ.

"ఇంతకీ మీ సైకిలేదీ?" అడిగింది పద్మ

రామ్మూర్తి వులిక్కిపడి కళ్లు తెరిచాడు

"అవును! తన సైకిలేదీ? ఆ కారు దగ్గరే స్టాండువేసి నిలిపాడు! నలుగురూ తిరిగే రోడ్డు అది ఇంకా వుంటుందా?" అనుకుంటూ రెహమాన్ వేపు చూశాడు.

రెహమాన్ అతని చూపుల్లోని భావాన్ని గ్రహించి "సార్! ఆ సైకిలుని నేనిప్పుడే తీసుకొస్తాను" అంటూ వెళ్లిపోయాడు.

కానీ అతడా రాత్రి మళ్లా రాలేదు రామ్మూర్తి తనకిక సైకిలు లేదని నిర్ధారించుకున్నాడు

* * *

మర్నాడు వుదయం తొమ్మిదిగంటలకు రెహమాన్ రామ్మూర్తి దగ్గరకు వచ్చాడు.

రామ్మూర్తి పద్మతో చెప్పి ఆఫీసుకు బయలుదేరాడు ఇద్దరూ మౌనంగా నడవసాగారు

"సార్! మీ సైకిలు కన్పించలేదండీ" రెహమాన్ మెల్లగా చెప్పాడు.

రామ్మూర్తి మాట్లాడలేదు.

ఇద్దరూ పదిగజాల దూరంలో మన్న బస్సుస్టాపుకి వచ్చారు. బస్సు రెడీగా వుంది. ఇద్దరూ బస్సు ఎక్కారు.

"పదిపైసలకే మీ అదృష్టం తెలుసుకోండి రండి సార్! రండి!" మాటలు విన్పించి రామ్మూర్తి కిటికీలో నుండి బయటికి చూసాడు.

అతని మనస్సులో ఏదో భావం తళుక్కుమంది హఠాత్తుగా అన్నాడు—

"రెహమాన్, మనకు దిగులెందుకయ్యా! మనం కోరుకున్నట్లుగానే మనకు వాహన యోగం పట్టింది కదా! లక్షరూపాయలు ఖరీదు చేసే ఈ బస్సులో రోజూ ఎక్కి ఆఫీసుకెళ్లడం నిజంగా ఎంత అదృష్టమో తెలుసా!" అని నవ్వాడు.

కానీ రెహమాన్ నవ్వలేకపోయాడు. అతని కళ్లముందు రామ్మూర్తి సైకిలు మెదులుతోంది

"ప్చ్! వాహన యోగం!" అనుకున్నాడు రెహమాన్ విచారంగా. ★

సీరియల్

# జీవన మురళి

## కొండముది శ్రీరామచంద్రమూర్తి



(గత సంచిక తరువాయి)

జరుగుతున్నది చూసి కొందరు 'తమకేల ఈగోల' అనుకొని వెళ్లిపోయారు మరి కొందరు వెళ్ళిపోవడానికి సిద్ధమౌతున్నారు. వాళ్ళ దృష్టిని ఆకర్షిస్తూ ఇంద్రసేన్ పెద్దగా అన్నాడు "మీ దేవుడు మాష్టారు ఏంచేశారో తెలుసుకోవాలని లేదా మీకు ?" వెళ్ళే వాళ్ళు కూడా ఆగి అతను ఏం చెబుతాడోనని చెవులొర బెట్టుకున్నారు ఒకరిద్దరు "మాష్టార్ని ఇందులోకి లాగవద్దులెండి !" అన్నారు, హితవు చెబుతున్నట్లు

"నేను లాగడం లేదండీ! అయనే రొంపిలో దిగడ్డాడు మొన్న సాయంకాలం తెలిసింది నాకు, హైస్కూలు నుండి స్పెషల్ ఫీజు ఎక్కౌంటు నుండి అయిదువేల రూపాయలు విత్‌డ్రా చేసి ఇంటికి పట్టుకువెళ్ళాట్ట ఆయన. అట్లా స్కూలు డబ్బును, అంత పెద్దమొత్తాన్ని, ఇంటికి తీసుకుపోవచ్చునా అన్నది మొట్టమొదటి పాయింటు సరే తీసుకుపోయాడయ్యా, మళ్ళీ మర్నాటికల్లా ఆదేం చేసిందీ మనకు తెలియపర్చవద్దా ? అడగండి ఏం చేశాడో ?"

"ఏమిండీ ఏం చేశారూ ?" ఒకటి రెండు పెద్ద తలకాయలు ప్రశ్నించాయి పరమేశ్వరం తలవొంచుకున్నాడు ఆయనకు అది ఆత్మహత్య కాదు, చైతన్య రహిత స్థితీకాదు జరుగుతున్నది తెలుస్తూనే వుంది, తెలియకుండా పోతోనూ వుంది మనిషి పాతాళంలోకి కుంచించుకుపోతున్నాడు ఆయన సమాధానం చెప్పలేదు.

మళ్ళీ ఇంద్రసేనే అంటున్నాడు. "రెండో పాయింటు వుంది చూశారూ, అదే అసలు దారుణం ఆ సొమ్ము అప్పుడే స్వాహా అయిపోయిందట ఎవరో ఇంటికివస్తే, ఆ డబ్బిచ్చి పంపించేశాట్ట వాళ్ళను. నేను చెప్పింది అబద్ధం అని చెప్పమనండి మీ ఆదర్శాల అయ్యవారిని ! మహాలక్ష్మి విషయం కాదనమనండి ఆ అయ్యవారి ముద్దుల కొడుకును ! !"

మురళీకృష్ణకు ఆవిధంగా శాపాదపీ శరాదపీ మాట్లాడుతున్న ఆ దుర్మార్గుడి నోటిపళ్ళు రాలకొట్టాలనిపిస్తోంది ఇంద్రసేన్ నాలుకను వేయి ముక్కలుగా చీల్చివేయాలన్న ఉద్రేకంగా వుంది కానీ అతనిప్పుడు జనం మధ్య వున్నాడు. ఇంద్రసేన్ జనంబలంతో, స్థానబలంతో పై చేయిగా వున్నాడు

ఇహ తానూ, తన తండ్రీ సమర్థించుకోలేని విషాదస్థితిలో పడిపోయారు. ఇంతసేపూ అతను జీవన గురించి ఆలోచించలేదు తీరా ఆమె వున్న వేపు చూస్తే, జీవన అక్కడలేదు ఎప్పుడో మంటపం దిగి వెళ్ళిపోయింది ఇంటికి. నమ్మి వెళ్ళిందా ? నమ్మక వెళ్ళిందా ? అతనికి అర్థం కాలేదు.

"నిధుల దుర్వినియోగం కింద పరమేశ్వరం గారిని తక్షణం సస్పెండు చేస్తున్నాను. మీకేమన్న అభ్యంతరమా ?" ఇంద్రసేన తన వేపు మొగ్గిన విద్యార్థులను ప్రశ్నించాడు ఏ విద్యార్థీ అభ్యంతరం ప్రకటించలేదు పరమేశ్వరాన్ని సపోర్ట్ చేయలేదు

"మురళీకృష్ణ – మహాలక్ష్మిగారల వ్యవహారాన్ని మనం మరింత గాఢంగా, నిశితంగా పరిశీలిద్దాం. ప్రస్తుతానికి జీవనతో అతని పెళ్ళి ఆగిపోయింది, కాదు, మీరు ఆపేయగలిగారు కాబట్టి; ఉత్తరోత్తరా ఏంచేయాలో త్వరలోనే నిర్ణయం చేద్దాం ! ఏమంటారు ?"

"అట్లాగే చెయ్యండి !" అక్కడున్న వాళ్ళందరూ తలలాడించారు.

విజయగర్వంతో ఇంద్రసేన్ మురళీకృష్ణ వేపు చూశాడు "బళ్ళోడలౌతాయి, ఓడలు బండ్లవుతాయి కదూ ?" అన్నాడు వెటకారంగా పరమేశ్వరం దగ్గరకు వెళ్ళాడు "రేపొద్దున్న స్కూలు ప్యూను తమ ఇంటికి వస్తాడు తాళాలిచ్చి పంపించండి." అన్నాడు వర్ధనమ్మతో కూడా ఏదో అందామని ఆమె దగ్గరకు వెళ్ళబోయాడు ఆమె నోటికి పమిటచెంగు అడ్డం పెట్టుకుని కుళ్ళి కుళ్ళి ఏడుస్తున్నది

ఇంద్రసేన్ మహాలక్ష్మితో అన్నాడు "ఈ రాత్రికి ఇంద్రభవన్‌కు వచ్చి రెస్ట్ తీసుకో మహాలక్ష్మీ ! ఈ మహాజనం అంతా నీకు జరిగిన అన్యాయం సంగతి తెలుసుకున్నారు కదా ? నీకు న్యాయం జరిగేలా చూచే భారం నాది. ఆ సంగతి నాకొదిలేసి నువ్వు నిశ్చింతగా వుండు"

ఆమెను రెక్కపట్టుకుని లేవనెత్తి, కారు దగ్గరకు తీసుకువెళ్ళాడు కారు కదలగానే అతని మనుషులూ అక్కడినుండి పక్కకు తప్పుకున్నారు వాళ్ళు వెళ్ళిపోగానే ఆహ్వానితులందరూ రకరకాలుగా వ్యాఖ్యానాలు చేసుకుంటూ వెళ్ళిపోయారు

పెళ్ళిపందిరి నిర్జనమైంది నిర్జీవమైంది నిరలంకారంగా మిగిలింది

నీరవ, నిశ్శబ్ద దుఃఖ జలధిలో వున్న కన్నతండ్రిని, మెల్లగా దగ్గరకు పొదువుకున్నాడు మురళీకృష్ణ ఆ తండ్రీ కొడుకుల దగ్గరకు వచ్చింది వర్ధనమ్మ.

ఎవరు ఎవరితో ఏం మాట్లాడాలో ఎవరికీ

**జరిగిన కథ – 13 :** మురళీకృష్ణ జీవనకు పుట్టినరోజు కానుకగా రాధాకృష్ణ బొమ్మ ఇస్తాడు ఇంద్రసేన్ పుట్టినరోజు సందర్భంలో అతను ప్రారంభించబోతున్న అభాగ్యుల కళాలయంకు విరాళంగా జీవన ఇంద్రసేన్ ఇచ్చిన ఉంగరాన్ని తిరిగిఅతనికి ఇచ్చేస్తుంది. పాటల మహాలక్ష్మితో కలసి పాట పాడుతూ జీవన, మురళీకృష్ణ తనకు హితబోధ చేయడం వినిమండి పడతాడు ఇంద్రసేన్ పేరంటానికి వచ్చిన నాగలింగం భార్య జీవన పుట్టుపూర్వోత్తరాలు అక్కడి వారందరికీ వివరిస్తుంది అందరూ ఆ కార్యక్రమం పూర్తవకుండానే వెళ్లిపోతారు. మురళీకృష్ణ వర్ధనమ్మను శాంత వచనాలతో సమాధాన పరుస్తాడు జీవనను అత్యాచారం చేయబోయిన ఇంద్రసేన్ బారినుండి రక్షిస్తాడు మురళీకృష్ణ. జీవన, మురళీకృష్ణల వివాహం మహాలక్ష్మి సహాయంతో ఆపుచేస్తాడు ఇంద్రసేన్

మాటలు రావడంలేదు దుఃఖం మాటలను మింగేస్తోంది జరిగింది అన్యాయమని ముగ్గురికీ తెలుస్తోంది ఈ అన్యాయాన్ని ఎదుర్కోలేక పోయిన తమ నిస్సత్తువపై అసహ్యం వేస్తోంది ముగ్గురూ ఒకరినొకరు ఆసరా చేసుకుని అడుగులో అడుగువేస్తూ ఇంటివేపుగా నడిచారు

గుమ్మం దగ్గరే జీవన ఎదురైంది వాళ్ళకు వర్ధనమ్మను చూసి పసిపిల్లలా వెళ్ళి కౌగలించుకుంది "ఆ అయిదువేలూ నాకోసమని ఆ బట్టతలాయనకు ఇవ్వకపోతే మామ్మగారికి ఈ అవమానం జరిగేది కాదుగదా ?" అన్నది వెక్కిళ్ళతో

"జరగాల్సిన విధి వున్నప్పుడు ఇట్లా కాకపోతే మరొకలా జరుగుతుంది" అన్నాడు పరమేశ్వరం

ముగ్గురూ హాలు దాటి దేవుడి గదిదాకా వచ్చారు అకస్మాత్తుగా అక్కడ వెనక్కుతిరిగి పరమేశ్వరం అడిగాడు "ముందిది చెప్పు అబ్బాయిమీద వచ్చిన అభియోగం గురించి ఏం అనుకుంటున్నావ్ ?"

జీవన ఆ ప్రశ్నకు నోటితో సమాధానం చెప్పలేదు తన దగ్గర అంతవరకూ భద్రంగా దాచుకున్న మంగళసూత్రాలను బయటికి తీసి మురళీకృష్ణకు అందించింది "మా ఇద్దరి జీవితాల్నూ విధి ఏనాడో కలిపేసింది అవి అనుమానాలకూ, కార్పణ్యాలకూ అతీతాలు !" అన్నది ఆ మాటల్ని పరమేశ్వరం తృప్తిగా విన్నాడు జీవన – మురళిని దేముడి గదిలోకి తీసుకువెళ్ళాడు "ఆ భగవంతుడికి నమస్కరించి ఆలుమగలుకండి మురళీ! అమ్మాయికి తాళిబొట్టు కట్టు!" వారి మనసుల్లో మాంగళ్యం తంతునానేనా మమజీవనహేతునా అని వినిపిస్తోంది అవతలి గట్టునుండి మురళి తల్లి కోడల్నీ, కొడుకునూ ఆశీర్వదిస్తోంది వర్ధనమ్మ కళ్ళు తుడుచుకుంటూ ఆ ఆలుమగల తలలమీద అక్షతల నుంచి దీవించింది.

## 17

ఎట్టకేలకు జీవన – మురళి ఆలుమగలయ్యారు చుట్టూ చిమ్మ చీకటి కమ్ముకున్నప్పుడు వంటరి తారక పక్కన నవ్వి రవంత వెలుగును విరజిమ్మినట్లుంది వారికి జీవనమెళ్ళో మూడుముళ్ళూ దైవసన్నిధిలో వేసి, తమకోసం కేటాయించిన పడమటి గదిలో, తాతలనాటి పెద్ద పందిరి పట్టె మంచంమీద మొదటి రాత్రి సుఖంకోసం మోహనంగా కాలు మీద కాలువేసుకుని జీవనకోసం, జీవన భాగస్వామి కోసం, రమ్య జీవనకోసం, చిద్విలాసంగా ఎదురు చూస్తున్నాడు మురళీకృష్ణ. పెళ్ళికి చేసిన తీపి వంటకాలను పళ్ళేలనిండా పెట్టి గదిలో అందుబాటులో వుంచింది వర్ధనమ్మ

"ఒరేయ్ మనవడా! ఒక్కస్వీటు మిగిల్చినా వూరుకునేది లేదుసుమా !" అన్నది తర్జనితో బెదిరిస్తూ.

"బామ్మా! రాత్రంతా ఈ స్వీట్లు తింటూ గడపమంటావేమిటి ?" అన్నాడు శోభనం పెళ్ళికొడుకు అర్థాంతరం భావనలో

"కొంటెవాడా, బామ్మతో న్రటా సరసాలు ?" పరమేశ్వరం ముద్దుగా మందలించాడు

ఇంకా జీవన గదిలోకి రాలేదు చప్పున మురళీకృష్ణ మంచం దిగాడు సిగ్గుగా తల వొంచుకున్నాడు. తనఎత్తు కొడుకుని చూసుకుని క్షణంసేపు, గంట క్రితం జరిగిన విషాదానుభవాన్ని కొంత మర్చిపోయాడు పరమేశ్వరం కొడుకుని దగ్గరకు తీసుకుని ప్రేమగా నుదుటిపై ముద్దు పెట్టుకున్నాడు. "పిల్లాపాపలతో సుఖంగా వుండాలిరా తండ్రీ నువ్వు !" అంటూ మనస్ఫూర్తిగా దీవించాడు. మళ్ళీ అన్నాడు ఆప్యాయత నిండిన పూర్ణ కంఠంతో "తండ్రీ! ఈ సమయంలో అమ్మాయికి కొంగున బంగారం కట్టడం సంప్రదాయం ఇదిగో మీ అమ్మ నగలపెట్టె ఆ నగలన్నీ అమ్మాయికి అలంకరించు అలంకరణ పూర్తయిన తర్వాత కోడలిచేత అమ్మకు మొక్కించు ఎక్కడవున్నా ఆవిడ చల్లగా చూస్తుంది మీ ఇద్దర్నీ !"

పరమేశ్వరం బయటికి వెళ్ళిపోయాడు వర్ధనమ్మ తలుపు అవతల తలవంచుకుని సిగ్గుసిగ్గుగా నిలబడ్డ జీవన చెంపలు పుణికి, "ఈ ఇంట్లో పసిబిడ్డ పారాడి ఎన్ని సంవత్సరాలైందో! నా ముచ్చట తొందర్లోనే తీరుస్తావు కదూ ?" అని అడిగింది మామగార్ని చూసి కొంగు బుజం మీదకు లాక్కుని, గభాలున వంగి ఆయనకు పాదాభివందనం చేసింది జీవన "విన్నావు కదమ్మా మా అమ్మ కోరిక ? నా కోరికా అదే!" అంటూ ఆయన కోడలి తలపై చెయ్యి నుంచి ఆర్ద్రంగా ఆశీర్వదించి అవతలకు వెళ్ళిపోయాడు

ఆయన వెళ్ళిపోయింతర్వాత కూడా ఇంకా అక్కడే తల వొంచుకు నిలబడ్డ జీవన చేతికి పాలగ్లాసు ఇచ్చి "ఇది సిగ్గుపడే సమయం కాదే



మనవరాలా! నేను వచ్చి నిన్ను దిగబెడుదును గానీ, నాకీ వెధవరికం వొకటి అడ్డుగా వుండి పోయింది గదా? ఇంక ఈ ఇంట్లో మరీ ఇతర ఆడంగులూ లేరాయె అంచేత సిగ్గుపడకు నువ్వే అన్నీ అయి, అన్నీ అనుకుని, గదిలోకి వెళ్లు— అందాలను మూటగట్టుకుని, ఆనందాలను పంచుకో. వెళ్ళు తల్లీ!''

గదిలోకి వచ్చిన జీవన తలుపు దగ్గర నిలబడిపోయింది. వర్ధనమ్మ బయట నుండి త లు పు లు వేసేసింది ఆమెను చూసిన మురళీకృష్ణ ఆనంద విభ్రాంతితో మునిగిపోయాడు. ఎంత అందంగా వుంది జీవన! ఆమె తల్లో మల్లెలు ఆమె నల్లని కురుల నల్లదనాన్ని మరింత నల్లబరుస్తున్నాయి ఆమె కట్టుకున్న ఎర్రని అంచున్న తెల్లచీర ఎర్రని పెదిమల తెల్లమొహానికి దీటుగా వుంది ఆమె వెండి తీగిలా వుంది ఆమె దగ్గరకు వస్తుంటే వెన్నెలవేడి తగుల్తోంది.

ఆమె అందించిన పాలగ్లాసులో సహంతాగి మిగిలిన సగాన్ని ఆమె పెదిమలకు సుతారంగా అందించాడు మురళీకృష్ణ ఆమె చేత ఓ తీపి పదార్థాన్ని కొంత తినిపించి మిగిలింది తను పుచ్చుకున్నాడు మంచం మీదంతటా మల్లెలు, గులాబులూ చల్లి ఆమెను మహారాణిలా వాటిమీద కూచోబెట్టాడు ''పెళ్లిలో తలంబ్రాల తరువాత పుష్పాభిషేకం చేయమని స్నేహితులు పువ్వులు పంపించారు వీటికి— ఈ రకంగా సార్థకత కలిగింది!'' అన్నాడు తృప్తిగా

''జీవనా! పువ్వులు మృదువా, నీ తనువు మృదువా?'' అన్నాడు కొంతసేపటికి

''జీవనా! బాపూ బొమ్మ సుందరమా, నీలో దాగిన వంపుల గీతలు సుందరమా?'' అన్నాడు మరికొంత సేపయింతర్వాత.

ఇంకా కొంత సేపటికి వారిద్దరి మధ్యా మాటల అవుసరం తొలిగిపోయింది. రెండు గుండెలూ ఒకే గుండెలా శ బ్దిం చ డం మొదలెట్టాయి తనువులపై పులకలు పూవులు పూచాయి ఆమె యౌవనం అతనికి ఉత్తేజమిచ్చింది. అతని మగసిరి ఆమెకు సంతృప్తినిచ్చింది ఇద్దరూ కాలాన్ని మరచిపోయి, కలల్ని ఇలపైకి తెచ్చుకుని, తీపి గురుతుల్ని అందించుకుంటూ, తీయని రాత్రిని గడిపారు ఆ తీపిదనం, మర్నాడు ప్రొద్దున్న ఎనిమిదైనా వాళ్లకు మెళకువ రానీయలేదు అప్పటికి సూర్యుడు ప్రొద్దునే బారెడు దూరంపైకి వచ్చేశాడు.

''వాళ్ళిద్దరికీ కాఫీ గ్లాసు ఇస్తే బావుంటుందేమో!'' అన్నాడు పరమేశ్వరం ప్రకాశంగా ఇహ వాళ్ళిద్దర్నీ లేపితే వుంటుందన్న ధ్వనితో. ''నువ్వు లేపడం బావుండదు లేచీ లేవగానే నా మొహం వాళ్ళు చూడడం నాకిష్టంలేదు.'' వర్ధనమ్మ అన్నది అప్పటికే ఆమె మడిగట్టుకుని దేవుడిముందు కూచోబోతున్నది

''అయితే ఒక పని చెయ్యవే అమ్మా— ఆ చేసే పూజ కాస్త పెద్దగా చెయ్ ఈ పూటకు. నీ కీర్తనల్ని, పాటల్ని, దండకాన్ని విని వాళ్ళు బయటకు వస్తారు''

''నువ్వూ నీ సంధ్యావందనం కాస్త పెద్దగా చేసుకోరాదూ?''

అట్లా ఆయన చేసిన సంధ్యావందనం వింటూ, వర్ధనమ్మ చదువుతున్న వెంకటేశ్వర సుప్రభాతం వింటూనూ జీవన లేచింది కిటికీ సందులగుండా బయటి వెలుగు తళుక్కుమనడం చూసి, తత్తరపడుతూ, ''ఏవండీ! లేవండీ!'' అంటూ మురళిని లేపింది

మురళీకృష్ణ మరోసారి ఆమెను గుండెలపైకి లాక్కున్నాడు వెయ్యిన్నొక్కోసారి ముద్దు పెట్టుకున్నాడు 'వదలండీ!' అన్నది జీవన వయ్యారాలుపోతూ

''పొద్దున్నే పెట్టుకున్న ముద్దు వద్దన్నా బావుంటుంది. వదలను'' అన్నాడతను

''అవతల మావయ్యగారూ, మామ్మగారూ లేచారండీ, పూజ చేస్తున్నారు పెద్దగా, బహుశా మన్ని నిద్దర్లేపడానికేనేమో!'' ఆ అమ్మాయి కంగారు పడింది

''కంగారుపడకే బేలా, ఇది ఆలుమగల హేల!''

''హేల కాదు, గోల!''

ఆమె మంచం దిగి మెల్లగా తలుపులు తీసి, తల బయటికి పెట్టి హాల్లో మామగారు కనబడకపోవడంతో, ధైర్యంగా, చక చక నడిచి దొడ్లోకి వెళ్ళిపోయింది ఆమె వెళ్ళిన ఓ పది నిముషాలకు మురళీకృష్ణ గదిలోనుండి బయటకు వచ్చాడు రోజంతా వారిద్దర్నీ అపురూపంగా చూసింది వర్ధనమ్మ పరమేశ్వరం కొడుకువైపు నవ్వుతూ చూసి ''ఎంజాయ్ మై బాయ్, ఎంజాయ్' అని లోపల అనుకుని పైకి ''అబ్బాయ్, పట్నం వెళ్ళి డీయీవోగార్ని కలుసుకొస్తే ఎట్లా వుంటుందంటావ్?'' అని అడిగాడు

''ముందా డబ్బు కట్టేయ్యాలి నాన్నా! కట్టేసింతర్వాత, అప్పీల్ పెట్టుకుంటే ఏదన్నా కొంత లాభం వుంటుంది!''

''అది కాదురా, డీయీవో నాకు బాగా తెలుసు చిన్నప్పుడు వాడూ నేనూ కలసి చదువుకున్నాం!'' అది ఆయన పైకి చెప్పిన కారణం అసలు కారణం మిగిలిన రెండు రోజులూ ఆ కొత్త దంపతులకు శోభనం రాత్రుల్ని, పూర్తి ఏకాంతానికి విడిచిపెట్టేయాలని ఆయన ఉద్దేశ్యం వర్ధనమ్మంటే పెద్ద దిక్కు, పైగా ఆడమనిషి ఇంట్లో సాయం అవసరం.

''అట్లాగే కలుసుకురండి నాన్నా!''

పరమేశ్వరం మధ్యాహ్నం బస్సుకు జిల్లా ముఖ్య పట్టణానికి వెళ్ళిపోయాడు రెండురోజుల తర్వాత గాని ఆయన తిరిగిరాలేదు

ఈ రెండు రోజుల్లోనూ, జీ వ న ను మురళిని మంచం దిగనీయలేదు జీవన—మురళిల్ని గదిదాటి బయటికి రానీయలేదు వర్ధనమ్మ.

వాళ్ళు 'ఇది కావాలి' అని అడక్కముందే ప్రతిదీ గదిలో హాజరుగా వుంచేది. కాఫీల దగ్గర్నుంచి రాత్రికి పూలచెండ్లవరకూ సమస్తం ఆమె సిద్ధంచేసి వాళ్ళకు అందజేసింది జీవనకు దగ్గరుండి స్నానం చేయించింది తనే స్వయంగా మొగలిపూల జడవేసింది పూటపూటకూ చీర మార్చి కట్టించింది. వంటికి అత్తరు పరిమళాలు వ్రాసింది కంటికి కాటుక దిద్దింది. మార్చి మార్చి బొట్టుపెట్టింది.

''ఆమె ఋణం ఎట్లా తీర్చుకోగలను నేను?'' అన్నది భర్తపరిష్వంగంలో కరిగిపోతూ జీవన వర్ధనమ్మ ఆమెకో దేవతగా భాసిస్తోంది

''వేరీ సింపుల్! ఓ మునిమనమణ్ని ఇచ్చేయ్!''

''ఓహో, ఈ మురళీకృష్ణుడుగారికి ఓ బాలకృష్ణుడుగారు కావాలని ఆశగా వుందన్న మాట!''

''నా కోసం కాదోయ్, మా నాన్న కోసం, మా బామ్మ కోసం! వాళ్ళ ఆశలన్నీ నామీదే పెట్టుకుని బ్రతుకుతున్నారు వాళ్ళు ఈ ఇంట్లో ఇంకో క్రొత్త జీవి అవతరిస్తే, నాకు కొంత రిలీఫ్ వస్తుంది వాళ్ళకూ కా ల క్షే పం గా వుంటుంది!''

''నాథా! అనుగ్రహించెదను లెండు, భయపడకుడు!'' ఆమె రాజరాజేశ్వరిలా అభయ ముద్ర పట్టింది

''ఏయ్, ఏయ్, అప్పుడేనా? కొంతకాలం ఆగుదాం పిల్లలకు!! ఏదో మాట వరుసకన్నాను!''

''మాట వరుసకన్నా, సీరియస్‌గా అన్నా, అందులో తప్పేముందీ? ఈ రోజుల్లో పిల్లలు కావాలనుకోడం, అక్కర్లేదను కోడం మన చేతుల్లోనే వుంది కదా? మీ ప్రయత్నం మీది, నా అవకాశం నాది!''

''ఛా—పో— చిలిపిదానా!'' అతనామెను పట్టుకోబోయాడు అతనికి దొరక్కుండా ఆమె అతణ్ని తన పొడవైన జడతోకొట్టింది పువ్వుల దెబ్బలకే బెదరిపోయినట్టు గాయపడినట్టు అతను అభినయించాడు. అతని అభినయం చూవి భయపడినట్టు ఆమె అతనికి దగ్గరగావచ్చి, కౌగలిలో మరోసారి గువ్వపిట్టలా వొదిగిపోయింది వాళ్ళకు మూడు క్షణాల్లా గడిచిపోయాయి మూడు పగళ్ళుకూడా మూడురాత్రులయ్యాయి. పగలూ, రాత్రీ కలిసి కూడా వారికి చాలని దినం అయింది

పరమేశ్వరం ఇంటికి తిరిగి వచ్చాడు ఆయన తిరిగి వచ్చిన రోజే ఆయనకూ, మురళికీ కలిపి జాయింటుగా వో రిజిష్టరు నోటీసు వచ్చింది పోస్టులో


ఈ ఏడు వెలుగులు
వెదజల్లే సమయమిదే.
ఈ సుసమయంలో మీఆనందోత్సాహాన్ని
వ్యక్త పరచండి హెచ్‌ఎంటి తో.
hmt వాచ్‌లు. ప్రతి ఒక్కరికోసం ఒక్కొక్కటి తయారు చేయబడ్డాయి.
వాచ్ డివిజన్
hmt
దేశానికి సమయాన్ని
సూచించువారు
ఫ్యాక్టరీలు :
బెంగళూరు(I & II),
శ్రీనగర్, తుంకూరు.
CLARION HMT/83120

"మనకు నోటీసేవిట్రా?" పరమేశ్వరం గాభరాపడ్డాడు

"చింపి చూడండి నాన్నా! ముందుగానే కంగారెందుకు?"

అది ప్లీడరు పరంధామయ్యగారి దగ్గర నుంచి మురళీకృష్ణ తాకట్టు పెట్టిన పెద్ద మనిషి నుంచి, ఇంద్రసేన్, తన క్లయింటు అతనికి తాకట్టుడబ్బు పూర్తిగా ముట్టచెప్పి సదరు తాకట్టును ట్రాన్స్‌ఫరు చేయించుకున్నట్టూ, దరిమిలా తన క్లయింటయిన ఇంద్రసేన్‌గారికి డబ్బు అవసరంగా వున్నందువల్ల అసలీఫాయి దాలతో తక్షణం ఆ నోటుబాకీ తీర్చి తాకట్టు విడిపించుకోమనీ, లేనియెడల తన క్లయింటయిన ఇంద్రసేన్ తీసుకోగల సమస్తమైన కోర్టు చర్యలకూ వారేబాధ్యత వహించవలసివుంటుందనీ ఆ నోటీసు సారాంశం.

"ఇప్పుడేంచేద్దాం కృష్ణా?" పరమేశ్వరం గొంతులో మొట్టమొదటిసారిగా బీదతనం కనిపించింది!

"మీరు ఊరు వెళ్ళొచ్చిన పనేమైంది నాన్నా?"

"నువ్వు చెప్పిందే కరెక్టురా, డబ్బుకట్టేసిం తర్వాతే రీకన్‌సిడరేషన్‌కు అప్లికేషన్ పెట్టుకుంటే మంచిదన్నాడు డింయావో కూడా!"

మురళీకృష్ణ ఆలోచిస్తున్నాడు డబ్బు. డబ్బు డబ్బు కావాలి. తక్షణం ఓ ముప్పై వేలన్నా కావాలి. ఇల్లు విషయంలో తాకట్టు తాకట్టుకాకుండా వుండటానికి. తన తండ్రి ఉద్యోగం నిలవటానికి, ఇల్లు ఇబ్బందులేవీ లేకుండా గడవటానికి. తను ఇంతవరకూ ఏం సాధించాడూ? యం ఏ చదువుకున్నాడు పెళ్ళి చేసుకున్నాడు, అంతకన్నా పురుషకారం ఇంకేం చూపించినట్టూ?

ఇప్పుడే చేయాలి, ఏదో ఒకటి చెయ్యాలి, చేసి చూపించాలి తన సామర్థ్యం? ఇంటిపరువు నిలపాలి. ఆ ఇంద్రసేన్ కొమ్ములు వంచాలి, ఎట్లా? ఎట్లా? ఎట్లా?

మళ్ళీ పరమేశ్వరమే అన్నాడు "కృష్ణా! నువ్వు బాధ పడొద్దు ఊరంతా యాగీగా వుందిరా, ఒకటే గొడవగా వుంది, ఏ గోడమీద చూసినా నిన్నూ మహాలక్ష్మినీ అసహ్యంగా చిత్రిస్తూ రాతలు కళాలయం భవనం దగ్గర బూతుబొమ్మల పోస్టర్లు!! మన సంస్కారం ఎంత పతనం అయిపోయిందో తెలుసుకోడానికి ఇంతకన్నా వేరే సాక్ష్యం అక్కరలేదు ప్రజలు గొర్రెలనడానికి వేరే ఆధారం అనవసరం!"

మురళీకృష్ణ పేలవంగా నవ్వాడు "అది సంస్కారం పతనం కావడం కాదునాన్నా! ఆ ఇంద్రసేన్ డబ్బు మహాత్మ్యం. వాడు మనుష్యుల్ని కొంటాడు, వాళ్ళకు ఎర వేస్తాడు వాళ్ళచేత తప్పుడు పనులు చేయిస్తాడు లేకపోతే మహాలక్ష్మి అంతటి అభాండాన్ని నామీద వేయదు నాన్నా! ఆమెనేదో పంజరలో నవరంధ్రాలూ మూసి బంధించి వుంటాడు నాన్నా!! అట్లాగే వాడి మనుష్యులకు చెప్పి పోస్టర్లు వేసి అతికించి వుంటాడు. ఐడోన్ట్ కేర్. వాడికి తగిన గుణపాఠం నేర్పుతాను!"

పరమేశ్వరం కొడుకును హాల్లోకి తీసుకు వెళ్ళి వో కుర్చీలో కూర్చోపెట్టాడు. తనో కుర్చీలో కూర్చున్నాడు "బాబూ, ఇప్పుడు నేను చెప్పేది సావధానంగా విను ఆవేశపడకు ఆవేశం కార్యహాని"

"ఏమిటి నాన్నా?"

"కుర్రా కోడలూ కొన్నాళ్లపాటు ఎక్కడికైనా వెళ్లండి ఈ వూరి నుంచి దూరంగా వెళ్ళిపొండి!"

"నా న్నా!" మురళి గొంతులో ఆవేశం, అతని వదనంలో వేదన.

"అదే వద్దన్నాను ఆ ఆవేశమే వద్దు తీరుబడిగా, ప్రశాంతంగా ఆలోచించు. ఇక్కడ పరిస్థితులు మనకు ఏమాత్రం అనుకూలంగా లేవు మనకు డబ్బు కావాలి. కాకుల్లాంటి ఈ మనుష్యుల నుండీ రక్షణ కావాలి పట్నం వెళ్ళు ఏదన్నా ఉద్యోగం చూసుకో అక్కడ డైరెక్టర్ ఆఫ్ స్కూల్ ఎడ్మినిస్ట్రేషనుగార్ని కలుసుకో నా గోడు చెప్పు. సహాయం కోరు. ఇదంతా

నువ్వు ఇక్కడ కూచుంటే జరిగేపని కాదు. నేనా తిరగలేను నీకా తిరక్క తప్పదు ఎట్లాగూ నువ్వు వెళ్లుతున్నావు కాబట్టి, పట్నంలో వుండాలి కాబట్టి, కోడల్ని కూడా తీసుకువెళ్లు. ఓ చిన్న ఇల్లు చూసుకో, కాపురం పెట్టు ఉద్యోగం కోసం ప్రయత్నం చెయ్ అంతా సవ్యంగా జరుగుతుంది !''

''మీ ఇద్దర్నీ ఆ రాబందులకు వదిలిపెట్టి నేను వెళ్లలేను నాన్నా !''

''నాకూ, మీ బామ్మకూ వచ్చిన భయమేమిట్రా పిచ్చివాడా! కొట్టవలసిన దెబ్బేదో నా మాడు మీద ఇదివరకే కొట్టేశాడు చావుదెబ్బ! నా ఉద్యోగం పీకేశాడు నా కొడుకు మీద అభాండం వేశాడు నా ఇల్లు తాకట్టుకు కారణమైనాడు ఇంకేం చెయ్యగలడూ ? నువ్వు అన్ని పనులూ పూర్తిచేసుకుని ఎప్పుడెప్పుడు తిరిగివస్తావా అని వెయ్యికళ్లలో ఎదురు చూస్తుంటాం ఒప్పుకోరా మురళీ !'' తండ్రి కంఠం ఎంతో దయనీయంగా, దీనంగా వినిపించింది మురళికి కాదనేహోపిక అతనిలో కరిగిపోతోంది చిట్టచివ్వరి మాటగా వర్ధనమ్మ అన్నది ''నువ్విక్కడే వుంటే రౌడీల్ని ఇంటిమీదికి ఉసికొలిపి, నిన్నెత్తికెళ్ళి బలవంతంగా ఆ మహాలక్ష్మికి మూడుముళ్ళూ వేయిస్తే, మేమేం చేయగలం కృష్ణా ?''

''ఏమ్ బామ్మా, నీ మనవడు అంత చేతకానివాడనుకోకు — ఒకరు ఎత్తుకువెళితే వెళ్ళి, కట్టమంటే కట్టి, గంగిరెద్దులా చెప్పిన పనులు చేయటానికి ?''

''నీ సంగతి నాకు తెలుసు మురళీ !'' అనునయంగా, సాత్వికంగా అన్నాడు పరమేశ్వరం

''అందుకే తండ్రీ! అర్ధం అయేట్టు చెబుతున్నాను పెద్ద కెరటం ఒకటి ఉవ్వెత్తున వచ్చి పడ్డప్పుడు, తల వంచడం వివేకవంతుల లక్షణం ఆ కెరటం అవతలికి పోయింది పోయింతర్వాత మళ్ళీ నువ్వు తలెత్తుతావు అప్పుడు నిన్ను కాదనేవాడెవరూలేరు పైగా నీ తెలివితేటలకు నిన్ను మెచ్చుకుంటారుకూడా !''

మురళికి మరో మాట మాట్లాడటానికి ఇహ ఆస్కారం ఇవ్వలేదు పరమేశ్వరం

''జీవన! అబ్బాయి గుడ్డలు సర్దమ్మా! నీ గుడ్డలు సర్దిపెట్టుకో ఇద్దరు హైద్రాబాదు వెళ్తున్నారు సాయంకాలం బండికి ''

''అర్ధాంతరంగా ఈ ప్రయాణం ఏమిటి మావయ్యగారూ ?'' జీవన బేలగా అడిగింది

''అంతా నీకు తెలుసుకదు తల్లీ! హనీమూన్‌కే అనుకో అదో కొంత తృప్తి !'' వర్ధనమ్మ పెందరాళే వంటచేసి క్యారియర్‌లో పెట్టింది ఓ చిన్న సంసారానికి కావల్సినవన్నీ వో ట్రంకు పెట్టెలో సర్దింది ''ఏమిటో ఈ పంపడం ? అంతా తప్పనిసరైంది కొత్త సంసారం బయలు దేరుతున్నదంటే ఎల్లా పంపించాల్సింది ?'' అనుకొంది, బాధపడింది ఇంటి దగ్గరే జీవన — మురళికి టాటా చెప్పారు వర్ధనమ్మా — పరమేశ్వరమూనూ !

''స్టేషనుకు మేము రాంలే, అదో ఎడ్వర్ టైజ్‌మెంటు ఆ వెళ్ళడం ఏదో గుట్టుచప్పుడు కాకుండానే వెళ్ళిరండి !'' అన్నారు వాళ్ళు అన్నీ సర్దుకుని స్టేషనుకు వెళ్లేసరికి, అప్పుడే వెళ్ళిపోతోంది రైలు ఇహ మర్నాటిదాకా మరో రైలులేదు చుట్టూ అడవి అడవిలోనుండి కీచురాళ్ళ ధ్వనులు చీకటి గర్భం చీల్చుకుని వినవస్తున్నాయ్ ఆ శబ్దాలు

స్టేషన్‌మాష్టరు మురళీకృష్ణను గుర్తుపట్టాడు ''అప్పుడు ఒంటరిగా దిగావు ఇప్పుడు జంటగా వెళ్తున్నావు పాపం రైలు తప్పిపోయిందే !'' అంటూ బాధపడి, మానవ సహజమైన కారుణ్యంతో, ''పోనీ, ఓ పది నిముషాల్లో గూడ్సు బండొకటి వస్తోంది అదీ హైద్రాబాదుకే ఎక్స్‌ప్రెస్ గూడ్స్ ఇక్కడ నీళ్ళకోసం ఆగుతుంది ఆ గార్డుతో చెప్పి ఎట్లాగో ఎక్కిస్తా ఎక్కిపోతారేమిటి ?'' అన్నాడు మురళి జీవనవైపు చూచాడు స్పోర్టివ్‌గా ఓకే అట్లాగే! అన్నాడు ఆ యస్ యమ్ చెయ్యి గౌరవంగా నొక్కుతూ.

## 18

ఎక్స్‌ప్రెస్ గూడ్సు బండిలో రాజధానికి బయలుదేరారు ఆలుమగలు ఓపెన్ క్యారేజిలో వొకదానిలో ఎక్కారు వాళ్ళు పైన నీలాకాశం మిలమిల మెరిసే తారకలు తారకల మధ్య చంద్రుడు రకరకాల వాసనల్ని మోసుకువస్తున్న పైరుగాలి చుట్టూ పంటపొలాలు మధ్య మధ్యలో చిన్న చిన్న ఊళ్ళు ఆ వూళ్ళలో చిరుదీపాలు ఆ దీపాలు ఏ ప్రేయసీప్రియుల తీపి అనుభవానికి కాపలాదారులో! అప్పుడే నిద్ర లేచి తల్లి పయ్యెదచాటున పాల కోసం వెతుకులాడే ఏ పసిబాలుడి మధుర భవిష్యత్తుకు కాంతి బావుటాలో! జీవన కింద హోల్డాలు పరిచింది ఆ హోల్డాలుమీద మహారాణిలా పవ్వళించింది — కాలుమీద కాలు వేసుకుని, తల కింద చెయ్యి పెట్టుకుని గాలికి ఆమె పయ్యెద అటూ యిటూ ఎగురుతోంది ఆమె నల్లని ముంగురులు అల్లరిగా ఆమె వదనాన్ని చుంబిస్తున్నాయి బహుళ పంచమి చంద్రుడు వెన్నెల కిరణాల్ని ఆమె మోహంమీదే మమ్మరిస్తున్నాడు తెల్లని వెన్నెట్లో తెల్లని మోహంలో ఎర్రని పెదిమల వెనుక తెల్లని పళ్ళవెనుక ఎర్రని నాలుక మురళి ఆమె కాళ్ళమీద మోచేతులాన్చి ముందుకు కొంచెంగా వంగి, పరుగెడుతున్న గూడ్సుబండితో పోటీపడుతూ మురళి వాయిస్తున్నాడు అతని గొంతులోనుండి మురళీస్వరం ఉబికివస్తున్నట్లుంది ఆ పెదిమలపైనుండి అది పొంగి వస్తున్నట్లుంది మురళి నుండి ప్రవహిస్తున్నట్లుంది అతను కన్నులరమూతలుగా మూసుకుని వాయిస్తున్నాడు

జీవన సన్నగా తనలో తను పాడుకోవడం మొదలెట్టింది మొదట. అది హమ్మింగ్‌గా మొదలైంది, ట్యూన్ అయింది రాగమైంది అనురాగంతో కలిసి పాటగా మారింది

వేణు వూదినవాడు గోపాలుడు
మనసు దోచినవాడు భూపాలుడు
గోపాలుడు వాడు భూపాలుడు !
ప్రేమ పంచినవాడు భూపాలుడు
ప్రేమ ధామముజేర్చు గోపాలుడు
భూపాలుడు వాడు గోపాలుడు !
సరసాల దొరవాడు భూపాలుడు
మగసిరికి నా రేడు గోపాలుడు
గోపాలుడు వాడు భూపాలుడు !
నన్ను మెచ్చినవాడు గోపాలుడు
ప్రాణమిచ్చినవాడు భూపాలుడు
గోపాలుడు వాడు భూపాలుడు !

గూడ్సు బండికి వేగం తగ్గింది మురళీ రవం కూడా ఉపశమనం పొందింది జీవన పాట ఆగిపోయింది

# ఇ'వేమన' పద్యాలు




పుట్టిన జనులెల్ల భూమిలోపలనుంటె
పట్టుగాను జగములు పట్టదెపుడు
యముని లెక్కరీతి యరిగిపోవుచునుండు
విశ్వదాభిరామ వినుర వేమ.

"ఎక్కడున్నాం మనం ?" అడిగింది జీవన మత్తుగా

"ప్రేమధామంలో !"

బండీ స్టేషన్లోకి వచ్చింది కొంచెం దూరంలో వెళ్ళి ఆగింది ఏ స్టేషనో తెలియడం లేదు స్టేషన్లో దీపాలు లేవు. నిద్రమత్తుగా అసిస్టెంటు స్టేషను మాష్టరు గార్డు దగ్గరకు వచ్చాడు లోడింగ్, అన్‌లోడింగ్ గురించి నాలుగు ముక్కలు మాట్లాడాడు కాగితాలు

## జీ వ న ము ర ళి

వెరిఫై చేశాడు. ఓ పెట్టె తాళం తీశాడు సరుకులు లోపలకు ఎక్కించాడు. మళ్ళీ తాళం వేశాడు కాయితాలు గార్డు కిచ్చేసేడు

ఈలోపల ఇంజను డ్రయివరు కిందకుదిగి తన అవసరాలు తీర్చుకువచ్చాడు గూడ్సు బండీ మళ్ళీ బయల్దేరింది వేగం పుంజుకుంది— తొందర్లో

మురళి జీవన పక్కనే చోటుచేసుకున్నాడు కింద మెత్తని పక్క. పక్కన మెత్తని చుక్క కోరికను రెచ్చగొట్టే గాలి. గాలి దూరేటంత సందులేని బిగి కౌగిలి.

"అబ్బ ! ఉక్కిరి బిక్కిరి చేస్తారేమండీ" జీవన గునిసింది.

మరింతగా కౌగిలి బిగించి ఉక్కిరి బిక్కిరి చేసాడు. ఆమెను గుక్క తిప్పుకోనీయనంతటి గాఢ తమకంలో తన దానివి చేసుకున్నాడు. అతని తొందరపాటుచూసి సిగ్గుపడి చంద్రుదుడు మబ్బుల పక్కకు తప్పుకున్నాడు. అతనిలాగనే— వీచి వాచి అలసిపోయి, గాలి కూడా విశ్రాంతి తీసు కుంటోంది.

జీవన మొహం అంతటా చిరుచెమటలు. ఆ చెమటల్లో చిక్కుపడ్డ ముంగురులు జాకెట్టు గుండీలు పెట్టుకుంటూ, తొలగిన చీరను సర్దు కుంటూ, "ఏమండీ, దాహంగా వుందండీ !" అన్నది జీవన.

తమ తొందరలో వాళ్ళిద్దరూ, వర్ధనమ్మ ఇచ్చిన క్యారేజీ సంగతే మర్చిపోయారు. అంత వరకూ అభోజనంగానే వుండిపోయారు

"భోజనం చేసేయరాదూ ?"

"ఎంతయిందో టైము ?" జీవన అడిగింది

మురళీకృష్ణ వాచీ చూసుకున్నాడు ఒంటి గంట దాటింది.

"ప్రేమ గుడ్డిదే కాదు, ఆకలిదప్పులు కూడా ఎరగదు." మురళీకృష్ణ అన్నాడు

"ఆకలి సంగతేమో కానీ, ఇప్పుడు నాకు అమిత దాహం వేస్తోంది బాబూ !" అన్నది జీవన అర్థింపుగా.

"బండివి ఆగనీ. తీసుకువస్తాను !" మురళీకృష్ణ జవాబిచ్చాడు.

బండి ఆగింది, మళ్ళీ ఎందుకు ఆగిందో తెలీదు.

"బండి ఆగిందండీ, వెళ్ళిరండీ — మంచి నీళ్ళు తీసుకురండీ !"

మురళీకృష్ణ ఆ టిపెన్ క్యారేజీలో నుండి ఒక్క దూకు కిందకు దూకాడు స్టేషను నిద్రపోతోంది లైట్లు నిద్రపోతున్నాయి ప్లాట్‌ఫారంమీద నరసంచారం లేదు. మురళీకృష్ణ మంచినీళ్ళ పంపుకోసం వెతికాడు దూరంగా కనిపించింది. అక్కడకు పరుగెత్తాడు పంపు తిప్పాడు అమ్మయ్య, నీళ్ళొస్తున్నాయి చల్లగా వున్నాయి నీళ్ళు. జివ్వున నరాల్ని లాగేస్తున్నాయి, చేతికి తగిలీ తగలగానే.

అప్పుడు తెలిసివచ్చింది అతనికి నీళ్ళు ఎట్లా పట్టుకుంటాడూ తాను ? పాత్ర ఏదీ ? మళ్ళీ గబగబా క్యారేజీ దగ్గరకు పరుగెత్తాడు

"జీవనా ! జీవన !" అని పిలిచాడు

"ఏవీ — తెచ్చారా ?" జీవన ఆత్రంగా అడిగింది

"నా మొహం ! ఎందులో తీసుకురానూ ? ఆ క్యారేజీ గిన్నెల్లో పైగిన్నెలో బహూశా మజ్జిగ



# డాక్టర్ సలహాలు



డాక్టర్ కె. వెంకటేశ్వరరావు

### పి. వి. ఆర్. - బొంబాయి

నాకు నాభిద్వారాను, పిరుదుల మధ్యభాగం ద్వారాను దూదివంటి పదార్థం వస్తున్నది మల విసర్జనలో అప్పుడప్పుడు నులిపురుగులు పడతాయి

★ ఫంగస్ ఇన్‌ఫెక్షన్ ఉన్నప్పుడు ఇలా దూది వంటి పదార్థం రావచ్చును

ఫంగస్ ఇన్‌ఫెక్షన్‌కి గ్రైసోవిన్, ఫల్విన్—ఎమ్ మొదలయిన మందులు వాడాలి

మలంలో నులిపురుగులు ఉన్నప్పుడు ఇంటెర్మిపాదీ, ఒకేసారిగా పైపరజీన్ సిట్రేట్ మందు రోజుకి మూడు చెంచాల వంతున (రాత్రి పూట) వరుసగా ఒకవారం వాడటం మంచి: ప్రస్తుతం మెబెక్స్ అనే మాత్రలు చాలా రకాల క్రిములను తొలగించటానికి వాడబడుతున్నాయి

### బి. పి. — పాలకొల్లు

14, 15 సం॥ల వయసులో హోమోసెక్సువల్ అయ్యిండి పెళ్ళైన తర్వాత పిల్లలు పుడతారా ?

★ వారి వీర్యంలో స్పెర్మటోజోవాల సంఖ్య మామూలుగా ఉండి వాటిలో అధికశాతం జీవించి ఉన్నవి అయితే— ఎవరికైనా పిల్లలు పుట్టే అవకాశం ఉంటుంది

### డి. ఎస్. ఆర్. — నందిగామ

నా వయస్సు 19 సం లు నాకు మోచేతి మీద, చేతి వేలు మీద పులిపిర్లు వచ్చాయి వీటిని తొలగించాలంటే ఏం చెయ్యాలి ? పులిపిర్లు కేన్సర్‌కి దారి తీస్తాయని కొంతమంది అంటున్నారు నిజమేనా ?

★ శస్త్ర చికిత్స వల్లగాని, కొన్ని రసాయన ద్రవ్యాలవల్లగానీ వీటిని తొలగించవచ్చును

కొన్ని సందర్భాలలో మాత్రం ఈ పులిపురులు కేన్సర్‌కి దారితీస్తాయి అయితే ఇలా జరగటం అరుదనే చెప్పవలసి ఉంది

### ఎస్. ఎల్. — బాపట్ల

8 నెలల క్రితం మెడమీద విపరీతమైన దురదతో ప్రారంభమై, నల్లగా అయి రసి కారుతూ ముఖానికి, చెవులకీ కూడా పాకింది చర్మం బీటలు దీసినట్లుగా పగిలిపోతుంటే డాక్టర్ ఎగ్జిమా అన్నారు ఈ చర్మ వ్యాధికి మందు ఏమిటి ?

★ గీనిని ఎక్సిమా అని అనటం సబబే ! ఈ రోగం ఉన్నవారు లోనికి ఆంటీ హిస్టమినిక్ మాత్రలు (అవిల్, పిరిటాన్ వంటివి) వాడటం, పైపూతగా కార్టిసోన్ కలిసి ఆయింట్‌మెంట్లు వాడటం మంచిది

### డి. ఎం. ఆర్. — కడప

నా వయస్సు 28 సం॥లు ఒక సం॥ క్రితం 'మైట్రల్ వాల్వ్' రీప్లేసిమెంట్ ఆపరేషన్ చేశారు ఇప్పుడు నా ఆరోగ్యం బాగా ఉన్నది వివాహం చేసుకోవచ్చునా ? 7 సం॥ క్రితం మొదటిసారి వివాహం అయింది ఆవిడ ప్రమాదవశాత్తు పోయింది

★ తప్పకుండా చేసుకోవచ్చు

### కె. సి. ఆర్. — పిడుగురాళ్ళ

నాకు మైనస్ 3 5 సైటు ఉన్నది కళ్ళజోడు వాడుతున్నాను సైట్ తగ్గటానికి కంటికి ఎక్సర్‌సైజులు ఉన్నాయని విన్నాను వివరాలు తెలియజేయండి

★ ప్రముఖ్య నేత్ర వైద్యా కేంద్రాలలో ఈ ఎక్సర్‌సైజులు నేర్పటం జరుగుతుంది మద్రాసులోని అగర్వాల్ కంటి చికిత్సా కేంద్రంలోను, శంకర నేత్రాలయంలోను పై సౌకర్యం ఉంది అలాగే హైదరాబాదు, విశాఖపట్నం, గుంటూరు మొదలయిన చోట్ల ఈ సౌకర్యం ఉందేమో తెలుసుకోవటం మంచిది

కంటి పైభాగములో ఉన్న కండరాల పటుత్వాన్ని పెంచటానికి ఈ ఎక్సర్‌సైజులు బాగా పనిచేస్తాయి

### పి. వి. — ఇల్లెందు

నా వయస్సు 19 సం॥లు నాకు కాళ్ళు, ముఖ్యంగా వేళ్ళ మధ్యభాగం చెడిపోయి, ఎర్ర పుండ్లువలె అయి చర్మం ఊడుతుంది పాదం చుట్టూకూడా పగుళ్ళు వస్తాయి దీనికి కారణం ఏమిటి ! .

★ దీనిని ఎపిడెర్మో ఫైటోసిస్ అని అంటారు తడిలో అస్తమానమూ నానటమే ఇలా రావటానికి కారణం

పైపూతగా విట్‌ఫీల్డ్ ఆయింట్‌మెంట్ వాడండి కాళ్ళకి తడి తగలకుండా చూడటం చాలా అవసరం ★

---

వుండొచ్చు. కింద గిన్నెలో సాంబారు వుంటుంది అది ఒలిపోసి, ఆ గిన్నె ఇట్లా ఇయ్యి !"

జీవనకు ఆ క్యారేజీ గిన్నెలు ఓ పట్టాన రాలేదు ఎట్లాగో నానా బాధపడి కొంత సేపటికి, గిన్నె తీసి ఇచ్చింది. అది పట్టుకుని మళ్ళీ పరుగెత్తాడు మురళీకృష్ణసంపు దగ్గరకు పంపు తిప్పి, గిన్నెనిండా పట్టుకుని, అవి ఒలికి పోకుండా జాగ్రత్తగా చూసుకుంటూ క్యారేజి దగ్గరకు రాబోయాడు

అప్పటికే గూడ్సు కదిలిపోతోంది ఓ కూత, చప్పుడూ ఇదీ ఏమీలేదు నిశ్శబ్దంగా దొంగలా జారిపోతోంది పట్టాల మీద

జీవనా ! జీవనా !

మెత్తగా పోతున్న బండి, పోతున్నట్లే తెలయలేదు జీవనకు కొంచెం సేపటికి, మెత్తదనం తగ్గి, కుదుపు ఎక్కువై, ఆమెకు తెలిసివచ్చేసరికి బండీ ఎంతో దూరం వచ్చేసింది జీవన కంగారుగా చుట్టూ ప్రహరీలా వున్న రేకుల దాకా వచ్చి తల పైకెత్తి, ముంగాళ్ళ పైన నిలబడి "ఏమండీ ! ఏమండీ !" అని పిలవసాగింది ఆ నిశ్శబ్ద నిశీధిలో ఆమె ఎలుగు ఆకాశంవింది నక్షత్రాలు విన్నాయి గాలి వింది అవేమీ ఆమెకు జవాబు చెప్పలేదు. జీవన కిందకు దూకుదామనుకుంది రేకులందుకు వీలుపడనీయలేదు "అయ్యో ! అయ్యో ! ఇప్పుడేమిటి చేయడం ?" అంటూ ముంగాళ్ల మీద తల పెట్టుకు ఏడుస్తూ కూచుంది

చేజారిపోయిన బండినీ, బండిలో చిక్కడి పోయిన భార్యను చూస్తూ, మురళీకృష్ణ ప్లాట్‌ఫారం చివరిదాకా పరుగెత్తాడు కానీ అతనికన్నా వేగంగా గూడ్సుబండి పరుగెత్తింది అతన్ని వెనకనే దిగవిడిచింది చీకట్లో, చలిలో, విశాలమైన ఆ రైల్వేస్టేషను ప్లాట్‌ఫారం మీద అగమ్యంగా, అయోమయంగా నిలబడిపోయాడు మురళీకృష్ణ, ముందుకు కళ్లు చికిలించుకుని చూస్తూ

**(ఇంకా వుంది)**

# అప్పీలు కేసు

## గుండు సుబ్రహ్మణ్య దీక్షితులు

"హలో, చేతక్ ధర ఎంతుందండి ?"

"రండి సార్ కూర్చోండి మీకు తెలియందేముంది, మామూలు పద్ధతే! ఈక్వివలెంట్ డాలర్సిస్తే వెంటనే ఇప్పిస్తాం, రూపాయలు డిపాజిట్ చేస్తే రెండుమూడేళ్లకి బండి రావచ్చు"

"నేనడిగేది బ్లాక్ రేటండి!"

"అదా, పదిహేనున్నర"

"ఎక్స్ షోరూమేనా, సెకండ్‌హాండ్ కాదు గదా!"

"షోరూమ్ దగ్గరేనండి నా టేబిల్‌దగ్గరే మీరు కాష్ ఇచ్చేసి ఆయన బండీ మీదే ఇట్నుంచిటు మీరు రిజిస్ట్రార్ ఆఫీసుకెళ్లి అరగంటలో మీ ఇంటికేసి కెళ్లిపోవచ్చు"

"మరి రిజిస్ట్రేషన్ ఖర్చులు ?"

"మీ రిద్దరూ మాట్లాడుకోవటంలో ఉంటుంది అయినా మీరు ఓ నెల ముందర నాకు చెప్తేనే ఇదంతా, లేకపోతే దొరకటం కష్టం మీకు నచ్చిన కలర్ కూడా సెలక్టు చేసుంచుతాం"

"థాంక్సండి!"

*        *        *

"ఎక్స్‌క్యూజ్ మి, చేతక్ బ్లాక్ రేటెంతలో కొచ్చిందండి ?"

"పధ్నాలుగువేలు"

"అదేంటండీ! పోయినసారి పదిహేనున్నరని చెప్పారు!"

"అది రెణ్ణెల్ల క్రితం ధర!"

"ఇంకా తగ్గొచ్చంటారా ?"

"ఏమో ఎవరు చెప్పగలరు ? ఇవాళ్టి రేటిది!"

"బండి దొరకటం కష్టమేమో!"

"అంత కష్టం కాదు"

"థాంక్యూ"

*        *        *

"జస్ట్ మినిట్! చేతక్ ధర తగ్గిందట గదా ?"

"యస్సార్!"

"ఎంతలోకొచ్చింది ?"

"పదమూడున్నర దగ్గర ఆగింది."

"అరె! అంత తక్కువలోనా!"

"అవున్సార్, మార్కెట్‌లోకి వెరైటీలొస్తున్నాయిగదా! అవన్నీ రెండు వెరైటీలొచ్చాయి ప్రిన్సిపుల్ పెంటో హండ్రెడ్ సిసి దిగిపోయింది వెస్పా ఎక్స్ ఇకి తొంభై కోట్లు కలెక్ట్ చేసేసింది కంపెనీ వెస్పా పి యల్ గ్రటా ఏవో ఇంకో రెండు దిగబోతున్నాయి లూనా, హీరోమెజస్టిక్, టి వి యస్, బజాజ్ కంపెనీల ఫిఫ్టీబళ్లు రోలయిపోతూనే ఉన్నాయి అదేదో బాటరీబండి చూసే ఉంటారు గదా ? ఇంత కాంపిటేషన్‌లో చేతక్ ధర తగ్గకేమవుతుంది ? ఏం తగ్గినా తగ్గేది బ్లాక్ రేటే గదా! అసలింకో విషయం ముప్ఫై, నలభై, డెబ్భై, ఎనభై ఇట్లా రకరకాల సి సి లబళ్లున్నాయి అవ్వన్నీ దిగిపోతే ఇహ చెప్పక్కర్లేదు"

"అంటే ఇంకా తగ్గచ్చంటారా ?"

"ఆఁ, నాలుగైదునెలల్లో పన్నెండుకు, పదకొండుక్కూడా దిగొచ్చు!"

"వాట్, పదకొండుక్కూడానా! వెరీ గుడ్!"

"ఇంతకీ బండీ ఎవరికి, మీకేనా ?"

"అహఁ, నాక్కాదు, నాకుందిలెండి అదుగో, ఆ రోడ్డువీాద్దే!"

"ఓహో, అమ్మేద్దామనా! తొందరగా కానిచ్చెయ్యటం మంచిది"

"అమ్మకమూ కాదండి బాబూ ?"

"మరేంటి ?"

"నాదొక గొడవ వ్యవహారంలెండి! మా మామగారి దగ్గర్నుంచి తగులు డబ్బు గుంజాలి! వస్తా!"

"చెప్పేదేదో పూర్తిగా చెప్పి వెళ్లిపోండి సార్! ఇదేదో లిటిగేషన్ కేసులాగుంది!"

"యస్, యస్, కరెక్ట్! అప్పీలు కేసు చెప్పమంటారా రెండేళ్లకిందట నా పెళ్లిలో మా మామగారు ఇరవై వేలు కట్నమిస్తానని పైసివ్వాండా పిల్లని నాంటగట్టేసాడు మంచివాణ్ణి గాబట్టి నమ్మకముంచి పిల్లని తెచ్చేసుకున్నాను చూసి చూసి ఏడాదికిందట ఇహ మా శ్లీక కట్నం కలెక్షను విషయం మధ్యవర్తి ముందర పెట్టాను విషయాన్ని వాళ్లు పదహారు వేలకి ఫైనల్ చేసారు ఒప్పుకున్నాను, మంచివాణ్ణికదా! కానీ మా మామ ఏం చేసాడ్ తెలుసా ? 'ఒరేయ్ చెల్లికొడకా సన్నాసీ, డబ్బు డబ్బుగా ఇస్తే పేకాడేస్తావు, నగల్లో ఇస్తే సేఫ్టీలేదు, ఇళ్లస్థలంగా ఇద్దామంటే నువ్వేమో ఇల్లుకట్టి చావలేవయ్యే, ఆ కాస్త చెక్కా అటు నిరుపేద కులాలవాళ్లు గుడిసెలేసుకుని మాదంటారయ్యే, నేనిచ్చినట్టూ, నువ్వు తిన్నట్టూ. కనక చేతక్ కొనిస్తాను ఇంట్లో బోరుకొట్టకుండా మా అమ్మాయిని పేరంటాలకీ, పెళ్లి పందిళ్లలోకీ, భజన మందిరాల్లోకీ కాస్త తిప్పుతూండు మా అమ్మాయికి కిరీటం చేయిస్తావని నేనెప్పుడూ ఆశించలేదు ఈ మాత్రం చెయ్యి చాలు నీ జన్మ ధన్యమవుతుంది' అన్నాడు ఇవ్వి ఎంత దారుణంగా అరుణారుణంగా ఉన్నాయండీ... అహఁ, చెప్పండి . సహించాను, ఆ మాటలన్నీ సహించాను . సరే ఇంతకీ ఈ బండీయే ఆ బండీలెండి! ఇప్పుడు నేనెంత అన్యాయమైపోయానో మీ కర్థమైందా ? రెండేళ్లక్రితం ఇవ్వాల్సిన ఇరవై వేలని పదహారుకు తగ్గించి ఏడాదికిందట బండి రూపంలో మా మావ నాకిచ్చాడు అదిప్పుడు సావకాశంగా పదకొండుకు పడిపోతోందని మీరు చెబుతున్నారు .. ఒరిజినల్ లావాదీవీ ప్రకారం డిఫరెన్సు తొమ్మిది వేలు నాకు రావటం న్యాయం! కనీసం మధ్యవర్తి పరిష్కారం అయినా అయిదువేలు రావాలిగదా !.. అసలుకన్నా వడ్డీ తప్పదుకదా! అర్ధరూపాయి చొప్పునేలెండి . ఏడాదికే అయిదు వేలకీ మూడొందలు! వెరశి అయిదు వేల మూడొందలు నాకు హక్కుందా లేదా చెప్పండి? ఆ మధ్యవర్తుల్నే వెళ్లి అడగమంటాను .. వస్తాన్సార్ పదకొండుకన్నా ఇంకా తగ్గితే మాత్రం చిన్న ఫోనొకటి, ట్రిబుల్ టూ కి కొట్టండి – మా బాంకు ఫోన్లెండి – మీ మేలు మర్చిపోను నా అప్పీల్లో అంకెలు మార్చుకుంటాను వస్తాన్సార్!"

"మరి మీరు ఏడాదిబట్టీ బండి అనుభవించారు గదా, దానికీ ఈ సొమ్ముకీ చెల్లన్వదా ?"

"ఏంటీ, అనుభవం ఖరీదు అయిదు వేల మూడొందలా! దారుణం! కావలిస్తే ఓ అరవెయ్యో, వెయ్యో తగ్గించుకోమనండి దట్సాల్!"

"ఒకవేళ బండి ధర ఏ ఇరవై వేలకో పెరిగుంటే నాలుగు వేలు మీరు మీ మామగారికిచ్చేవారా ?"

"అహ్హహ్హహ్హహ్హహ్హ! మీరు భలేవారండీ! ఇక్కడొక జగత్సత్యముంది కల్పవృక్షమూ, కామధేనువూ, పాలసముద్రమూ – ఇవ్వి వన్ వే ట్రాఫిక్ సూత్రాన్ని పాటిస్తాంటాయి మన కిస్తాంటాయేగాని, మందగ్గిర

పుచ్చుకోవు! పిల్లనిచ్చిన మామ కామధేనువు లాంటివాడు పిండుకోటమే మన పని మనం ఎదురివ్వక్కర్లేదు . ఇహిహిహి. . వస్తానాసర్!''

''ఇంతకీ మీ మామగారి పేరేంటన్నారు?''

''వజ్రాల నవనీతం!''

''నవనీతంగారా, చంపేసారు పొండి! ఆయనకి నేనేగదండీ నా బండిని తొమ్మిదివేల కమ్మింది! రంగేయించిం తర్వాత దాన్ని మీకిచ్చా రన్నమాట!''

''ఆఁ, తొమ్మిదివేలా! ఎంత అన్యాయం! అయితే . ఆయన నాకిప్పుడు ఏడువేలూ ప్లస్ వడ్డీ బాకీ అన్న మాట!''

''అసలు సార్, అయిదేళ్ల క్రితం ఈ బండిని నేను కొన్నప్పుడే సెకండ్‌హాండ్‌ది!''

''వ్వాట్!''

''అసలు నవనీతంగారు మీకు ఇరవై వేలూ ఇవ్వాలనే మీ పెళ్లయిన నెలరోజులకి డబ్బు తీసుకుని బయల్దేరార్ట మీరుంటున్న ఇల్లు మీరు చెప్పినట్టు మీ స్వంతిల్లు కాదని తెలిసింది. ఆయనకీ చిరాకొచ్చింది ''

''అయితే ఆయనకేం నష్టం?. ఆయన కూతుర్ని ఏలుకునేది నేనా, ఇల్లా?''

''ఆయనసలివ్వడేమోనని భయపడి మీరు మధ్యవర్తుల్ని పెట్టుకున్నారు గదా! వాళ్ల మాటకీ ప్రెస్టేజికి కట్టుబడి మీకిద్దామని పదహారు వేలూ సిద్ధం చేసుకునేసరికి ఓ సుప్రభాతంలో మీరు మొదట్నుంచీ చెప్పుకున్నట్టు మీ క్వాలిఫికేషను డిగ్రీ కాదనీ, టెన్త్‌క్లాసనీ కూడా తెలిసిపోయి ఆయనకి మతిపోయి, తిక్కరేగిపోయింది. సెకండ్‌హాండ్ బండీ కోసం తత్‌క్షణం ఊరంతా వెతికి వెతికి నా దగ్గరున్న బండీని తొమ్మిదివేలకి కొనేసాడు పదహారు వేలయిందని చెప్పి మీకిచ్చేసాడు.''

''ఓర్నాయనో, ఎంత పన్చేసాడు! ఆయన కూతురు కాపరం చేసేది నాతోనా, డిగ్రీ కాగితంతోనా? .. దిస్ ఇజ్ సింపుల్ డిసీట్, ట్రిక్, ఫేక్, కన్నింగ్! ఎడల్టరీ, హిపోక్రసీ, హాండ్ గివింగ్, వాట్‌నాట్! .. తతక్షణం ఆయన అంతు తేల్చుకుంటాను ఇంతకి తెగిస్తాడా! . హ్హాఁ!''

''తేల్చుకోండి, తేల్చుకోండి, ఆయనిప్పుడు లాయరు గారింట్లో ఉన్నాడు ''

''లాయరుగారింట్లోనా, ఎందుకూ?''

''ఎందుకా, బండి రిజిస్ట్రేషను చేస్తున్నప్పుడు రాతలో మీరు ఆయనకి దొరికిపోయారుట మీరు సెంట్రల్ బాంక్ ఆఫ్ ఇండియాలో పన్చేస్తున్నట్టు ఆయనెదురుగా రిజిస్ట్రార్ ఆఫీసులో అప్లికేషను రాసిచ్చార్టగా! మిమ్మల్ని కలవటం కోసం ఆయన నిన్న బాంక్ కెడితే మీరు వర్క్ చేస్తున్నది ఆ బాంక్‌లో కాదనీ, కోఆపరేటివ్ సెంట్రల్ బాంక్‌లోననీ తేలింది! రామబాణంలాగా ఆయన రిజిస్ట్రార్ ఆఫీసుకెళ్లిపోయి మీ స్వహస్తాల్తో రాసిన అప్లికేషను తాలూకు ఫొటోస్టాట్ కాపీని సంపాదించేసాడు, తననీ, బాంకినీ మోసం చేసినట్టు మీ మీద కేసు పెట్టపోతున్నాడు వింటున్నారా?''

''ఊఁ''

''ఆయన స్కూటర్ని ఆయనకిచ్చేస్తేనేగాని మిమ్మల్ని వదిలేట్టులేదు!''

'' ''

''అరె, అదేంటి, మాటామలుకూ లేకుండా అట్లా హఠాత్తుగా లేచెళ్లిపోతున్నారేంటి సార్, మీ అప్పీలు కేసెప్పుడు పెడతారు? మీరు కుడి రోడ్డుకెళ్తున్నారేంటి సార్! లాయర్ గారిల్లు ఎడమ రోడ్డులోనండి బాబూ! ఇటు, ఇటు ప్చ్ ఇప్పట్లో ఇంకీ చుట్టుపక్కల కనిపించడు కాబోలు, పూర్ ఫెలో! '' ★



*Printed and Published by S. Nageswara Rao at the Andhra Patrika Press, Mallikarjuna Rao Street, Gandhinagar, Vijayawada-3, Editor: S. Radhakrishna.*







నా తనువుకు తగ్గ సబ్బు ఒయాసిస్
నా మనసు మెచ్చిన సబ్బు ఒయాసిస్
నేను నమ్మిన సబ్బు ఒయాసిస్

ఒయాసిస్
టాయిలెట్ సబ్బు

తెలుపు, గులాబి మరియు
ఆకు పచ్చ రంగులలో లభిస్తుంది.

ఒస్వాల్ ఏగ్రో మిల్స్ లిమిటెడ్,
న్యూ ఢిల్లీ వారి నాణ్యమైన ఉత్పాదన.


'నూలు ఉత్పాదకాలు'
మానవ అపురూప
సృజనాత్మక రూపకల్పనే
రాజ్ కమల్ వారి
కాటన్ ప్రింటు చీరలు
300 రకాలకు పైగా గ్యారంటీ గల
ముదుర రంగులలో రాజ్ కమల్ వారి
నూలు చీరలు సుతిమెత్తని సౌరభాలకు
వాటిలో గల మౌళికమైన మిశ్రమాలే
వాటి గొప్పతనానికి మూలకారణం
రాజ్ కమల్ వారి షెబానా చీరలో
సినీతార జయప్రద
రాజ్‌కమల్
కాటన్ ప్రింటెడ్ చీరలు
Internationals
MARKET QUEEN
342178®
KIRON/RKS/831